# భారతి

సెప్టెంబరు 1969



వ్యవస్థాపకులు

దేశోద్ధారక నాగేశ్వరరావు పంతులు.

వెల ఒక రూపాయి

# విషయానుక్రమణిక

## సెప్టెంబరు 1969

# చలివేందిర

## శ్రీ పరిగి రాధాకృష్ణ

నా కెవరిమీదా పగలేదు
మనసులో ఏమీ సెగలేదు
ఉడుకు మోత్తనం లేదు
దుడుకు పాలసలే లేదు
నా వాక్కెవరినీ ఈసడించటానిక్కాదు
నీతులు చెప్పటానికంతకంటే కాదు
మనసులో వికారాన్ని పుట్టించుకుని
మాటల్లోకి దాన్ననువదించటం నాకు రాదు.
సహస్రాంశమైనా సంస్కారం సుసంపన్నం కాగలిగితే
సమచిత్తంతో బ్రతుకులోని సుఖదుఃఖాలనందుకో గలిగితే
సమగ్రదృష్టి మాటలోనూ చేతలోనూ మనగలిగితే
సంతోషిస్తాను కొండంత సంబరపడతాను.

తీవ్రమైన ఆఘాతాల ఒత్తిడికి తట్టుకునీ
దట్టమైన మబ్బులు పరచిన నీడల్లో మసలుకునీ
కావాలని కన్నీటిని బిగబట్టి అసహాయత నావలకు నెట్టి
కరుణార్ద్రగీతం రాయాలని కంకణం కట్టిన నన్నుచూసి
వ్యవహారదృష్టిలేదని వంకబెడితే వ్యథచెందను
అవహేళన మాటలు విసిరితే అదిరిపడను
మహత్తర ప్రేరణకు మూలమైన నిర్మలాంతఃకరణ
మహిమాన్వితమైన జీవితంలోని విలువల స్మరణ
మనసులో విచిత్రంగా కదిలే ఒకానొక స్ఫురణ
నా గీతాలకు దోహదాలివి.

తోచిన నాలుగు ముక్కలూ తూచి చెప్పాలనే తపనతప్ప
తొక్కినదారి కాకుండా కొత్తదారి తొక్కాలనే కోరిక తప్ప
తొలకరి జల్లులా స్పృశించి హరివిల్లులా హసించి
తోరణంలా పచ్చగా తారుణ్యంలా నిండుగా భాసించి
తీగెలల్లుకున్న పందిరిలా శోభించి రాగముంచుకున్న వీణలా రవళించి

# భా ర తి

తాలిమి మేలిమిగా క్రూరిమి కలిమిగా జీవించి
తరంగంలా లేచి కురంగంలా దూకి చేతన చూపించి
'తడి'గల జీవితాన్ని నిజాయితీతో చిత్రించాలని తప్పు
తీర్పుగా ఇ దిలాగని అ దలాగని చెప్పటం నా అభిమతం కాదు
తీవ్రంగా గాయపరచి అదే సాహసమనుకునే మూర్ఖత నాలో లేదు.
తీక్షణంగా రాసి ఎదుటివాని గుండెలో మంటలు రేపటం చేతగాదు.
అందరూ బంధనాల్లో ఇరుక్కున్న వాళ్ళే.
అందరూ బలహీనతల వలయాల్లో తిరుగుతున్నవాళ్ళే.
మంచీ చెడూ పట్టూ విడుపూ వర్తించని దెవరికి ?
పాప పుణ్యాలూ సుఖదుఃఖాలూ వేర్వేరైన జీవిత మెక్కడుంది?

చెలిమి నా బలం.
చెవులు కొరికే వాళ్ళని నేను ఖాతరు చేయను
చేరదీయగల వాళ్ళని నిర్లక్ష్యం చేయను
చిత్తశుద్ధిలేని వాళ్ళతో చేతులు కలపను
చరిత్ర హీనులైనా చపలచిత్తులైనా ఛాందసులైనా
చలివేందిరకు దాహం తీర్చుకోవటాని కొచ్చిన వాళ్ళెవరైనా చీదరించుకోను

చెల్లాచెదరైన కాంక్షల్నిచేర్చి కడతాను మాలగా
చెదరిపోతున్న ఆశల గుంపుల్ని చేరుస్తా నొకచోట
చెమ్మగిలిన కళ్ళలోకి నెమ్మదిగా చూస్తాను
చేతనైనసాయం గుట్టుగా చేస్తాను.

కనిపించిన దాన్నిచూసి కళ్ళేస్తావు విలువ నీవు.
కానీ నేను కారణాలకోసం వెతుక్కుంటూ
మనిషినీ మనసునీ కదిపే కుదిపే పరిస్థితుల్ని పరిణామాల్ని
గుణించుకుంటూ అనుభవాల్ని వింగడించుకుంటూ
బహిర్వేదన అంతర్మథనాని కెంతవరకు మూలమో
ఆలోచించుకుంటూ రాసుకుంటూ కదులుతుంటాను
జీవుని వేదనను జిజ్ఞాసకు ముడేసి జీవిస్తుంటాను.

నా వాక్కవుతుంది వజ్రం
చెడును ఖండించటానికి.

అదే అవుతుంది పువ్వు
మంచి నలంకరించటానికి.

---

# వీరరాఘవము*

## శ్రీ ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

ఋతుసంహార రచనము తరువాత కాళిదాసు చేతి నుండి వచ్చిన గొప్పకావ్యము రఘువంశము. రఘుకావ్యమును నిశితముగ చదివి ముగింపగనే ఇది 'వీరరాఘవము' అని స్ఫురించును. రఘు మహారాజా జీవితములోని ఏకైక తేజోధార ఆతని నిరతిశయ వీరత్వము. అది ధర్మ, యుద్ధ, దాన, దయా రూపములతో ప్రఫుల్లమై ఆతని చరిత్రను, వీరరసపరిమళ భరితముచేసినది. ఆతని జీవన కథలచే ఉత్తేజితుడై కవి ఈ మహాకావ్య రచనమునకు ఉపక్రమించెను. ఆ జీవనకాంతి శక్యమైనంతవఱకు కావ్యమునందంతటను ప్రసరించినది. ఆ వీరితా విస్ఫూర్తికి తండ్రిదిలీపుడు మూలద్రవ్యము.

ఋతు కావ్యము తరువాత కవి అఖండ కవితా తపస్సు చేసినాడు. ఆతని తపోభూమి రామాయణము. ఆ రఘువరచరిత తపఃఫలముగ 'తదుపగత సమాస సంధియోగము' 'సమమధురోపనతార్థ వాక్యబద్ధము'ను అయి ఈ రఘువరచరితము ఉద్భవిల్లినది. పిమ్మట పద, వాక్య, ప్రమాణ శాస్త్రములతో సుపరిచయము కల్గినది. భావసంయమనమును, వ్యంగ్యసౌందర్యమును పట్టుబడినవి. మానవ హృదయ రహస్యములును, ప్రకృతి మర్మలీలలును సాక్షాత్కరించినవి. వేదాంత దర్శనము, సాంఖ్య యోగములు, రాజనీతి, నృత్య నాట్య చిత్ర సంగీత కళలును మనసువిప్పి మాటలాడినవి. ఈ నూత్న బలముతో నాతడు తొలి మహాకావ్య రచనమునకు పూనుకొనెను.

అయితే—కవీంద్రుని రచనా లక్ష్యమేమి? ప్రభువుల ప్రశంసలకా? రసికుల సాధువచనములకా? ఆత్మైక ప్రమోదమునకా? ఈ రచనా ప్రవృత్తిలో కవి హృదయమేమి? అనియొక ప్రశ్న.

'ఆ కాలమున రాజకీయ కల్లోలములు ప్రజాసంక్షోభము, చెలరేగియున్నవి. అప్పుడే అనార్షమైన పరాయిసామ్రాజ్యము కూలిపోయినది. రాజకీయమైన అనైక్యముతో దేశము తీసికొనుచున్నది. ఆ అదనులోనే శుంగవంశీయులు వైదిక ధర్మ పునరుద్ధరణమునకై కృషిచేయ దొడంగిరి. పశ్చిమ సరిహద్దులలో బోలాన్ కనుమలగుండ శకుల దండయాత్ర ప్రారంభమైనది. అప్పుడు విక్రమార్కుడు వైదికధర్మరక్షణకు బద్ధకంకణుడైనాడు. తత్కాలీనుడైన కాళిదాసు భారత సంస్కృతిని, జాతీయభావసంపదను సాహిత్యపరముగా వెదజల్ల దొరకొనెను.'

అని కొందఱు చరిత్రకారులు చెప్పిన అంశములను ఐతిహాసికు లందఱును అంగీకరించినను అంగీకరింపకున్నను కావ్యాంతరంగమును శ్రద్ధగా పరిశీలన చేసినవారికి ఈ క్రింది అంశములు విస్పష్టములగును.

కాళిదాసు తన కావ్యములను—అందు ముఖ్యముగా రఘువంశమును, వినోద విలాసములకై వ్రాయలేదు. ఒక నిర్దిష్ట మహాప్రయోజనమునకై ఆతని కంఠశంఖము మ్రోగినది.

ఆతని అపూర్వకవిత్వ శోభాయవనికలనుండి జాతీయ మహాభిమానము తొంగిచూచును. చిఱుత రాజ్యభాగములను ఒకే సితాతపత్ర చ్ఛాయ క్రిందికి తెచ్చు సముత్సాహము దర్శన మిచ్చును. భారతీయోదాత్త సంస్కృతి సర్వతోముఖముగ ప్రత్యక్ష

* 'కాళిదాస కళామందిరము' రెండవ వ్యాసము.

మగును. వీరత్వ, ధీరత్వములు; ఆర్యావర్తనీతి, ధర్మములు కనుల మిఱుమిట్లు గొలుపుచు గాన్పించును. తన హృదయము, అభినివేశము, సంపూర్ణముగా ప్రతిఫలించుటకై ఆదర్శమహాపురుషుల చరిత్ర చిత్రణము నాధారము చేసికొనెను.

బృహత్కథా, కథాసరిత్సాగరకథల ప్రాబల్యము వెనుకపట్టినతరువాత రామాయణ, భారతకథలు ప్రజలలో గాఢమైన పలుకుబడిని సంపాదించినవి. కాళిదాసు కాలమున రామాయణము నాదరించుటయే గాక సూర్యవంశ రాజచరిత్రలందే విశేష గౌరవాదరములు చూపుచున్నటులు కాన్పించును. కనుకనే ఈతడు వాల్మీకిమహర్షి విన్యసించిన రామకథయందే గాక బహుగుణ సురభిళములైన తక్కిన రఘువంశ గాథలందుగూడ గాటముగ మనసు నిలిపెను. ఈయన గ్రహించిన రఘువంశ చరిత్రలో రామాయణ కథకు తప్ప తక్కినవారి చరితముల కాధారమేమో సరిగా తెలియదు. కవి రఘువంశకృత్యాదిని ఆ రచనము తన శక్తికిమించినదనియని వినయస్ఫూర్తిని ప్రకటించినను, 'వజ్రముచే తొలిపొడిచిన రత్నమున దారము సులభముగా పోవునట్లు పూర్వకవులు త్రోవచేసిన ఈ వంశానువర్ణనమునందు నాకు దారి సుకరమే కావచ్చును'' అనిచెప్పి రచనము ప్రారంభించెను. ఇచట పూర్వ సూరిశబ్దముచే ఒక వాల్మీకినే కవి యుద్దేశించె ననుటకు వీలులేదు. ఇచటి బహువచనము పూజ్యార్థకమేకాక విష్ణుపురాణాదికమును గూడ స్పృశించుచున్నట్లు కాన్పించును. ఎందుచేతననగా ఈతడు స్వీకరించిన వంశక్రమము రామాయణము కంటె విష్ణుపురాణమునకు సన్నిహితముగా నున్నది. కవి యిందు స్వీకరించిన వంశక్రమము భాసుని ప్రతిమయందును కాన్పించుచున్నది. దీనినిబట్టి భాసునకును, కాళిదాసునకును మూలమైన సూర్యవంశకథ ఏదో మఱియొకటి యున్నట్లు భాసింపక తప్పదు. విష్ణుపురాణ సూర్యవంశ రాజపట్టికయందు ఎక్కడనోతప్ప సాధారణముగా ఏ రాజునకును 4, 5 పద్యములకు మించిన చరిత్ర కన్పట్టదు. అట్టినామమాత్ర రాజచరిత్ర అద్భుత సన్నివేశములతో, చైతన్య పూరిత కథాగమనముతో ఇంతటి సుందర కావ్యముగా ఎట్లు సాక్షాత్కరించినదా? అని మన మాశ్చర్య చకితుల మగుదుము.

స్థూలదృష్టితో రఘువంశ కథను జూచినప్పుడు ఆ కథ దిలీపరాజుతో ప్రారంభమగుటకును, అగ్నివర్ణునితో అంతమగుటకును కారణము కాన్పింపదు. అందఱు రాజుల చరిత్ర ఒక్కచోట చేరినసైక్యము లోపించునట్లుగూడ తోచును కాని సూక్ష్మేక్షికతో రఘువంశమును పరిశీలించిన ప్రతిభాసంపన్నమైన కవికథా విన్యాసము గోచరించును.

వస్తువుల తేదీలపట్టికవంటి కొందఱురాజుల చరిత్ర తీసికొని ఉత్తమ కావ్యముగా మలచుట ఏతన్మాత్రులకు సాధ్యమైన పనికాదు. అది ఒక మహాశక్తి సంపన్నుడైన కవికిమాత్రమే సాధ్యమగును.

ఆదినుండి అంతమునకు ఒక్కసారి కలయ జూచితిమేని తొలుత ధర్మదీక్షితుడును, పురుషోత్తముడును అగు దిలీపుడును, తుదిని 'స్త్రీ విధేయ నవయౌవనుడును', వ్యసనపరుడును అగు అగ్నివర్ణుడును కాన్పింతురు. ఏమిా మహాకవి గంభీర రచనము? ఏమి మానవ జీవిత వ్యాఖ్యానము? ఎంత ఉదాత్త ధర్మబద్ధముగ, ఉత్తమాశయ పరిపూర్ణముగ బయలుదేరిన వ్యవస్థయైనను, ఎల్లకాలమును తన బలమును నిలబెట్టుకొనలేదు. కాలక్రమమున అది ఆదర్శములను నిర్లక్ష్యముచేసి, ఔన్నత్యముల నుండి దిగజారి, వ్యసనములకు బానిసయై పతితమై పోవుట సహజము. ఈ పరమార్థ మెఱిగి ఎప్పటికప్పుడు మానవజాతి తన్ను దా దిద్దుకొనవలయును. లేనిచో తిరిగి తలయెత్తలేని అధోగతికి పోవును.

కళాపరముగ గూడ రఘువంశములోని ఈ దిలీప, అగ్నివర్ణ చిత్రణము గొప్పప్రయోజనమును సాధించుచున్నది.

ఒక మహాశిల్పి చిత్రించిన శిల్పము వెలుగు నీడలు చూపుటలో పరిణతమై జీవకళ లుట్టిపడును

కాన్పించును. అటులే ఈ రఘువంశచిత్రము దిలీపుని వెల్గుతో, అగ్నివర్ణునినీడతో ఎల్లకాలమునకును సజీవముగా దర్శన మిచ్చుచున్నది.

రఘువంశమున వరుసగా పలువురు సూర్య వంశరాజుల చరిత్ర వర్ణింపబడినమాట వాస్తవమే! కాని ఈ వర్ణనము కృతకముగ రంగు లతికించిన లక్క కట్టెవలె తేజోహీనముగ కాన్పింపదు. మఱి — చిత్రవర్ణ సవిభాకృతమైన ఇంద్రధనువువలె మురి పించును. ఇందలి వివిధకథలు తెగిన దండలోని పూలవలె అటునిటు చెదరక ఒకే సూత్రమున గుంఫి తములయిన పుష్పములవలె ఏకాకృతిగ కాన్పించును. దీనికి కవి వేసికొన్న పథకము ప్రశంసనీయమైనది.

అందఱు సుక్షత్రియులే; శౌర్యశాలురే; ప్రజాను రక్తులే; కాని అందఱి జీవితములందలి అన్నిఅంశ ములను పూసగ్రుచ్చినట్లు వర్ణింప దొరకొనినచో ఆ కావ్యము పునరుక్తిబహుళమై బింబ, ప్రతిబింబ వర్ణనములతో నిండి తుదముట్ట జదువుటకు దుర్భర మయిపోవును. ఈ విషమస్థితిని గ్రహించియే ఈతడు తన కథాపురుషులైన రాజుల చరిత్రములందలి అన్నివిషయములను తడవక ఒక్కొక్కరాజునందు స్ఫుటమైన ఒక్కొక్క లక్షణమును మాత్రము కైకొని దాని వికాసమును వర్ణించి అతనిని విడిచి వేయును. కావ్యరీతిలో కవికి వర్ణ్యములయిన అనేక రసవదంశములను ఒక్కొక్కరాజునం దొకటిగా వర్ణించి తన కావ్యత్వసిద్ధిని అద్వితీయముగా పోషించుకొనెను.

కావ్యమును తెఱువగానే మొదట దర్శన మిచ్చు సూర్యవంశప్రభువు దిలీపుడు! కవి తన ధర్మ చిత్రణమునకు ఈ మహారాజును లక్ష్యముగా గైకొనెను. ఇతని యందీయొక్క లక్షణమే మనకు ప్రముఖముగ సాక్షాత్కరించి తక్కిన అంశములు తిరోహితము లగును. అట్లే రఘువు అర్థపురుషార్థమునకు మూర్తి కల్పనముగ గాన్పించును పిమ్మట కామ పురుషార్థరూపిగ అజరాజు కనబడును. అవతార మూర్తియగు రామచంద్ర కథాను వర్ణనమున మోక్ష పురుషార్థము ప్రధానమై పొడగట్టును.

కాళిదాసు రఘువంశమును వీరరస ప్రధాన ముగా నిర్వహించెను. ఈతడు శృంగారప్రియుడని యెంత ప్రసిద్ధియున్నను, దానిని సంయమనముతో హద్దులలో నుంచెను.

రఘువంశము మూలపురుషుడు దిలీపుడు. కవి ఈతనిని 'స్వహస్తార్జిత వీరశబ్దః' అని కీర్తించెను. ఈతని అర్థ, కామములు సైతము ధర్మ నిమిత్తములేయని చెప్పెను 'అప్యర్థకామౌ తస్యాస్తామ్ ధర్మ ఏవ మనీషిణః'. ఇట్టివానిని మహర్షులు ధర్మోత్తరు డందురు. రఘువంశాదిని కవి తద్వంశ మహాపురుషుల సుగుణములను వర్ణించుచు, ఆ రాజు లకు 'ఆఫలోదయ కర్మణామ్' అనునొక విశేషణము నుపయోగించెను. అందు మొట్టమొదట జెప్పఁ దగినవాఁడు దిలీపుడు. ఈయన ధర్మవీరుడు. ధర్మము కొఱకై ఈయన చూపిన త్యాగదీక్షలు అనన్య సాధా రణము లయినవి.

వీరుఁడనగా కత్తివిసరి యుద్ధముచేసి శత్రు విజయము నొందువాడే కాడు; తాను నమ్మిన లక్ష్య సిదికై నిర్విరామ కృషిచేసి ఎంతటి పరీక్షలకైనను నిలిచి కృతార్థుడైనవాడును వీరుడేగదా?

వైవస్వతమనువు వంశమున క్షీరసాగరమున చంద్రునివలె ఉద్భవించినవాడు దిలీపుడు. ఆతని పట్టమహిషి సుదక్షిణ. వారు సంతానహీనులు. వివాహ ఫలము సుపుత్ర ప్రాప్తి. 'ప్రజాయై గృహమేధి నామ్' అనునది వారి వంశాదర్శము. వారి ఆదర్శమే కాదు; అది వేదోక్త ధర్మము. 'ధర్మప్రజా సంప త్యర్థగ్ం స్త్రియ ముద్వహే'. ఆ ధర్మమాతనియెడల లోపించినది. ఆ లోపమును పూరించుకొనుటకై ఆ రాజు సపత్నీకముగ కులగురువు వశిష్ఠుని ఆశ్రమ మునకు వెళ్లి ఆతని ఆదేశమున కామధేను పుత్రి నందినిని నిష్ఠతో సేవించుచుండెను. అట్లు ఇరు వదియొక్క రోజులు గడచినవి. మఱునాఁడు యథా పూర్వకముగ దిలీపుడు నందినిని అడవిలో మేతకు వదలి పర్వత శోభను చూచుచుండగా ఆకస్మికముగ

ఒక సింహమువచ్చి ఆ గోవును పట్టుకొనెను. దాని పెల్లఅపు విని రాజు విల్లెక్కువెట్టి బాణము సంధింపదలచెను. కాని కుడిభుజము స్తంభించి పోయినది. ఆతఁడు నివ్వెఱపడి చూచుచుండగా సింహము నవ్వి 'రాజా! నీవు బాణము ప్రయోగించినను నా యెడల వ్యర్థమే అగును. నేను శివభృత్యుడను. సింహరూపమునయున్న నాకు దొరకిన ఈ గోవు నేటి నా ఆహారము. దీనిని శస్త్రముతో రక్షింపలేవు ఊరకుండుము' అనగా రాజు దిటవుగా నిలిచి 'ఇప్పుడు నేనేమి పల్కినను హాస్యాస్పదమే! ఒకమాట వినుము. ఇది మా గురుధనము నశించిపోవుచుండగా ఊరకుండజాలను. దయచేసి నా శరీరము నాహారముగా గొని దీనిని విడిచిపుచ్చుము' అని చెప్పెను.

ఏమి విధిచిత్రము! తా నేమనుకొని గురుసన్నిధికి వచ్చెను! ఏమి జరిగినది! ఒక్క ధర్మము లోపమును తీర్చుకొనుటకు రాగా వేరొక ధర్మము లుప్తమైపోవుచున్నది! స్వశరీరమును రక్షించుకొని వేరొక విధముగ వంశోద్ధారకుని బడయుటయా? లేక గురుధనమైన గోవును రక్షించుటకై సర్వనాశనము నొందుటయా? ఏది కర్తవ్యము? క్షతమునుండి యొక ప్రాణిని రక్షింపలేని క్షత్రియత్వ మెందులకు? ఇట్టి అసమర్థుని కీర్తివంశము నిలిచియేమి? నిలువకున్న నేమి? తుట్టతుద కా రాజన్యుడు సర్వనాశనమైనను, క్షత్రధర్మమును కాపాడవలయుననియే నిశ్చయించెను.

దిలీపుని నిశ్చయమును నిపుణముగ ఖండించి సింహము రాజును ప్రలోభ పెట్టజూచెను. రాజు తన అమోఘవాక్చాతురితో పైచేయి అయెను. ఈ సన్నివేశ నిర్వహణములో, సంవాదచాతురిలో దిలీపుని ధర్మ, దయా వీరములు వెలుగులు చిమ్మినవి.

సింహము తీయని ప్రలోభ మిది:—
ఏకాతపత్రం జగతః ప్రభుత్వమ్
నవం వయః కాన్త మిదం వపుశ్చ!
అల్పస్య హేతోః బహు హాతు మిచ్ఛన్
విచారమూఢః ప్రతిభాసి మే త్వం ॥

'రాజా! ఈ చక్రవర్తిపదవిని, నవయౌవనమును, మనోహరశరీరమును ఈ స్వల్పకారణమునకు విడువదలచుచున్నావా? ఎంత ఆలోచనాశూన్యుడవు?'

అంతియే కాదు.

'నీ శరీర మర్పించిన ఈ గోవొక్కటియే నిలుచును. నీవే బ్రతికిన ఈ లోకమంతయును నిలుచును. నీ గురువుగ కంటివా? ఈ గోవునకు బదులుగా కోటి గోవుల నీయగలవు. కనుక కల్యాణకరమైన ఈ దేహమును రక్షించుకొనుము.'

ఏమి సింహపుమాటకారితనము! ఈ మాటలందెంత చనవు! ఎంత లాలనము! ఎంత హేతువాదము! అన్నిటికిని వెనుక ఆతని నిస్సహాయత్వముపై ఎంత నవ్వుని ఎత్తిపొడుపు!

ఈ మాటలు రాజు ధేనురక్షణదీక్షను సడలింపలేకపోవుటయే గాదు; సింహపు దురాక్రమణమునకు లోనయి తనవైపు జాలిచూపులు చూచు గోమాత కన్నులు ఆతని హృదయమును కరగించివేసెను.

'ధేన్వా తదధ్యాసిత కాతరాక్ష్యా
నిరీక్ష్యమాణః సుతరాం దయాళుః'
రాజు ప్రత్యుత్తర మిది:
క్షతాత్కిల త్రాయత ఇత్యుదగ్రః
క్షత్రస్య శబ్దో భువనేషు రూఢః
రాజ్యేన కిం తద్విపరీత వృత్తేః
ప్రాణై రుపక్రోశ మలీమసై ర్వా

'క్షత్రియుడనగా ఒకరిని పీడనుండి కాపాడువాడు గదా? అట్లు చేయలేని వానికి రాజ్యమెందులకు? నిందా భాజనములయిన ప్రాణము లెందులకు?' అని చెప్పి వేఱొక యుక్తిచే రాజు సింహరూపియగు శివసేవకుని నిరుత్తరుని చేసెను.

'భవాన పీదమ్ పరవా నవైతి
మహాన్ హి యత్న స్తవ దేవదారౌ'

'శివాజ్ఞకు పరాధీనుడవైన నీవు ఈ దేవదారు వృక్షరక్షణమునందు ఎంత శ్రద్ధ గలిగి

యున్నావో నేనును ఈ గురు ధేనురక్షణమున అట్టి దీక్షనే చూపవలయును గదా? కనుక నా దేహమును గ్రహించి ధేనువును విడువుము' అని చెప్పెను. తన మాటకొక స్నేహభావమును జోడించి హింస్రమృగమును సైతము మెత్తపరుపదలచెను.

సంబంధ మాభాషణ పూర్వ మాహుః
వృత్తః స నౌ సంగతయో ర్వనాన్తే ।
త ద్భూతనాథానుగ, నార్హసి త్వం
సంబంధినో మే ప్రణయం విహన్తుమ్ ॥

'కలిసి మాటలాడిన స్నేహము కలుగునందురు గదా? ఈ అడవిలో మనము కలిసి స్నేహితుల మైతిమి. మిత్రుడనైన నా కోర్కెను తిరస్కరింపకుము.' అని చెప్పగా సింహము నిరుత్తరమై ఆవును విడిచెను. రాజు శస్త్రమును వదలి తన శరీరము నొక మాంసపిండమువలె సింహమునకు సమర్పించెను.

'సన్న్యస్త శస్త్రో హరయే స్వదేహమ్
ఉపానయత్ పిండ మి వామిషస్య,'

ఇట్లు దిలీపుడు తన అనితర సాధారణమైన త్యాగశక్తిచే, దయాళుత్వముచే చిరకీర్తి నార్జించుటయేకాక గోమాత చేసిన పరీక్షలో కృతార్థుడై వంశోద్ధారకుడయిన సుపుత్రుని బడసెను.

ఆతడే రఘువు ! చిరప్రసిద్ధుడైన వంశకర్త ! యుద్ధదాన వీరములతో దర్శన మిచ్చు మహోజ్జ్వలమూర్తి !

దిలీపుడు తొంబదితొమ్మిది అశ్వమేధములు చేసి నూరవదానికి సంకల్పించెను. కుమారరఘు వశ్వరక్షకుడు. ఒక అదృశ్యమూర్తి అశ్వమును దొంగిలించెను. రఘువు నందిని అనుగ్రహముచే తురగ చోరుని చూడగలిగెను. ఆతడు దేవేంద్రుడు !

రఘు వాతనిని నిలువరించి వచోనైపుణ్యముచే ఆతని కాశ్చర్యము గొలిపెను. ఆతని మాటలందు వినయమున్నది. తిరుగులేని యుక్తియుక్తత యున్నది.

'దేవేంద్రా ! ఉత్తమమార్గమును చూపు ప్రభువులు నీచమార్గముల నవలంబింపరాదు.

'పథ శ్శ్రుతే ర్దర్శయితార ఈశ్వరా
మలీమసా మాదదతే న పద్ధతిమ్.'

మొదట నన్ను చూచుటయే అసంభవము. చూచినను ఇంత ప్రగల్భముగా మాటలాడుట అరిది. అని ఇంద్రుడు విస్మితుడై రథమును మరలించి 'శతక్రతువు అన్న మాట నాయందే సార్థకము. అది వేరొకనికి చెందరాదు. కనుక నీ యశ్వము నపహరించితిని' అని పల్కి మరల నిర్లక్ష్యముగా నిట్లనెను.

'అతో య మశ్వః కపిలానుకారిణా
పితు స్త్వదీయస్య మయా పహారితః ।
అలం ప్రయత్నేన త వాత్ర మా నిధాః
పదం పదవ్యాం సగరస్య సంతతేః॥'

'కపిలునివంటి నేను ఈ అశ్వము నపహరించితిని. నీవు మాత్రము సగరసంతతిమార్గము పట్టకుము' ఈ మాటలలో నెంత అహంకారము! ఎంత ఎత్తిపొడుపు!; తన్నేకాదు. తన వంశపూర్వపురుషులనే ఎత్తిపొడిచి తన్నవమానించెను. ఈ మాటలతో వినయవంతుడైన రఘువు ప్రతాపమునకు సంధుక్షణము జరిగెను.

తతః ప్రహ స్యాపభయః పురందరమ్
పున ర్బభాషే తురగస్య రక్షితా

తురగ రక్షకుడయిన రఘువు నవ్వి నిర్భయముగా పురందరునితో నిట్లనెను.

'గృహాణ శస్త్రం యది సర్గ ఏషతే
న ఖల్వనిర్జిత్య రఘుం కృతీ భవాన్'

'ఇదియే నీ నిశ్చయమైనచో ఆయుధమును చేపట్టుము. నీ యెదుట నిలిచిన రఘువు నోడింపక కృతకృత్యుడవు కాలేవు.' ఇచ్చట 'రఘుం అనిర్జిత్య' అను రెండు పదములలో కవి తన కావ్యనాయకుని అజేయత్వమును, అచంచలాత్మ విశ్వాసమును నిపుణముగా ధ్వనింపజేసెను.

ఈశ్వరుని విడంబించు రఘువు ధనువు పట్టెను. ఈ సందర్భమున ద్వితీయ సర్గలోని

'జిష్ణీకృత స్త్ర్యంబక వీక్షణేన
వజ్రం ముముక్ష న్నివ వజ్రపాణిః।'

అను మాటలను జ్ఞప్తికితెచ్చుకొనవలయునని కవి కాంక్షయా? పరమేశ్వరుని పై వజ్రమును ప్రయోగింపదలచిన ఇంద్రుడా ఈశ్వరుని ఒక్కచూపుతో మున్నొకనాడు కొయ్యబారి నిల్చినాడు. అట్లే ఇచట ఈశ్వరునివలె నిలిచిన రఘువునకు ఇంద్రుడొక విధముగా లొంగిపోక తప్పదని వ్యంగ్యము.

యుద్ధము జరుగుచున్నది. రఘువు ఇంద్రుని పిడుగు జెండాను ఒక బాణముతో నఱికివేసెను. అది యెట్లున్నది? బలవంతముగా సురరాజ్యలక్ష్మికి కేశఖండనము చేసినట్లున్నదట.

చకోప తస్మై స భృశం సురశ్రియః
ప్రసహ్య కేశవ్యపరోపణా దివ॥

తుదకు ఇంద్రుడు వజ్రాయుధమును ప్రయోగింపక తప్పలేదు. తదాఘాతమునకు రఘువునేల గూలుటయు జరిగెను. అనుపదముననే ఆతడు తేరి కొని నిలిచెను. అప్పటి ఇంద్రుని ఈ విరోధి ప్రశంస రఘుపరాక్రమమునకు వన్నెవెట్టినది.

తుతోష వీర్యాతిశయేన వృత్రహా'

'అసంగ మద్రిష్వపి సారవత్తయా
న మే త్వదన్యేన విసోఢ మాయుధమ్॥
అవేహి మాం ప్రీతం బుతే తురంగమాత్
కి మిచ్ఛ సీతి స్ఫుట మాహ వాసవః॥'

'శిలోచ్చయములందుగూడ తిరుగులేని నా వజ్రాయుధపు దెబ్బకు తట్టుకొని నిలిచిన వాడింతవఱకు లేడు. ఎంతయు సంతసించితిని. గుఱ్ఱమునుతక్క ఏమైనను కోరుకొనుము.'

రఘువు యథాస్థితికి వచ్చెను. తన ప్రతాపమునకు విబుధేంద్రుని మెప్పు లభించినది. తనకంటె ధన్యు డెవ్వడు? తన సహజ వినయ సంపత్తితో నిట్లు పలికెను. 'గుఱ్ఱము విడువకున్న పోనిమ్ము. శాస్త్రముచేతనే యజము ముగించిన నా తండ్రికి పరిపూర్ణయజ్ఞ ఫలము నిమ్ము.'

రఘువు యుద్ధవీరము ఇట్లు దేవేంద్ర విజయముతో ప్రారంభమై సర్వభారతోర్వీ దిగ్విజయముతో పరమావధి నందికొని సామ్రాజ్యలక్ష్మిని ఒక వెల్లగొడుగు నీడక్రింద ప్రతిష్ఠాపించెను.

శ్లో॥ ఇతి జిత్వా దిశో జిష్ణుః
వ్యవర్తత రథోద్ధతమ్
రజో విశ్రామయన్ రాజ్ఞాం
ఛత్రశూన్యేషు మౌళిషు॥

ఇందు రఘురాజ సైన్యధూళి ఛత్రశూన్యము లయిన రాజుల తలలందు నెలకొన్న దనుటతో సర్వ రాజులును ఆతనికి సామంతులయి అరిగాపులై యుండిరని అభివ్యక్తమగుచున్నది.

దిగ్విజయానంతరము తాను సంపాదించిన ధనసర్వస్వమును దక్షిణగా సమర్పింపవలసిన విశ్వజిద్యజ్ఞ మొనరించి రాఘువు సాటిలేని దానవీరుడయ్యెను.

శ్లో॥ 'స విశ్వజిత మాజహ్రే
యజ్ఞం సర్వస్వ దక్షిణమ్।
ఆ దానం హి విసర్గాయ
సతాం వారిముచా మివ॥

ఈ దాన వీరములోని చివరి మెఱపు మునికుమారుడు కౌత్సునియెడల ప్రత్యక్షమైనది. మృణ్మయ పాత్రావశేషముగ దానము చేసిన రాజు నొద్దకు వచ్చినవాడు గురుదక్షిణార్థి. దాతృస్థానీయుడు చక్రవర్తి. ఆతడిట్టి సత్పాత్రము నెట్లు వదలుకొనును? కాదని యేమిచ్చును? అట్టియెడ చక్రవర్తి మునికుమారునితో గంభీరముగా నిట్లనెను. 'రఘువు నొద్దకు వచ్చిన అర్థి వేరొక దాతవద్దకు పోయెనను క్రొత్త అపకీర్తిని నాకు

తెచ్చిపెట్టకూము కోరిన ధనమును నీకు తెచ్చి యిచ్చెదను. రెండు, మూడు దినములో పికపట్టుము' అని చెప్పి కుబేరునిపై దండయాత్ర చేయగలచెను. తలచినంతలోనే రఘురాజు కోశగృహముల సువర్ణ వర్షము కురిసెను అప్పుడొక చమత్కారము జరిగినది.

శ్లో॥ జనస్య సాకేతనివాసిన స్తౌ ద్వా
వప్యభూతా మభినంద్యసత్త్వౌ ।
గురుప్రదేయాధిక నిస్పృహో ఽర్థీ
నృపో ఽర్థికామా దధికప్రద శ్చ ॥

వజ్రముచే విఱుగఁగొట్టబడిన మేరుపర్వత శిఖరమువంటి హేమరాశిని రఘువు కౌత్సునకు 'న మమ' అని యిచ్చివేయుటలో లేదు విశేషము. తాను కోరిన పదునాలుగుకోట్ల సువర్ణములకంటె నధికముగా నొక చిల్లిగవ్వనైనను స్వీకరింపనని శిష్యుడు పట్టుబట్టుటలో చమత్కారమున్నది. అయోధ్యాపురవాసులకు వీరిరువురిని చూడగా మిక్కిలి ఆశ్చర్యము కల్గినదట! ఎందులకు? 'నీ కొఱకు సంపాదించిన కనకరాశి నంతటిని నీవే తీసికొను' మని రాజనును. తుద కేమి జరిగినదియు కవి చెప్పదు తరువాతి కథాగమనమునుబట్టి దాత అర్థిచే ఆ ధనము నంతటిని స్వీకరింపజేసెనని స్ఫురించును.

కవి తాను కావ్యాదిని రఘువంశస్థుల ఉత్తమ గుణములుగా సూత్రీకరించిన లక్షణములం దనేకము తన కథానాయకునియందు చిత్రించి ఆతని వంశ కర్తృత్వమును సార్థకము చేసెను.

ఆఫలోదయ కర్మణాం—తలపెట్టిన విజయ యాత్రలం దీతడు తిరుగులేని కృతార్థత నందినాడు.

ఆ సముద్రక్షితీశానాం—దిగ్విజయముచేసి తన సార్వభౌమత్వమును స్థిరీకరించినాడు.

ఆనాకరథవర్త్మనాం—ఇంద్రుని వెంటవంటి స్వర్గమువఱకు తన రథమును సాగించినాడు.

యథాకామార్చితార్థినాం—కౌత్సునకు కోరిన దానికంటె అధికముగా నిచ్చి వెఱదాత యనిపించు కొన్నాడు.

యోగే నాంతే తనుత్యజాం—పుత్రునకు రాజ్య మప్పగించి విరాగియై, మహాయోగియై శరీరత్యాగము చేసినాడు

'సుత్రం లభ స్వాత్మగుణానురూపం
భవంత మీడ్యం భవతః పితేవ.'

అను కౌత్సుని ఆశీర్వాదమువలన రఘువునకు జన్మించిన సుపుత్రుడు అజు డిపుడు మనకు దర్శన మిచ్చును.

అజరాజు వీరశృంగారమూర్తి. పితృ, పితామహులకు తీసిపోని వీరుడై ఆదర్శ దాంపత్యములోని రసజ్ఞమూర్తియై ప్రత్యక్షమగును.

వంశానుగతముగా వచ్చు వీరత్వమునకు ఈతని జీవితములోని రెండు సంఘటనములు చెప్పదగినవి. ఒకటి : ఈతడు స్వయంవరనిమిత్తమై విదర్భకు పోవుచున్నప్పుడు సేనానివేశమును కలవరపరచిన అడవి యేనుగును వశపరచుకొన్నవిధము.

శ్రేయస్కామియైన రాజు ఏనుగును చంప రాదు. అట్టియెడ ఈత డొక బాణముతో ఏన్గును బెదరించి ఉపద్రవమును నివారించుటేగాదు; శాపావసానము నందిన గంధర్వునకు మిత్రుడై సమ్మోహనాస్త్రమును గూడ పడసెను.

రెండు : స్వయంవరమున వరింపబడి ఇందుమతితో వివాహమయి తిరిగి వచ్చునపు డడ్డగించిన వీరులను సమ్మోహనాస్త్రముతో నిద్రపుచ్చి చిఱునవ్వుతో భార్యను పలుకరించి సవిలాసముగా విజయశంఖము నొత్తుట; అది ఆ ఏకైకవీరుడు చేతులార సంపాదించిన కీర్తిని తనివితీర త్రాగుచున్నట్లుండెను.

తతః ప్రియోపాత్తరసే ధరోష్ఠే
నివేశ్య దధ్మౌ జలజం కుమారః ।
తేన స్వహస్తార్జిత మేకవీరః
పిబన్ యశో మూర్త మివావభాసే ॥

అజుని ముద్దుబిడ్డడు దశరథుడు. ఈతని చరిత్రలో ప్రత్యక్షముగ వర్ణితములయిన వీరఘట్ట

ములు అంతగా లేకున్నను, ఈతని విజేతృత్వమును, వీరత్వమును కవి యిట్లు సూచించెను.

దశదిగంతజితా రఘుణా యథా
శ్రియ మపుష్య దజేన తతః పరం ।
త మధిగమ్య తథైవ పునర్బభౌ
న న మహీన మహీన పరాక్రమం ॥

దశదిక్కులను జయించిన రఘువుచేతను, పిమ్మట అజునిచేతను భూమి యెట్లు శోభించెనో, అట్లే అహీనపరాక్రముడైన దశరథునిచేతను రాణించెను.

దశరథ పుత్రులు నల్వురును మహావీరులే! అందు నాయకమణి శ్రీరాముడు. భవభూతి మహాకవి మహావీరచరితమను నాటకమును వ్రాసెను. ఆతని దృష్టిలో మహావీరుడనగా రామచంద్రు డొక్కడే! ఈతడు యుద్ధ, ధర్మ, దయా, దానాది చతుర్వీరత్వములను తన చరిత్రలో స్ఫుటముగ ముద్రించు కొన్న పురుషోత్తముడు. రామ—అయనములో దీప స్తంభములవలె వెలుగు వీరతాజ్యోతులు నాలుగు. (1) శివధనుర్భంగము (2) పరశురామ పరాభవము (3) రాజ్యపరిత్యాగము (4) రాక్షససంహారము.

ఈ ఘట్టములను మహాకవి కవితాసమృద్ధితో చిత్రించెను.

మిథిలలో జనకసభ నివ్వెఱపడి చూచుచుండగా శివధనువును పూలవింటివలె ఎత్తి ఎక్కుపెట్టెను. గట్టిగా లాగుటచే విల్లు విఱిగి పిడుగుపాటువలె ధ్వనించెను. అది మరల నొక క్షత్రియుడు లేచి నాడయా, అని భార్గవునకు చెప్పినట్లున్నదట!

మిథిలలో కళ్యాణకార్యములు ముగిసినపిదప అయోధ్యకు పోవుత్రోవలో అచ్చముగ భార్గవరాముడే ఎదురై ఇట్లనెను: 'కొండపైగూడ తిరుగులేకుండ అస్త్రమును ప్రయోగింపగల్గిన నాకు సమానమగు అపకారముచేసి శత్రువులయిన వారిద్దరు. గోవత్సము నపహరించిన హైహైయుడు మొదటివాడు. కీర్తిని హరించిన నీవు రెండవవాడవు.' భార్గవుని ఉద్ధతవాణి పరమావధి ఇది.

కాతరోఽసి యది వోద్గతార్చిషా
తర్జితః పరశుధారయా మమ ।
జ్యానిఘాతకఠినాంగుళి ర్వృథా
బధ్యతా మభయయాచనాఞ్జలిః ॥

'వెలుగులు చిమ్మ నా గండ్రగొడ్డటి వాడికి బెదరిపోతివేని అభయమును కోరుచు అంజలి పట్టుము.' ఇచట రాముని ప్రతిగర్వోక్తులుగాని, సొల్లుంతవచనములుగాని మనకు విన్పింపవు. 'క్రియా కేవల ముత్తరమ్'. రాము డిట్లు చేసెను.

ఏవ ముక్తవతి భీమదర్శనే
భార్గవే స్మితవికమ్పితాధరః ।
త ద్ధనుర్గ్రహణ మేవ రాఘవః
ప్రత్యపద్యత సమర్థ ముత్తరమ్ ॥

పరశురాము డిట్లు చెప్పగా రాముడు చిఱునవ్వుతో అధరమించుక కదలగా పరశురాముని చేతి నుండి ధనువు నందికొనుటయే తగిన సమాధానమని యెంచెను. ఇచట పెదవి కదుపుట శత్రువునుమించి మాటలాడుటకుగాదు. ఆతని గర్వమును త్రుంచి విజయమందు చిఱునవ్వునకు! కవి హృదయములోని వ్యంగ్యచమత్కారమును 'స్మితవికమ్పితాధరః' అను సమాసమును, 'గ్రహణమేవ' అనుటలోని ఏవకార మునుపట్టి యిచ్చుచున్నవి.

వేరొక ఘట్టము. రావణుడు రణరంగమున కవతరించినాడు. రాముడు మాతలి తెచ్చిన ఇంద్ర రథముపై నధిష్ఠించి శత్రువు నెదుర్కొన బోవుచున్నాడు వీర, ప్రతివీరు లిర్వురును అదియే తొలి సారిగా ఒండొరులను చూచుకొన్నారు.

శ్లో॥ జేతారం లోకపాలానాం
స్వముఖై ర్చర్చితేశ్వరం
రామ స్తులితకైలాస
మరాతిం బహ్వమన్యత ॥

లోకపాలుర నోడించిన వాడును, తన శిరస్సులతో ఈశ్వరు నారాధించిన వాడును, కైలాసము నూచిన వాడును, అగువిరోధి కాన్పింపగనే రామునకు

క్రోధ ముట్టిపడుటకు బదులుగా గౌరవ ముద్భవించెను. ఇచట రాముడు శత్రువును తిరస్కరించి మాటలాడుటలోగాని, అవహేళనము చేయుటలోగాని గొప్పతనము లేదు. శత్రువును బహూకరించుట యందే అనితర సాధారణమైన రామత్వమున్నది. ఆ వీరాధివీరులుచేయు యుద్ధమున విజయ మెవ్వరివంక నున్నదో తెలియనంత గాంభీరముగ యుద్ధము సాగుచుండెను.

శ్లో. కృతప్రతికృతప్రీతైః
తయో ర్ముక్తాం సురాసురైః
పరస్పరశరవ్రాతాః
పుష్పవృష్టిం న సేహిరే ॥

ఒక వీరుడు చేసిన కృతమునకు ప్రతివీరుడు చేసిన ప్రతికృతము 'ఆహా' పుట్టించుచుండగా దేవత లోకమైపునను, రాక్షసు లోకమైపునను పూలవాన కురిసిరి. కాని ఒండొరుల బాణప్రయోగము ఆ పుష్ప వృష్టిని ఎవరిపైనను పడకుండ చెల్లచెదరు చేసెను.

తుదకు 'నిమేషార్ధా దపాతయత్ । స రావణ శిరః పంక్తిం అజ్ఞాతవ్రణవేదనాం' రావణుని తలల వరుసను రాముడు తెగగొట్టెను. ఎట్లు? ఆ నరకిన బాధయే తెలియకుండ ఆ పని చల్లగా జరిగిపోయెను. అది రాముని ఉదారగుణమా? లేక బాణప్రయోగ కౌశలమా?

రెండును.

శ్రీరాముని తర్వాత ఆతని జ్యేష్ఠపుత్రుడు కుశరాజునందు రఘువంశ వీరతేజపు చివరిమెఱపు మెఱసెను.

కుశుని జైత్రాభరణము సరయూజలములం దదృశ్యము కాగా పాతాళవాసియగు నాగరాజుపై ఆతడు గారు డాస్త్రమును సంధించెను. నాగరాజు వినమ్రుడై తన చెల్లెలు కుముద్వతితో గూడ ఆయాభరణమును కుశునకు సమర్పించెను. పిదప కుశుడు వంశాచారముగా దేవేంద్రుని సాహాయ్యకము నకై పోయి దుర్జయుడను రాక్షసుని సంహరించి వానిచే విహతుడయ్యెను.

కవి తన కావ్యమున అంగిరసముగ వీరమును పోషించి జీవితములోని తక్కిన అనుభూతివిశేషము లనుగూడ శ్రద్ధగా రఘువంశమున చిత్రించెను.

కాళిదాసు శృంగారప్రియుడని ప్రసిద్ధి. కాని ఆ రసము నీ కావ్యమున అంగరసముగనే యుంచినట్లు తొలిశ్లోకమువలన తెలియును. పార్వతీపరమేశ్వరుల ఐక్యమునందు శృంగారము ధ్వనించుచున్నను, అది కవి భక్తిభావమునకు అంగమే యైనదిగాని అంగి కాలేదు;

వీరముతరువాత రఘువంశపు అంగరసములలో ప్రధానమయినది శృంగారమే! అజరాజు గార్హస్థ్య ములో కవి శృంగారచిత్రణము దర్శనీయమై యున్నది.

ఇందుమతి స్వయంవరమున సర్వరాజపుత్రులను తిరస్కరించి తుదకు అజునిపై అనురక్తయై ఒక చిత్రమైన చూపు చూచినది. అది ప్రసన్నమధురమై స్వయంవర పుష్పమాలికవలె ఆతనిని మన్నించినది.

దృష్ట్యై ప్రసాదామలయా కుమారం
ప్రత్యగ్రహీత్ సంవరణ స్రజేవ ॥

వా రిరువురును వధూవరులై ఒండొరులను చూచుకొనుటలోని మాధుర్యసౌకుమార్యములు మన హృదయములనుపట్టి వీడవు.

శ్లో. తయో రపాంగప్రవిసారితాని
క్రియాసమాపత్తి నివర్తితాని ।
హ్రీయంత్రణా మానశిరే మనోజ్ఞాం
అన్యోన్యలోలాని విలోచనాని ॥

వారి చూపులు కనుగొలకులనుండి మెల్లమెల్లగా బయలుదేరి కలిసికొని చట్టున వెనుకకు తిరిగి వచ్చుచు తనివితీరక మరల చూడదలచియు నును సిగ్గునకు కట్టుపడి నిలిచిపోయినవి '

అజరాజ సందర్భమున వర్ణితమైన శృంగారము పవిత్రగార్హస్థ్య సంశోభితము; ధర్మబద్ధము. అర్థకామములు ధర్మానుబద్ధము లయినపుడే పురుషునకు సంసేవ్యములయిన పురుషార్థములగును. కావ్యాదిని 'యౌవనే విషయైషిణాం' అని చెప్పబడిన మాటను పైవిధముగ నర్థము చేసికొనవలయును. తదనుగుణముగనే అగ్నివర్ణునివలెకును వచ్చిన

రఘువంశరాజులు ప్రవర్తించి తమ చరిత్ర నాదర్శ ప్రాయ మొనరించిరి. పూర్వపురుషుల విషయాను భవానికి ప్రత్యుదాహరణము, తుదిని మనకు అయోధ్యాంతఃపురములో దర్శన మిచ్చు అగ్నివర్ణుడు. ఇంతవరకు మహాసంయమనముతో వర్ణితమైన శృంగారము ఈ అగ్నివర్ణునియొద్ద విజృంభించినది. ఆ విజృంభణము ఎట్టి వినిపాతమునకు దారి తీసి నదో చెప్పుట ఇచట ప్రకరణవ్యంగ్యము. అగ్నివర్ణుని విషయానుభవవర్ణనమునందు కవి చూపిన శృంగార పరిజ్ఞానము, లలితకళాభిజ్ఞత, కామశాస్త్రపరిచయము ఇందు పురివిప్పి అపూర్వలాస్యవిలాసమును ప్రదర్శించినవి.

అగ్నివరుని జీవన సిద్ధాంత మిది.

శ్లో. అంకమంక పరివర్తనోచితే
తస్య నిన్యతు రశూన్యతా ముభే ।
వల్లకీ చ హృదయంగమ స్వనా
వల్గువా గపి చ వామలోచనా ॥

లాలింపవలసిన రెండు వస్తువులు ఆతని ఒడిని నిరంతర మలంకరించుచున్నవి. అవి ఏవి? ఒకటి రమ్యముగ నినదించు వీణ. రెండవది కలభాషిణియైన విలాసిని. అగ్నివర్ణుని చరిత్రము తుదను ఈ మాటలు పలికి ఆతని వినిపాతమునందు కవి తన సానుభూతి నిట్లు తెలిపెను.

శ్లో. దృష్టదోష మపి త న్న సోత్యజత్
సఙ్గవస్తు భిషజా మనాశ్రవః ।
స్వాదుభి స్తు విషయై ర్హృత స్తతో
దుఃఖ మింద్రియగణో నివార్యతే ॥

వైద్యు లెంతచెప్పినను వినక ఆ రాజు వ్యసనములందలి తగులమును విడనాడలేకపోయెను. అవును. తీయని విషయానుభవములకు లొంగిపోయిన ఇంద్రియగణమును ఎవ్వడు నివారింపగలడు?

ఈ కావ్యమున శృంగారముతర్వాత ప్రాముఖ్యమును వహించునది కరుణము. కాళిదాసు వీర, శృంగార చిత్రణములం దెట్టి మనస్వితను చూపెనో, అట్టి ఆర్ద్రహృదయమునే కరుణమునందును ప్రదర్శించెను.

అజేందుమతుల ప్రియతమ దాంపత్యమునందు అనివార్యమయిన ఖేదము ప్రవేశించినది. ఒక దివ్య మాలా సంస్పర్శమువలన ఇందుమతి మరణించినది. ఆ శోకము అజరాజును జావ్వి మొక్క మేడగోడను పగిల్చినట్లు నిలువునన భేదించి వేసెను.

తస్య ప్రసహ్య హృదయం కిల శోకశంకుః
ప్లక్ష ప్రరోహ ఇవ సౌధతలం బిభేద

అజరాజు ఉద్యానమును విడిచి శోకమూర్తియై పట్టణమున ప్రవేశించునపుడు కవి పల్కిన ఈ మాటలు హృదయ విదారకము లయినవి.

శ్లో॥ స విశేశ పురీం తయా వినా
క్షణదాపాయ శశాంక దర్శనః।
పరివాహ మివావ లోకయన్
స్వశుచః పౌరవధూ ముఖాశ్రుషు॥

అతడు తన దుఃఖపు పొంగును పురస్త్రీల కన్నులందు చూచుచు రాత్రి నెడబాసిన చంద్రునివలె పట్టణమును చేరెను.

ఈ కావ్యమునందు విపులముగ వర్ణింపబడిన పై రసములేకాక విశ్వామిత్రుని యాగరక్షణమునకై పోవు రామునకు ఎదురుపడిన తాటకావర్ణనమునందు బీభత్సమును, పంచవటియందు సీతారాముల సన్నిధికి వచ్చిన శూర్పణఖ చేష్టలందు హాస్య, భయానకములను నిపుణముగా చిత్రించి కవి తన సర్వతోముఖ ప్రతిభను ప్రదర్శించెను.

# గాంగరాజులనాటి కళింగాంధ్రుల సాంఘిక చరిత్ర

శ్రీ బి. ఎన్. శా

(గత సంచిక తరువాయి)

కళింగాంధ్ర ప్రజలు రాజవంశములు మారినను, సమైక్యముగానుండి, వర్తక వ్యాపారముతోపాటు, భారతీయసంస్కృతి, నాగరికత వ్యాప్తికి పాటుపడిరి. విదేశములందుసు, కలిసికట్టుగా పనిచేసి వలసరాజ్య నిర్మాణమునకు, తదభివృద్ధికి తోడ్పడిరి

**సాంఘిక స్థితి :**

కళింగము సంపన్నమైనదేశము. కళింగరాజులు సకలైశ్వర్యముల ననుభవించినవారు. రాజులు ఉత్తుంగ హర్మ్యములలోను, ఉద్యోగులు వర్తకులు మేడల లోను, మిద్దెలలోను, పేదవారు పూరిండ్లలోను నివసించుచుండిరి. దేశమున బౌద్ధమతము వ్యాపించి యుండుటవలన సంఘారామములు, విహారములు, మఠములు, చైత్యములు, స్తూపములు, అసంఖ్యాకముగ నుండెను. రాతితోను, ఇనుముతోను, కర్రతోను కట్టడములు నిర్మించిరి. నాగరకతను సూచించు, స్వర్ణరజితపాత్రలు, వెలలేనిరాళ్ళు, నవరత్నఖచితసింహాసనములు, ఊగుటుయ్యాలలు ధనాఢ్యుల ఇండ్లలో నుండెను రాజులు, సామంతులు, మంత్రులు, ధనాఢ్యులు అమూల్యములైన పట్టువస్త్రముల ధరించుచుండిరి వెండి, బంగరు ముత్యాల హారములు, ఉంగరములు మొదలగునవి ధరించుట ఆచారముగ నుండెను. అన్నివిధములైన కళలు వ్యాప్తిలో నుండెను. అంతఃపురస్త్రీలకు, బాలికలకు సంగీతము, నృత్యము, చిత్రలేఖనము నేర్పబడుచుండెను. మాగధి, పైశాచి, కళింగాంధ్రభాషలు వాడుకలోనుండెను. ప్రజలలో జైన, బౌద్ధ, వైదిక మతావలంబకులుండిరి. భూమిపన్ను నీటిసుంకము వాడుకలో నుండెను. రాజు ప్రజలచేగాని, వంశపరంపరగావచ్చు, వారసత్వమువలనగాని, మంత్రులు పెద్దలచేగాని నియమింపబడి పాలించుచుండెను మంత్రి పురోహితమండలి సలహా ననుసరించుచు పాలించు రాజుకు, చతురంగబల సమన్వితుడైన సేనానాయకుడు సామ్రాజ్యరక్షణమున తోడ్పడుచుండెను.

కళింగరాజు బంగారుమేడయందు నివసించెడివాడు. స్త్రీలకు ప్రత్యేకముగా అంతఃపురము లుండెను. నేరస్థులకు చీకటిగదులుండెను ఉద్యానవనములు, సత్రములు, చెరువులు, ధర్మశాలలు ప్రజాసౌకర్యార్థము నిర్మింపబడెను బౌద్ధమతస్థులకు, ఆరామ విహారములు మఠములు, చైత్యాలయము లుండెను రాజులు, నగరములు, కోటలు, బురుజులు, అనేక అంతస్థుల మేడలు నిర్మించి, చతురంగబల సమేతులై ప్రజలనుండి పన్నులు, వివిధములైన సుంకములు వసూలుచేసి ప్రజాక్షేమమునుగోరి పాలించుచుండిరి. బౌద్ధమును, వైదికమును ఆచరించు ప్రజలుండిరి బ్రాహ్మణ పురోహితులు, ఋషులు, మునులు, సన్యాసులు దేశమున గౌరవింపబడుచుండిరి వేదవేదాంగ విదులైన విప్రులు రాజాదరణముపొంది అగ్రహారముల బడయుచుండిరి. కళింగదేశమున వైదికమతము వ్యాపించిన తరువాత, ఆత్మస్థిరమని, చావులేనిదని పునర్జన్మ

కలదని ప్రజలు భావించిరి ప్రజలలో కొందరు, మంత్రతంత్రములపై నమ్మకము కలిగి చెట్లు, చేమలను, రాక్షస యక్ష నాగ పిశాచి గణములను ఆరాధించుచుండిరి. వేదాంతము, మతవిద్య, శాస్త్రములు నేర్పుటకు, కళాశాలలు, సర్వకళాశాలలు, పాఠశాలలు వెలకొల్పబడెను.

కళింగాంధ్రమున బ్రాహ్మణులు, వైశ్యులు, కాయస్థులు, కాపులు, పల్లవకాపులు, గొల్లలు, అగశాలలు, తెలికకాపులు ఉన్నట్లు తెలియుచున్నది కళింగ బ్రాహ్మణులకును, ఆంధ్ర బ్రాహ్మణులకును, వివాహ సంబంధ బాంధవ్యములున్నట్లు తెలియుట లేదుకాని, ఆంధ్రబ్రాహ్మణులు కళింగదేశమున స్థిరపడి తాము తెలుగు బ్రాహ్మణులమని చెప్పకొనినారు. అట్టివారిలో అనంతవర్మ చోడగంగునికి, సేనాపతులుగా ఇద్దరుండిరి.[1] కళింగ బ్రాహ్మణులలో కొందరికి గోత్రనామములు తెలుపబడలేదు. విప్రులలో 'బణపతి' వంశీయులు, సింహపురమున మాండలిక పదవిలో నుండిరి. బ్రాహ్మణులు వైశ్యులు తమ పేళ్లముందు వింతపదములను చేర్చుచుండిరి. గంగ్గబ్రహ్మ మారాయుణ్డైన' గంగమార్తాండ బ్రహ్మ మారాయుణ్డైన' అని బ్రాహ్మణులు, గంగ విద్యాధరవైశ్య మహారాయుణ్డైన అని వైశ్యులు, గంగ్గ సమారాయణ్డు, గంగ విప్పఅయిణ, గంగ్గ వేలాణ్డైవ అనియు, రాయరాయ విద్వఅయణ్డు అను బిరుదములను కాయస్థులు చేర్చుకొనుచుండిరి. ప్రజల పేళ్లు సైతము వింతగా కనిపించుచున్నవి. అందు, చూతాణ్డి, మాదాణ్డి, నూకాణ్డి, అమాణ్డి, భూమాణ్డి, అను స్త్రీల పేళ్లును, అజ్జల, కందు, దాసరి, ఒడయాల, ముప్పన, అన్నెము, దణాసి, అల్లితవాడ, ఇబ్బారి ఆది ఇంటి పేళ్లును ముఖ్యమైనవి. పోతి-పోతు పదములు కులీనులైన స్త్రీ పురుషులకు వాడుచుండిరి. ఎఱియపోతి, కచ్చిపోతి, వింజమపోతియను స్త్రీల పేళ్లు, రేవపోతు, ఎఱపోతు, వింజమపోతు అను పురుషుల పేళ్లు శాసనములందు కనిపించుచున్నవి. ఈ పదములను, రాజవంశీయులుగాని, విప్రులుగాని ధరించుచుండిరి. కాయస్థులు నాయక పదమును, కాయస్థ స్త్రీలు నాయకురాలు పదమును చేర్చుకొనుచుండిరి.

మత సంబంధమైన కట్టడములలో కళింగాధీశుడు దంతపురములో బుద్ధుని దంతముపై నిర్మించిన కట్టడము ప్రశస్తమైనది.[2] ఈ కట్టడమునకు, కలప, రాయి, ఇనుము ఉపయోగించినారు. బావరి మతమున కుపయోగించిన కలప, కోసల దేశమునుండి గోదావరియొడ్డునకు తెచ్చినట్లు తెలియుచున్నది.[3]

కళింగదేశముననున్న నగరములకు ప్రహరిగోడలుండెడివి. కోటగోడలలో బురుజులు, బురుజులపై ధ్వజస్తంభములు, ధ్వజస్తంభములకు జెండాలు, తోరణములు, గొడుగులు, చాందినీలు ఉండెను.

బుద్ధునిదంతము భద్రముగానుంచు కట్టడము పై భాగమునకు బంగారుపూత పూయబడియుండెను ముత్యాలసరములతో దాని నలంకరించుట వలన బాలసూర్యునివలెనది ప్రకాశించుచు కన్నులకు మిరుమిట్లు గొలుపునట్లుండెను

రాణివాసపుస్త్రీలు ధరించు వస్త్రములు మిక్కిలి సన్ననైనదారముతో నేయబడుచుండెను. కళింగశబ్దమునకు ద్రావిడభాషలో 'సున్నితమైనబట్ట' అని అర్థము ఇప్పటికి వాడుకలో నున్నది. కళింగ రాజు కోసలరాజుకు కానుకగా పంపిన దుస్తులను కోసలరాణి ధరించి సభలోనుండ సభికులామె దుస్తులను చూచి తలలు వంచివారట. రాణి సిగ్గువడి అంతఃపురమున కేగెనను ఐతిహ్యమునుబట్టి ఆనాటి బట్టలెంత సన్నముగానుండెడివో భావింప వచ్చును.

---

1. S. i. i. Vol. V. No. 1042, and 1101.

2. Indian Antiquery Vol. XIII. P. 37.

3. Man. of Budha P. 334.

యుద్ధములందు రాజులు, ఛత్రచామరములు, సామజములు, ధ్వజములు, బల్లెములు, మకరతోరణ కాహళ, శంఖ, వృషభలాంఛనములు వాడుచుండిరి. రాజా సేనాపతులనుండియు, మండలాధిపతులనుండియు, సామంతులనుండియు యుద్ధసమయములందు సైన్య సహాయము పొందుచుండెను

సంఘమున స్త్రీలకు గౌరవముండెను కాయస్థ కుటుంబములలో స్త్రీల ఆధిక్యత కనిపించుచుండెను. సంఘమున అన్నిజాతులవారును ఐకమత్యముగానుండి ఒకరికొకరు సహకరించుకొనుచుండిరి.

## ప్రజా వినోదములు :

ప్రజావినోదములలో ముఖ్యముగా పేర్కొనదగినవి వేట, వసంతోత్సవములు. శాతవాహనుల కాలమున వాడుకలోనున్న కొన్ని వినోదములు, ప్రాచీన కళింగ ప్రజలలో వ్యాప్తిలోనుండెను స్త్రీలు, వివిధములైన ఆటలాడుచుండిరి. బాలబాలికలు, వివిధములైన పండుగలలో వివిధములైన వినోద కార్యక్రమములలో పాల్గొనుచుండిరి రాజులు, వేటకు వెళ్లునపుడు మంత్రి పురోహిత సేనాపతి దౌవారిక, దండనాయక యువరాజ సహితముగాను, అంతఃపుర స్త్రీలతోను ప్రయాణమగుచుండిరి వసంతోత్సవముల కానాడు విశేషమైన ఆదరముండెను. రాజులు, ధనికులేగాక వసంతోత్సవపు వేడుకలలో సామాన్యప్రజలు కూడా పాల్గొనుచుండిరి. నాగపూజ, సామాన్య ప్రజలలో ఎక్కువమంది చేయుచుండిరి. బౌద్ధాచార వ్యవహారములు, ప్రజలలో వ్యాపించెను వైదిక మత మభివృద్ధి చెందిన పిదప, శివునికి జరుగు వేడుకలలోను, పండువులలోను ప్రజలు పాల్గొనుచుండిరి హిందూమతమున జరుగు పూజాదికములను చూచి బౌద్ధమతమున మహాయాన సాంఘికులు సన్యాసులు ఆరాధనము, పూజాదికములు ఊరేగింపులు వేడుకలు ప్రవేశపెట్టుటవలన బౌద్ధమతానుయాయులగు ప్రజలు బుద్ధునికి జరుపు పూజా కార్యక్రమము లందమితోత్సాహమున పాల్గొనుచుండిరి. సముద్ర స్నానము, అతిథి సత్కారము, దైవారాధన, ఉత్సవము లందు పాల్గొనుట ఆ నాటి ప్రజల నిత్యజీవనమున సాధారణ విషయముగ నుండెను దేశమున కరువు కాటకములుగాని అతివృష్టి అనావృష్టివంటి ప్రకృతి విపరీతములుగాని ఉన్నట్లు తోచదు.

## వాఙ్మయము :

బౌద్ధవాఙ్మయమునకు సంబంధించిన గ్రంథములు త్రిపిటకములు. ఇవి వివిధప్రాకృతములలో వ్రాయబడినవి సింహళ త్రిపిటకములు పాలిభాషలో నున్నవి. ఇవి తక్కిన ప్రాకృత త్రిపిటకములకు మూలము. మొదట మాగధీభాషలో వ్రాయబడిన త్రిపిటకములు వివిధభాషలలోని కనువదింపబడినవి. బుద్ధుడు బౌద్ధమతప్రచారమును మాగ భాషలో గావించెను. అశోకుని పుత్రుడు మహేంద్రుడు. మహేంద్రుని తల్లి విదిశానగర రాజకుమార్తె. మహేంద్రుడు సింహళమున ప్రచారము గావించు సమయమున మాగధీభాషను వాడియుండును.

కళింగాంధ్రదేశములు బౌద్ధమతమునకు పట్టుగొమ్మలు. ఆనాడీ రెండు దేశములందు దొకేభాష వాడబడినది ఖారవేలుని హాథీగుంఫశాసనభాష, శాతవాహనుల శాసనములలోని భాష ఒకేవిధముగ నున్నది. మాఠరవంశీయుల శాసనములు పూర్వగాంగరాజుల శాసనములు సంస్కృతభాషలో వేయింపబడినవి అట్లే విష్ణుకుండిన, వంశీయుల శాసనములన్నియు సంస్కృత భాషలో వేయింపబడినవి. అనంతవర్మ చోడగంగు కాలమున కళింగమున వందలకొలది తెలుగు శాసనములు వెలసినవి. ఆంధ్రదేశమునందా కాలమున వెలసిన శాసనభాష, కళింగశాసనములలోని భాష ఒకేవిధముగ నున్నది.

బౌద్ధయుగమునాటి కళింగరాజుల చరిత్ర మహావంశమను గ్రంథమువలన తెలియుచున్నది. విద్య భాష ఆచార వ్యవహారములందు, ఆర్యద్రావిడభేదము కనిపించుచున్నది ఆర్యసంప్రదాయము కళింగదేశ దక్షిణ సరిహద్దువరకు వ్యాపించినను, దృఢముగా వాటు

కొనిపోయిన ద్రావిడ సంప్రదాయమునకు సంస్కృతికి, భాషకు ఎట్టి ఆటంకము కలుగలేదు. కళింగము, ఆంధ్రము కలిసి యుండుటవలన, ఆంధ్రులు కళింగులకన్న భాష, మత, ఆచార వ్యవహారములందు భిన్నులై యుండుటవలన కళింగములోని భాష, ఆచార వ్యవహారములు వాఙ్మయము, ఆంధ్రభాషా వాఙ్మయములకు ఆచార వ్యవహారములకు సన్నిహితముగా నున్నవి

ఆంధ్రులు విద్యా విషయమున, రాజకీయముగ కళింగులకన్న మిన్నలైయున్నారు. ఆంధ్రరాజులు చక్రవర్తులు. కొంతకాలము కళింగరాజు లాంధ్ర రాజుల సామంతులు. హాథిగుంఫ శాసనమువలన ఖారవేలుడు బాల్యమందే చదువను వ్రాయను నేర్చినాడని తెలియుచున్నది. ఖారవేలుని కాలమునాటికి, తెలుగు జనవ్యవహారమున నుండెను. గాథాసప్తశతిలో తెలుగు పదములున్నవి

కళింగరాజులు వేయించిన శాసనములందు తెలుగు దేశమునకు తెలుగుభాషకు సంబంధించిన గ్రామనామములు వ్యక్తులబిరుదములు కనిపించు చున్నవి మాఠర, గాంగవంశీయులకు సంబంధించిన శాసనములలోని గ్రామనామములు, విషయముల పేళ్లు, బిరుదములు - తెలుగు దేశమునకు సంబంధించినవి ఈ క్రింద నీయబడుచున్నవి

1. కళింగ విషయము } శక్తివర్మ రాగోలుశాసనము.4
2. రాకలువ

3. దేశాక్షపటలాధికృత }
4. తలవర } అనంతశక్తివర్మ
5. సకునక } సకునక శాసనము5
6. వరాహవర్తని విషయము }

7. తిరిథాణవాటక—చండవర్మ తిరిథాణశాసనము 6

8 కోహేతూర—చండవర్మ కోమర్తి శాసనము 7

9 అస్తిహవేరా— } ఉమావర్మ టెక్కలి
10 వర్ధమానపురము } శాసనము 8

11. దేయవాటి } ఉమావర్మ ధవళపేట శాసనము.9
12. చేకూర }

13. బృహత్ప్రోష్ఠమ్,, బృహత్ప్రోష్ఠశాసనము 10
14. హోణదేజ్గ ,, హోణదేజ్గ తామ్రశాసనము 11
15. కోరోష్ఠడ - విశాఖవర్మ శాసనము.12

పైన పేర్కొనబడిన గ్రామనామములు, బిరుదములు, విషయములు, మాఠరవంశీయులకు సంబంధించినవి రాగోలుశాసనము వేయించినవాడు శక్తివర్మ. ఇతని మనుమడు అనంతశక్తివర్మ వేయించిన సకునక శాసనమున కొష్ఠపుల్లు కుమారామాత్యులగు శివభోజక, వసుదత్తులనువారు. కుమారామాత్యులన Junior Ministers. శివభోజకుడు మహాబలాధికృతుడు. అనగా Commander in Chief. వసుదత్తుడు దండనేతుడు. అనగా General. శాసన రచయిత దేశాక్షపటలాధికృత తలవర బిరుదాంచితుడగు అర్జునదత్తుడు. తలవర అనగా Chief Judge. మహాతలవర బిరుదము నాగార్జునకొండ శాసనములందున్నది. ఈ కాలమున మాసములో ముప్పదిరోజులు గణించునపుడు తిథుల వరుసలో శుద్ధపౌర్ణిమ బహుళ అమావాస్యలను గణింపక, మాసములో బహుళ పంచమిని ఇరువదియవ దినముగా బహుళ దశమిని ఇరువదియైదవ దినముగాను అట్లే ఇతర దినములను లెక్కించుచుండిరని తెలియుచున్నది 13

---

4 E. i Vol. XII. P. 1—3.

5. M. E. R. 1934—1935. C. P. G. No 24.

6 A. R. of the Archaeological Survey of India; New-Delhi 1934-1935. Page. 64.

7. Epigraphica Indica Vol. IV. P. 42.

8. J. A. H. R. S. Vol. VI. P. 53 54.

9. J. A. H. R. S. Vol. X. P. 143-144.

10. Epigraphica Indica. Vol. XII. P. 4.

11. భారతి - డిశంబరు 1967.

12. Epigraphica Indica Vol. XXI. P. 23.

13. భారతి—డిశంబరు 1967.

**గాంగరాజుల శాసనములలోని గ్రామనామములు**

| గ్రామనామములు | శాసనము |
|---|---|
| 1. జిజ్జిక— <br> 2. ఓంభారభోగము <br> 3. దంతపురము | ఇంద్రవర్మ జిర్జింగి శాసనము 14 |
| 4. తామర చెఱువు | దేవేంద్రవర్మ శ్రీకాకుళ శాసనము15. |
| 3. కలెల విషయము <br> 4. తారు గ్రామము | సత్యవర్మదేవుని శ్రీకాకుళ శాసనము16 |
| 5. ఊరుమల్ల <br> 6. క్రోష్టుకవర్తని విషయము <br> 7. హోండ్రవక | హస్తివర్మ ఉర్లాం శాసనము17 |
| 8 వరాహవర్తని విషయము <br> 9 సిద్ధార్థక గ్రామము | ఇంద్రవర్మ అచ్యుతాపుర శాసనము18 |
| 10. క్రోష్టుకవర్తని విషయము <br> 11. హరిభటగ్రామము | ఇంద్రవర్మ శాంతబొమ్మళి శాసనము19 |
| 12. దేవన్న పొంచాలి <br> 13. కెత్తటగ్రామము | ఇంద్రవర్మ పర్లాకిమిడి శాసనము20 |
| 14. క్రోష్టుకవర్తని <br> 15. పొప్పంగిక | వేంద్రవర్మ శ్రీకాకుళ శాసనము E. I Vol. III P. 130—134. |
| 16. పుష్యగిరి పంచాలి విషయము <br> 17. హడువకగ్రామము | దేవేంద్రవర్మ ధర్మలింగేశ్వరాలయ శాసనము J. A. H. R. S. Vol. II P. 275-276 |
| 18. క్రోష్టుకవర్తని <br> 19. తాలత్తేరి | అనంతవర్మ ధర్మలింగేశ్వరాలయ శాసనము. J. A. H. R. S. Vol. II P. 271—274. |
| 20 చిఖల్లిక | నందవర్మ శాంతబొమ్మాళి శాసనము. J. A. H. R. S. Vol. II P. 185—189. |

గాంగ వంశీయులకు సంబంధించిన అనేక శాసనములు ప్రకటించబడినవి. శాసనములలో పేర్కొనబడిన గ్రామ నామములు కొలది మార్పులతో నేడు మనకు శ్రీకాకుళము విశాఖపట్టణము గంజాం మండలములలో కనిపించుచున్నవి. ఈ రాజ్యములు వేద వేదాంగములు తెలిసిన బ్రాహ్మణులకు అగ్రహారము లొసంగినారు.

దశకుమార చరిత్ర రచించిన దండిమహాకవి తన గ్రంథమున తూర్పు చాళుక్యరాజగు జయసింహుని ప్రశంసించెను. దండి కళింగదేశపు వసంతోత్సవములను, ఆంధ్రుల నౌకాబలమును, నౌకా సమర కౌశలమును వర్ణించెను.

'కళిఙ్గ రాజస్సహాఙ్గనేన సహచ తనయయా. సకలేన చ నగరజనేన, దశ త్రీణి చ దినాని......... స్సైకతతటే'......సాగరతీరకానసే క్రీడా రస జాతాసక్తి రాసీత్...ఆంధ్రనాథేన జయసింహేన సలిలతరణ-సాధనానీ తేనా నేకశంఖ్యేనానీకేన...'21.

ఆంధ్ర నగరమును దండిమహాకవి 'ఆంధ్రనగరం. తస్య నాత్యాసన్నే సలిలరాశి సదృశస్య కలహంస గణ గళిత నళినదళ సంహతి గళిత కిఙ్జల్క శకల శారస్య సారసశ్రేణి శేఖరస్య సరస' అని వర్ణించినాడుకావున కొల్లేరు సరస్తీరమున ఆంధ్ర

14. J. A. H. R. S. Vol. III. Part. I P. 49-53.

15. Indian Antiquary Vol. XIII P. 273.

16. Indian Antiquary Vol. X. P. 243.

17. Epigraphica Indica Vol. XVII P. 330—334.

18. Epigraphica Indica Vol. III. P. 127—130.

19. J. A. H. R. S. Vol. IV. P. 1 and 2.

20. Indian Antiquary Vol. XVI. P. 131—134.

21. దశకుమార చరిత్ర — మంత్రగుప్త చరితమ్ — సప్తమోచ్ఛ్వాసః.

నగర ముండెనని భావింపనగును. జయసింహ మహారాజునకు సర్వసిద్ధి బిరుదమున్నది. అతడు తనపేర సర్వసిద్ధి నగరము నిర్మించెనని తలంపవచ్చును. అదియే దండి పేర్కొనిన ఆంధ్రనగరము కావలయును.

గాంగవంశపు రాజులు సంస్కృతభాష నభిమానించి పోషించినారు. వీరు వేయించిన శాసనములన్నియు సంస్కృతభాషలో నున్నవి. దాన ప్రతిగ్రహీతలు వేదముల నభ్యసించిన సద్బ్రాహ్మణులు. బ్రహ్మచారులు భూపేంద్రవర్మ కుమారుడగు దేవేంద్రవర్మ వేయించిన చీడివలస తామ్రశాసనము అతనిచే కోలువర్తని విషయమండలి కందలివాడ గ్రామవాస్తవ్యులగు ఆదిత్యభట్టు, యజ్ఞభట్టు మున్నగు వారికి సివిడి ప్రదేశమును సర్వకర పరిహారముగా దాన మీయబడినది.

'యజ్ఞము చేయుట, వేదములు చదువుట, మొదలగు సత్కార్యములం దాసక్తి కలవారును సివిడి గ్రామ వాస్తవ్యులును, వేదములను, వేదాంగమును చదివినవారును ఎప్పుడును శాస్త్రచోదితమైన ధర్మమును నడుపువారును సివిడి గ్రామార్జిత గోజాదీక్షిత వంశమునం బుట్టినవారును, ఆంగీరస బార్హస్పత్య భారద్వాజ ప్రవరాన్విత భారద్వాజ గోత్రులునగు ఆదిత్యభట్టు, యజ్ఞభట్టు, శండిదేవరభట్టు మొదలగు వారికొరకు సూర్యగ్రహణ సమయమున కందలివాడ గ్రామమునందలి సివిడి ప్రదేశము ఏ విధమైన పన్నులు లేకుండ దానము చేయబడినది'[22].

జైనమతము వ్యాపించిన కాలమందే దేశమున జైన వాఙ్మయము వర్ధిల్లినది. జైనము సన్నగిల్లు సమయమున బౌద్ధమత విజృంభణ జరిగినది. ఆర్యుల సంపర్కమువలనను, ఆంధ్రదేశ ప్రభావము వలనను కళింగమున వైదికమతము వ్యాపించినది. గాంగరాజులు పరమ మాహేశ్వరులును, పితృభట్టారక పాదభక్తులు నగుటవలన వేదవిద్యలను ప్రోత్సహించి, వేద పండితులకు, వేద విదులైన బ్రాహ్మణులకు అగ్రహారముల నొసంగి వైదికమత విజృంభణమునకును, దేవాలయముల నిర్మాణమునకును మార్గదర్శకులైనారు.

కళింగనగరము లేక ముఖలింగము, శ్రీకూర్మము, సింహాచలము అర్సవిల్లి, దీర్ఘాసి, మున్నగు ప్రాంతములందు వెలసిన దేవాలయములలోని శాసనము లాంధ్రభాషాభివృద్ధిని సూచించును. దీర్ఘాసిశాసనము, ఆంధ్రభాష కమూల్యాలంకారము. ఈ శాసనము ప్రాచీనమైనది. ఇందలి పద్యము లా కాలమున ఆంధ్రదేశమున వెలసిన శాసనపద్యములవలె నున్నవి.

**కళింగాంధ్ర శిల్పము :**

కళింగములోని భువనేశ్వరాలయములలో నతి ప్రాచీనమైనది పరమేశ్వరాలయము ఇది గోపురాకృతి గల ప్రధానాలయము, దానినంటి ముఖ మంటపమును కల్గియున్నది. విశాఖపట్టణములోని నారాయణపురమున గల నిలీశ్వరాలయమును, ముఖలింగేశ్వరాలయమును ఇట్లే యున్నవి. ముఖలింగమున గల దేవాలయ కుడ్యములపైనను, స్తంభములపైనను గల శాసనములనుబట్టి క్రీ. శ. 1058 నాటికే ఈ ముఖలింగాలయము ద్వారతోరణ ప్రాకార సహితముగా నిర్మింపబడి యుండెనని చెప్పవచ్చును. రెండవ కామార్ణవుడు నగరమందు మధుకేశుడను లింగాకారమునకు ఆలయనిర్మాణము గావించినట్లు శాసనములందు వర్ణింపబడినది రెండవ కామార్ణవుడు 8 వ శతాబ్దివాడు. శా. శ. 991–999 వరకు కళింగము నేలిన రాజరాజు కాలమునాటికే నారాయణపురమునందలి నిలీశ్వరాలయము సంపూర్ణముగా నిర్మింపబడినట్లు శాసనములవలన తెలియుచున్నది.

కళింగదేశములోని ఆలయముల నిర్మాణపద్ధతి వాస్తుశాస్త్రప్రకారము ఉన్నది. ఆలయపు పునాది చతురస్రముగనుండి నాలుగు వైపుల నాలుగు ద్వారములుండును. పునాదిపై కుడ్యము నిర్మించి తూర్పుముఖమున ద్వారమునకు తావు విడిచి, మూడు వైపుల ద్వారమునకు బదులు వెలుపలికి ముఖముండు

22. J. A. H. R. S. Vol. II. P. 2.

నట్లు గుళ్లను కట్టుదురు. తూర్పు ముఖమున నుండు లింగము ఆలయగర్భము మధ్య నుంచెడి వారు. తక్కినవానిలో పార్వతి, కుమారస్వామి, గణపతి విగ్రహములను ప్రతిష్ఠింతురు. గోడలు నిడువుగా నుండి, రాను రాను వర్తులముగా కట్టి, గోపురాకారముగ నిర్మింతురు. గూండ్లపైకూడ గోపురముల నిర్మింతురు. ప్రధానగోపుర మెంత ఎత్తుగా నుండునో పిల్ల గోపురములను అంత ఎత్తు కట్టుదురు— ప్రధాన గోపురమునకు నాలుగు వైపుల యోగీశ్వరుల ప్రతిమలు నిర్మింతురు. ఇట్టి నిర్మాణమును ముఖలింగాలయమున మనము చూడగలము.

వారాయణపురమందలి నిలీశ్వరాలయ నిర్మాణము ముఖలింగాలయ నిర్మాణమునకన్న విశిష్టమైనది. పునాది గోపురములు వర్తులాకృతిని బొందిన శిల్పసంపదతో కూడుకొనిన దేవాలయములు భువనేశ్వరమున నున్నవి.

నిలీశ్వరాలయమునకు, ముఖలింగేశ్వరాలయమునకు ముఖమంటపము లున్నవి. నాల్గు పలకలు గల ఎత్తైన రాతిస్తంభములు రెండు వరుసలలో వరుసకు నాలుగేసి స్తంభములును, వీటిపై నిలువుగాను అడ్డముగాను దూలములును, దూలములపై శిలా ఫలకములు, కప్పుగా అమర్చబడినవి. మధ్యనున్న స్తంభములకు, నాల్గైదడుగుల దూరమున రెండు వైపులనున్న స్తంభములకన్న చిన్నవైన గోడ లున్నవి. ఈ రెండు కుడ్యములను కలుపుచు, ముఖము వైపు, మధ్యద్వారమును, వదలి ఒక గోడ ఉన్నది. స్తంభ శిఖరములపైనుండి గోడలపైకి గల పలక రాళ్లు కప్పుగా నున్నవి. మధ్యకప్పు చదునుగా నున్నది. కప్పులమారులు పురాణగాథలకు సంబంధించిన చిత్రములతో వలరారుచున్నవి.

వారాయణపురములోని దేవాలయమున సముద్రమథనము, శ్రీరామజననమాది పట్టాభిషేకమువరకు గల గాథలు చెక్కబడినవి. భువనేశ్వరాలయ మంటప శిఖరములు మెట్లుమెట్లుగా పైకివెళ్లి చివర శిఖరముతో వంతమగుచున్నవి. మంటపము లోకదాని కొకటి కలిపి నిర్మించినట్టివి.

ముఖలింగక్షేత్రమునగల సర్వేశ్వరాలయద్వార ప్రతిమలు అద్భుతముగా నున్నవి గంగాదేవి మకరముపై, యమున తాబేటిపై నిలిచి హస్తములందు కలశములు ధరించి యొయ్యార మొలికించుచు నిలిచినట్లున్నవి ఇట్టి ప్రతిమలు ముఖలింగేశ్వరాలయమందును నిలీశ్వరాలయమందును కనిపించును.

ముఖలింగాలయ ముఖమంటపద్వారమున అమర్చబడిన అడుగు వెడల్పు, 9' ఎత్తు, 5' వెడల్పుగల ఫలకము మూడువైపుల తిరిగియున్న లత అద్భుతమైనది—అపూర్వమైనది. వంపులుగా తిరిగిన లత ఆకులు, తీగలు ఫలములుకలిగి, లతలవంపులలో లతా ఫలముల కనుకూలముగా స్త్రీ, పురుషులు మనోభావ ప్రకటనముచేయు నటనలతో నొప్పారుచున్నది. ఈ ఆలయోత్తరభాగమునున్న చిన్నద్వారము చుట్టు గల లత అనేకావస్థలందున్నమానవాకృతులు మనోహరముగ నున్నవి. సర్వేశ్వరాలయములోను, నిలీశ్వరాలయములోను నిట్టి లతాశిల్పము లున్నవి.

చతుష్కోణాకృతిలో విజయతోరణాకృతిద్వారము, ముఖలింగేశ్వరాలయ మంటపద్వారమున కెదురుగ 30' ల దూరమున నున్నది. ఇది చదునుగానుండి, ద్వారబంధపుకంబములపై విగ్రహములు కల్గియున్నవి. ఆరు ఫలకములుగల దీనిపై పురుషవిగ్రహములు, యోగుల విగ్రహములు, వనచరుల రూపములు సహజ స్వరూపమున నున్నవి. వీరు ధరించిన వస్త్రములు, ఆయుధములు మనోభావముల కనుగుణముగ నున్నవి.

5' పొడవు, 2' వెడల్పుగల ద్వారతోరణ ఫలకము పానవట్టముతో కూడిన లింగాకృతి కలిగి, లింగముపై తామరపూవులు చెక్కబడినవి రెండు వైపుల పురుషులు చేతులతో లింగము నెత్తుకొని గగనమార్గమున పయనించుచున్నట్లు చిత్రింపబడినది. మఱియొక తోరణ స్తంభముపై నొక వృక్షము

కుడివైపు ఉన్నతాసనా ధిష్ఠుడైన గురువు సముచిత స్థానముల నలంకరించిన శిష్యులు, ఏకపాద పీఠముపై కొన్ని గ్రంథము లున్నట్లు చిత్రింప బడినవి. ఈ తోరణము పొడవు వెడల్పులుకూడా మొదటిదానివలె నున్నవి. ఈ తోరణముపై ఎడమ వైపు వన్యప్రజలు చెట్టులలో ఫలముతెచ్చి, నిలిచి యుండ వారి నాయకుడు సాష్టాంగ దండప్రణామ మాచరించు చున్నట్లున్నది నాయకుని చేతిలో ఖడ్గమున్నది.

ఆగ్నేయమునన్న ఆలయతోరణ ఫలకముపై గజాశ్వరథ యోధనృపులు—వారి శత్రువులైన నవ రలు - ఆయుధపాణులై యున్నారు. వాయవ్యము నైఋతి ప్రాంతములందుగల ఆలయతోరణ స్తంభ ములపై సంగ్రామ చిత్రములన్నవి, ఒకదానియందు రాజా—రాణి చిత్రింపబడినారు.

6' పొడవు. 2' వెడల్పుగల ఫలకము, ముఖ లింగేశ్వరాలయ తోరణ స్తంభములపై నున్నది. ఇందు ఒకవైపు—శ్రీ కృష్ణ బలరాములు కంసుని చూడ నేగునపుడు, కృష్ణుడు మదగజమును వధించు చిత్రము; తరువాత చాణూరముష్టికులతో మల్ల యుద్ధము; కంసుని మెడను నాగలితో బలరాముడు లాగుట; కంసుని మరణము; సభికులు భయపడు చున్నట్లున్న చిత్రము లున్నవి. శివాలయమున కృష్ణ చరిత్ర చిత్రింపబడుట ఆశ్చర్యకరమైన విషయము. మంటపమువెలువలగల గూళ్లలో నరసింహస్వామి హిరణ్యకశిపుని వధించుట, వరాహమూర్తి భూమి నెత్తుటయు చెక్కబడియున్నవి.

ముఖలింగేశ్వరాలయమున వసారాకప్పు చావడి కప్పుకు మధ్య నమర్చబడిన ఫలకముపై వసంతోత్సవ విశేషములు చిత్రింపబడినవి. ఇందరణ్యము చెట్లు వేటకాండ్రు మృగములు ఉన్నవి. ఒకడు దుప్పిని కొట్టుచున్నట్లును మరియొక డడవిపందిని బల్లె ముతో పొడుచుచున్నట్లున్నది. వీనికి కుడివైపు వందిని, దుప్పిని మోసికొనివచ్చు చిత్రమున్నది. ఈ జంతువుల నాల్గు కాళ్ళకట్టి కఱ్ఱపెట్టి ల సహాయ మున, ఇద్దరిద్దరు భుజములపై పెట్టుకొని మోయుచున్నట్లు చిత్రింపబడినవి. రాజాగారొక ఆసనముపై కూర్చొనియుండ వారు జంతువులను రాజుకు చూపించుట విశేషము.

ముఖమండపము ఉత్తరద్వారము పైభాగమున 4' పొడవు అడుగు వెడల్పుగల ఫలకముపై శివపార్వ తుల జూదము చిత్రింపబడినది జూదమున శివు డోడి పోవ పార్వతి చెలికత్తెలు-పరిచారికలు శివుని వస్తు వుల నొక్కొక్కటే తీసుకొనిపోవుట చిత్రింపబడినది.

ఉత్తరమునగల గోడగూళ్లలో భూ, వరాహ నరసింహమూర్తులు, నటరాజస్వామి విగ్రహములు ప్రతిష్ఠింపబడినవి. దక్షిణమునగల కుడ్యమున నిర్మిం చిన గూళ్లలో దండములు ధరించిన సన్యాసుల ప్రతిమ లున్నవి. ఈ సన్యాసులు బోడితలలపై ముసుగువేసుకొనినట్లు చిత్రింపబడినారు. ఒక గూటిలో కిరీట, కుండలధారియై కుడిచేతిలో వజ్రా యుధము ధరించి నిలిచిన విగ్రహమున్నది. ఇది వజ్రహస్తమహారాజుదని చారిత్రకుల యభిప్రాయము.

ముఖలింగేశ్వరాలయమునగల చిత్తరువులు, పూర్వకళింగశిల్పకళయొక్క ఘనతను చాటును. ఈ చిత్తరువులవలన చరిత్రాంశములు తెలిసికొనుట కవకాశమున్నది. జైనబౌద్ధమత సమ్మేళనమునుండి ఆవిర్భవించిన హిందూమతాంతర శైవాచార సంప్ర దాయములను తెలుపు శిల్పము లివి. ఆనాటి ప్రజల ఆచారవ్యవహారములు, శిరోజములకూర్పు, వస్త్ర ధారణపద్ధతులు, అలంకారములు, ఆయుధములు, ప్రజల నిత్యజీవితమున ఉపయోగించు రథములు, పీటలు, నాగళ్లు, పారలు, వివిధములైన వస్తువులు—రాజు మొదలుకొని, సామాన్యమానవునివరకు చిత్రింప బడినవి. ఈ చిత్రములవలన ఆనాటి ప్రజాజీవ విధానము, ఆచారవ్యవహారములు, యుద్ధములు, మున్నగు విషయములు సమగ్రమున తెలిసికొనుట కవకాశమున్నది.

నారాయణపురములోని నిలీశ్వరాలయమునగల ప్రతిమలు శైవమతసంబంధమైనవి. శివుని అవతారములు, శివుని లీలలు వివరముగా చెక్కబడినవి. ద్వారపాలకుల విగ్రహములు, అష్టదిక్పాలకుల విగ్రహములు, సూర్యచంద్రుల విగ్రహములు చెక్కబడినవి. పురుష విగ్రహములు, స్త్రీ విగ్రహములు సజీవముగ నున్నట్లు కనిపించును. ఇచటి అర్ధనారీశ్వరవిగ్రహ మత్యంతసుందరముగ నున్నది. స్త్రీ పురుష స్వరూపములేక ముఖమందు వ్యక్తమగునట్లు శిల్పి నేర్పుతో చెక్కినాడు.

ఉత్తరముననున్న గూటిలో శివకేశవుల భిన్న రూపములను ముఖకాంతులయందు శిల్పి చూపించినాడు. దేవాలయశిఖరముపై నాల్గు దిక్కులం దుంచబడిన భక్తుల విగ్రహములు స్పష్టముగ నున్నవి. ఒక్కొక్కరాయి, ఒక్కొక్క విగ్రహముగా అవయవములు స్ఫుటముగా కనిపించునట్లు చెక్కబడి యున్నవి ఏ దిక్కునుంచిన విగ్రహ మా దిక్కునకే తదేకదృష్టితో చూచుచు ఆ దిక్పాలకునితో సంభాషించుచున్నట్లు కనిపించును. కళింగశిల్పము — శిల్ప సంప్రదాయమున నొక అపూర్వరచనయై విరాజిల్లుచు ప్రాచీనభారతీయ శిల్పకళావిలాసమును తెలుపుటకు దేవాలయముల రూపమున కనిపించుచున్నది.



# పండితరాయల ప్రాణాభరణము

శ్రీ దివాకర్ల వేంకటావధాని

(గతసంచిక తరువాయి)

**33**

శంకర స్వఃపతివాహనులు మహితభటులు
రత్ననిభులైన కవులతో రాణకెక్కి
సత్కవిత్వసుధాకీర్తిచంద్రులకును
భాజనమవైతివీవు భూపాల తిలక!

(ఏకదేశ వివర్త్యుపమ)

**34**

ముందు నీ యెదుటిగాఁ గూలు భూమిపాల
భస్మశేషంబు రాజ! తర్వాత నీదు
కంటి బొమముడి యను స్వటంకంబునుండి
కోపమను నగ్నియొక్క మిణుగురులు రాలు.

(అతిశయోక్తి)

**35**

మానవులచేత సురలచే దానవాళి
చేతనిండిన త్రిజగతీసీమయందు
నిదివరకు లేడు లేడిపు డుదయమందఁ
బోఁడునీకు సమానుఁ డో పురుష వరుఁడు

(అసమాఖ్యము)

**36**

అమృత కల్పము నీ వాక్యమల్పమైన
నానవేర్చిన మా బోంట్ల కవని నాథ!

అంగనాధరబింబంబులందు తీపి
సంతసము గొల్పలేదు రవ్వంతయైన

(వ్యతిరేకము)

## 37

విద్విషుల భాగ్యములతోడి విష్టరమ్ము
నుండి యొక్కుమ్మడిగలేచి హుమ్మటంచు
వారిపై బడుచుండు నవ్వారిగాగ
వృత్త్యసహితంబుగా నీవు మేదినీశ!

(సహోక్తి)

## 38

ఆకసమునందు నెగడొంది యఖిల భువన
ములను గుముదినీ విలసనములే ఘటించు
తావకీన యశంబు భూస్థలికి డిగి
సగరసూనుల శ్రమము నిష్ఫల మొనర్చె

(ఉల్లేఖము— ధ్వని)

## 39

పాకశాసన సముఁడవు వసుధ నీవు,
పాలనము సేయుచుండఁగ వనములందు
వైరి తరుణుల కన్నుల వరదినవముల
వర్షమును గ్రమ్మరించు నవ్వారిగాగ

(తుల్యయోగిత)

## 40

జగతినహితాపకరణభేషజమ నీవు,
కరగతుఁడవై చరింపగ క్ష్మాతలేంద్ర
అఖిలమగు భూమి గ్రుమ్మరునట్టివారి
కెవని కేనియు నహిభయమ్మైనయ గలదె?

(శ్లిష్టపరంపరిత రూపకము)

## 41

కువలయ లక్ష్మి హరించును
ప్రవిమల భవదీయ కీర్తి పార్థివ మణి హే

తువ చిత్రవు రాట్పుం
గవలోక నమస్కృతాంఘ్రి కంజుఁడవయ్యా

(సమాలంకారము)

## 42

సభను నినుజూడఁ జందన చంద్రి
కాసముదయముతోచు నుగ్రమ్ములగుచు
సంగరమునందు నినుజూడ సౌమ్యములగు
శేషకాలానలానులు చిత్రమగుచు

(వినిమయము—తుల్యయోగిత)

## 43

హద్దులేని ప్రపంచమునందు బ్రహ్మ
యొక్క యర్జును నిర్మించె నక్కజముగ
నిర్మలంబగు నీ కీర్తి నియతివలన
నందఱునుగూడ నర్జునులైరి భూప

(శ్లేషమూలక వ్యతిరేకము)

## 44

బలికర్ణ దధీచులలో,
నల హేమహిమాచలమ్ములందును నీవుల్
పలుచనయ్యె ధైర్యము చం
చలమయ్యెన్ నీవు ధరణి శాసింపంగా

(యథాసంఖ్యము వ్యతిరేకము)

## 45

అటనిట యఖండ భూవలయమ్ము నీవు
పాలనము సేయుచుండఁగఁ బ్రబలశత్రు
మండలమ్ములలో మిత్ర మండలమ్ము
లందు నిశ్చింతగానుండు టబ్బ మయ్యె

(తుల్యయోగిత – వ్యాజస్తుతి)

బలియో కర్ణుండో శిబియోకో పార్థివుండు
ఖరకరుండోకొ యగ్నియొ కాలుండేమొ
నాఁగఁ బెక్కు వికల్పముల్బాగుచుండు
నర్థులకు విన్నుగన్న ప్రత్యర్థులకును

(ఉల్లేఖాలింగిత సంశయము)

## 47

కమలానివాసకాసా
రమ పౌచు క్షమాధృతి ఫణిరాజ వగుచు నీ
వు మదము గొల్పెద వత్యం
తము కువలయచంద్రుండగుచు నరులకుఁ బుడమిన్

(శ్లిష్టపరంపరిత రూపకము)

## 48

ఆకసమ్మునఁ జంద్రికలై హిమాద్రి
యందు హిమమయి నీయశ మ్మవనినాథ
భూమియందున సాగరమ్ముల విధాన,
సంచరించుచు నున్నది సంతసమున

(మాలోపమాలింగితోల్లేఖము)

మృగదీశులలో హరివయి
నగదీశుల నడుమ జందనప్రథ గనుచున్
దగియుందువు నక్షత్
జగదీశుల నడుమ నీవు చంద్రుండగుచున్

(మాలోపమ)

## 50

నీయుక్తులు యోగ్యమ్ములు,
శ్రీయుత పాల్కడలి నడుమ జెలువారు సితాం
గేయ గృహసీమరాకా
పీయూషకరాఖ్య పీఠి వసింయింపంగా

## 51

ఆవృత తరంగ సంతతి సుధాంశు విలాసము లచ్చి యాననా
బ్జమును నధఃకరించిన ప్రసాద మహాంబుధివైన నీ కెటుల్
సముదితమయ్యెనో ప్రళయ సంభృత దావ మహాగ్నికీల ల
బ్రవముగ వెలార్చు తేజము ధరాపరిపాలక! యుల్బణమ్ముగా

(విషమము)

## 52

కమతాధీశు కవిత్వముల్ చెవిని సోఁకన్ వ్రాసెఁ దైలంగ వం
శ్య మహాలక్ష్మి కృపాతిరేకమునఁ బెంచన్ బెద్ద పేర్గన్న పే
రమభట్టాహ్వయు పుత్రుఁ డుర్విబుధసూర్యప్రాయుఁ డీ కబ్బమున్
దమితోఁ బండితరాజు పండితజగన్నాథుండు తత్కీర్తికై.

(సమాప్తం)



# ప్రాచీన కవులు: ప్రయోగ విశేషములు

శ్రీ దీపాల పిచ్చయ్యశాస్త్రి

బాలవ్యాకరణమునకును, అప్పకవీయమునకును సరి పడని ప్రయోగములు ప్రాచీనకవుల కావ్యములలో విరివిగా ఉన్నవి. అవి యపపాఠము లనుకొని, పరిష్కర్తలు వాటిని—బాలవ్యాకరణమునకును, అప్పకవీయమునకును సరిపడునట్లు — మార్పులు చేసి యున్నారు. అట్లు మార్చుట సరికాదని, నేను నా 'భాగవతపాఠ పరిశోధనము'లో తెలిపియున్నాను. తదనుబంధముగా ఇపుడీ వ్యాసము వెలువరుచుచున్నాను.

### 1. పద్యము: ఛందోవ్యాకరణములు

ఛందోబద్ధమైనభాష పద్యము భాషకు వ్యాకరణము ముఖ్యము; పద్యమునకు ఛందస్సు ముఖ్యము. కాబట్టి పద్యరచనకు, ఛందస్సు — వ్యాకరణమూ — రెండును కావలసినవే. అయినను, అందు ఛందస్సు ప్రధానము వ్యాకరణము అంత ప్రధానము కాదు. పద్యములో వ్యాకరణదోషము దొరలినను ఫరవాలేదు గాని, ఛందోభంగముమాత్రము కాగూడదు. అది ఉల్లంఘింపరాని శాసనము. ఆ శాసనమును కవులెల్లరును పాటించియున్నారు. ఛందస్సుకు భంగము కలుగునని తోచినపట్ల వ్యాకరణమును ఉపేక్షించి యున్నారు. ఈ యంశమును నిరూపించు ప్రయోగములు కొన్ని 'నాపరిశోధనము'లో 'ఛందస్సు—శబ్ద ప్రయోగము' (పు 248) అను శీర్షికక్రింద ఇచ్చియున్నాను. మరికొన్ని ఇక్కడ ఇచ్చుచున్నాను

#### 1. 'నాజభములు'

'విభవ సముజ్జ్వల త్వదరవింద
ముకుంద యనంగ నొప్పు నా
జభములు జాజరేఫములుఁ
జంపకమాల కగున్.'

ఛందోదర్పణము. (2 - 98)

'నాజభములు' అనగా, రెండు నగణములు, జగణ భగణములు—అని యర్థము. చంపకమాలకు మొదట ఉండవలసిన 'న'గణము ఒక్కటే; రెండు కాదు. కనుక 'నజభములు' అనవలె. 'నజభములు' అంటే, అనంతుని పద్యమున గణభంగము తటస్థించును. అందువలన నతడు 'నాజభములు' అన్నాడు.

శ్రీ రావూరి దొరసామిశర్మగారు, —'నాజభములు—అని గణానుకూలముగా రచితము. నజభములనియే గ్రహింపవలయును' అని 'ఫుట్‌నోటు'లో తెలిపియున్నారు.

ఈ పద్ధతి నన్నయనాటినుండియు కలదు. ఆయన 'రాజనారాయణ'అను పదమును, గణము సరిపడుటకై 'రాజానారాయణ' అని ప్రయోగించి యున్నాడు. దీనినిగూర్చిన వివరములకు, నా 'పరిశోధనము' చూచునది. (పు. 260.)

#### 2. 'కేకీరవంబు'

'పుంస్కోకిల రావంబుల్ వెలంగున్—గృత కనగతటా—కీర్ణకేకీరవంబున్' (నన్నె కు. 7—98.)

'కేకి' నకారాంతశబ్దము. కావున 'కేకిరవంబున్' అనవలె. గణానుకూలముగా, 'కేకీ'అని దీర్ఘాంతముగా వాడబడినది.

#### 3. 'చాపజ్యా'

'వి, ద్యుచ్చల చాపజ్యాఁ దూపుఁ
దొడుగుచుఁ బలికెన్.'

(ఆముక్త. 3—28)

ఇందులో 'జ్యా' శబ్దము 'జ్య'అని హ్రస్వీకరింపబడినది. 'విద్యుచ్చల చాపమునఁ దూపు'అని వేదంవారి సవరణ.

4. 'భద్ర భూవు'

'నిస్తులాస్యశ్రీ వయఃస్తంభ నిక్షిప్త
నిబిడ్ఛదభ్రభు వల్లంబు నిక్క'
(ఆముక్త. 5-67)

'భ్రూ'శబ్దము తత్సమమున 'భ్రూవు' అగును గాని 'భ్రువు' కాదు. కాకపోయినను, 'భ్రూవల్లంబు'అంటే గణభంగమగునుగనుక 'భ్రువల్లంబు' అని ప్రయోగింపబడినది.

'నిబిడచ్ఛదభ్రూవు నిక్క సుంత' అని వేదం వారు మార్చినారు.

5. 'గాయకా కలకలము'

'..........మాగధవందిగాయకా
కలకల మెల్ల మాన్చి'
(సిం. ద్వా-2-6)

ఇందు 'గాయక'శబ్దము 'గాయకా'అని పొడిగింపబడినది.

6. 'శంకావహోర్ఝుంకార'

'...మీ నకేతన ధనుష్టంకార శంకావహో
ర్ఝుంకారాళికులంబు' ( ,,-2-78)

'శంకావహర్ఝుంకార' అనవలె. అట్లంటే గణము సరిపడదు. అందువల్ల 'శంకావహో'అని కదింప బడినది.

7. 'భార్యా'

'ఆ రాజేంద్రున కగు భా
ర్యా రతిశాస్త్రనురు వ.
(యామిని. 1. ఆ.)

'భార్యా' సంస్కృతము. తెనుగున 'భార్య' అను తత్సమమును వాడవలె 'భార్య'అంటే గణము సరిపడదు. అందువలన 'భార్యా'అను సంస్కృత శబ్దమే వాడబడినది.

8 'గుణావతి'

దుర్గుణావతి వైతివో దోసకారి
సద్గుణావతివని నిన్నుఁ జాలనాదు'
( ,,-5. ఆ.

'దుర్గుణవతి' — 'సద్గుణవతి' — అను శబ్దములు, ఛందస్సుకు అనుకూలముగా, 'దుర్గుణావతి'— 'సద్గుణావతి'అని ప్రయుక్తములైనవి.

9 'నిష్ఠారము'

'నిష్ఠారంబుగఁ బట్టి తెచ్చుచుఁ
గపుల్ నిక్కన్' (శతకంఠ 1-109)

ఇందులో 'నిష్ఠుర'శబ్దము గణానుగుణముగా, 'నిష్ఠార'మని వాడబడినది.

10 'ఉభయభాష'

'స్వాభావిక నవకవితా
ప్రాభవమున నుభయభాషఁ బ్రౌఢిమఁ జెప్పన్'
(విక్రమార్క. 1-24)

'ఉభయభాషల' అనవలె అప్పుడు 'ల'అను వర్ణ మధికమై గణము చెడును. అందువల్ల 'ఉభయ భాష' అనబడినది.

11. 'సుఖానిద్ర'

'వీఁడా సుఖానిద్ర విభవంబుగల కుంభ
కర్ణుని దెగటార్చఁ గన్నవాఁడు'
(శతకంఠ. 4-69)

ఇందులో 'సుఖనిద్రావిభవంబు',— 'సుఖానిద్రవిభవంబు'గా ప్రయోగింపబడినది.

12. 'మారీచబాహులు'

'వీఁడా మహారణ విక్రమధైర్యుల
మారీచబాహుల మాపినాఁడు.' ( ,,- ,,)

'మారీచ సుబాహుల' అనవలె అట్లనుట, ఆ సీసచరణములో కుదురనందున, కవి,'సు'ను తొలగించి, 'మారీచబాహుల' అన్నాడు.

ఇట్లే ఒక కవి 'ఉపధాన మమర్చె' అనుటకు గీతపాదమున చోటు చాలక, 'ధానము'ను వదలివేసి, 'ఉపధ యమర్చె' అన్నాడు. (చూ. భా. పా. పరిశోధనము. పు. 301)

13. 'తిరునామ'

'ముదిత నెలవంక తిరునామ నుదుటఁ దీర్చి'
(రాధా మా. 5—256)

ఇందులో 'తిరునామము'అను పదము 'తరు నాము'అని ప్రయోగింపబడినది. చోటు చాలకనే.

14. 'చేయకూ'; 'డాయకూ'

'డబ్బు లన్నియుఁ దెలుసుకుంటివని
తప్పుబాసలు చేయకూ,
మబ్బుదేరెడు కన్నుఁగవతో
మాటిమాటికి డాయకూ,
ఉబ్బుచేసుక తత్తరంబున నొడలిపై
చెయి వేయకూ,
గబ్బితనమున దనుజమర్దన కందుకూరి
జనార్దనా.'
(చాటు మణి ప్ర భా.)

ఇందులో చేయకు; డాయకు; వేయకు—అను క్రియలు. పద్యగమనము చెడకుండుటకై, దీర్ఘము లుగా వాడబడినవి

15. 'ఎన్దలల్'

'కన్నుఁ, దొలుతఁగ వెట్టితివే? వెఱవ కోడక
నొంపఁగ వాని కెన్దలల్, గలవు?'
(ఉ హరి. 5-87)

ఎన్దలల్=ఎన్నితలలు. 'ఎన్నితలలు' అనుటకు వీలులేక, 'ఎన్ని'-'ఎన్'గాను, 'తలలు'-'దలల్' గాను ప్రయోగింపబడినవి.

16. 'ఇదిన్'

'కృతఘ్నా యిదిన్ నోరే?' (.,-4-187)

'ఇదియున్' అనుటకు ఎడములేక 'ఇదిన్' అనబడినది.

ఇట్టిదే మరియొక ప్రయోగము—'విమం డదిన్, జెప్పెద నంచు' (కళా 4-50)

17. 'తల్గు'

'దుఃఖ నిరంతర మానసవ్యథలు తల్గుము'
(భా. అరణ్య. 6-366)

'తలఁగుము'అను క్రియ, గణానుకూలముగా 'తల్గుము'అని ప్రయోగింపబడినది. 'తలుగు (=పశువును కట్టివేయుతాడు)'—'తల్గు'అగుట సహజము గాని, తలఁగు—'తల్గు'అగుట సహజముకాదు.

18. 'తల్చు'

'కార్యము, ప్రతాపగురుండు మంత్రి వివరంబుల కేమని దల్చుదాన?' (యామినీ. 5. అ.)

'తల్చు=తలఁచు.'—'తల్గు'అను భారత ప్రయోగమువంటిదే ఈ 'తల్చు'.

19. 'మోర్ల'

'దక్షవాటికిఁ జూచి దక్షప్రజాపతిఁ
బొగడె నలోమ్మోర్ల నంభోజభవుఁడు'
(భీమ. 3-136)

'నలోమ్మోర్లన్'అంటే, నలు మోరలన్=నాలుగు ముఖములతో—అని యర్థము (మోర=ముఖము)

మోరలు—'మోర్లు'అగునుగాని, మోరలు—'మోర్లు' కావు. 'పొగడె నలోమ్మోరల నంభోజభవుఁడు' అనుటకు ఛందస్సు ఒప్పదు. అందువలన 'నలోమ్మోర్ల' అని ప్రయోగింపబడినది.

20. 'చవ్కె'

సరసిజనేత్రి ముందు శయనించిన
చిత్తరు చవ్కె లోపలన్'
(శశిరేఖా. 3-130)

ఇందులో, చవికె 'చవ్కె'గా వాడబడినది. వ్యాకరణ మొప్పదు. 'చిత్తరు చవికె లోపలన్' అనుటకు ఛందస్సు ఒప్పదు. ఛందస్సుకొరకు వ్యాకరణ ముపేక్షింపబడినది.

21. 'బోల్స్వామి'

'చటులస్ఫూర్తి వెలుంగు కృష్ణనృపుఁ
బోల్స్వామిన్ ధరం గంటిరే?'
(రెట్టమత. 1-47)

'కృష్ణనృపు బోలు స్వామిని' అనుట వ్యవహారమునకు అనుగుణము. అది పద్యమున కుదురదు అందువల్ల 'బోల్స్వామిన్' అనవలసివచ్చినది.

22. 'తూ మ్లు'

'వసుసన్నిభ! మూఁడు తూమ్లు
వానయుఁ గలుగున్' (,, –5–68)

తూములను 'తూమ్లు'అని యెవ్వరును అనరు. మరి ఆ కవి యేఁదు కన్నాడు? ఛందో నిర్బంధము వల్లనే.

23. 'ఎ డ్మ'

'అదరుల్ వాఅ మురారి
యెడ్మబరి వ్రేయఁన్' (పాండు. 2–103)

ఇందులో, 'ఎడమ'అను పదము, పద్యలక్షణము ననుసరించి 'ఎడ్మ'గా ప్రయోగింపబడినది.

కల్ద్లు; వల్దు; కొల్ది; పొర్లు; మెల్పు (మెలపు); తల్పు (తలఁపు)- మొదలగు రూపములు ఇట్లేర్పడ్డవి.

24 'క స్క ర ము'

'దేవప్పరమున నఁచు నారకులఁ బట్టఁ
గృతాంతుఁడు గస్కరంబునన్'
(రసాభరణము. 1–12)

'కనికరము' అసలు శబ్దము. ఆ రూపము పద్యమున ఇముడనందున 'కస్కరము'గా కుదింప బడినది

25. 'రా చ ర్క ము'

'రాచర్కమునఁ గొంత అర్వెయ్యె మార్లేక'
(రాధామా. 3–45)

ఇందలి 'రాచర్కము', పై 'కస్కరము' వంటిదే. అసలు రూపము 'రాచరికము.'

26. 'చిన్ రాయ'

'రవితులిత దేహవిభునిఁ జిన్ రాయవిభుని'
(ఆంధ్రభాషార్ణవము. పీఠిక, 20)

'చిన్ రాయ=చిన రాయ.' చిన=చిన్న. 'చిన' అను విశేషణము ఛందస్సు చెడకుండుటకై 'చిన్'గా వాడబడినది.

27. 'ప ద్నా క ం ట'

'అరుదుగఁ బద్నాకంటను
గవాతుని మూర్ఛిలఁజేసి'
(శతకంఠ. 4–23)

'పదునాకంటను' – ఆమాటకు వీలులేక 'పద్నా కంటను' అనబడినది.

28. 'గు ర్వు'

'మఱియు గుర్వునకు నమస్కరించి'
(,,–1–172)

'గురువు' సంస్కృతశబ్దము 'గుర్వు'అనుట వ్యాకరణసమ్మతముకాదు కాకపోయినను, ఛందస్సును బట్టి 'గుర్వు'గా వాడబడినది.

ఇట్లే, 'కురువకము'ను — 'కుర్వక'మని నన్నెచోడకవియు, 'తరువు'ను–'తర్వు'అని తెనాలిరామ లింగకవియు వాడియున్నారు. (మా. భా. పా పరిశోధనము. పు. 249, 254.)

29. 'కు రి ం చె'

'నేలకు డిగ్గఁగానుఱికి నిల్చి
కురించె మహాస్త్రవర్షముల్'
(శతకంఠ. 4 – 24)

'కురియించె' అనవలె. గణము సరిపడుటకు 'కురించె' అనబడినది. ఇట్లే, లక్షణకర్త–అనంతుడును—'కురిందిరి' అని ప్రయోగించియున్నాడు. (మా. భా పా. పరి—పు. 252.)

30. 'ఇ త్తు మ్'

'కోమలిఁ గొనివచ్చి
నీకు గొబ్బున నిత్తుమ్' (శతకంఠ. 3–84)

ఇందు 'ఇత్తుము' అను బహువచనక్రియ, గణానుగుణముగా–'ఇత్తుమ్'అని ప్రయోగింపబడినది. 'ఇత్తును'అను క్రియను 'ఇత్తున్' అనుట వ్యాకరణ సమ్మతముగాని, 'ఇత్తుము'అను క్రియను 'ఇత్తుమ్' అనుట వ్యాకరణసమ్మతముకాదు.

### 31. 'తలంతుమ్'

'......గురుముఖ్యున్ మేరుధీరున్ మహా,
దారున్ వేంకటభట్టురార్యుఁ దలఁతుమ్ దాత్పర్య
మింపొందఁగన్' (రెట్టమత. 1–5)

ఇందును, 'తలఁతుము'అను బ. వ. క్రియ, ఛందస్సు ననుసరించి, 'తలఁతుమ్'అని ప్రయోగింప బడినది.

### 32. 'వద'

'నీ, వదఁ బదమూన కేను
వనవాస మొనర్చెద నన్న'
(వేం. పంచతంత్రము. 1–84)

'నీవద=నీవద్ద.'—'వద్ద'అనుటకు పద్యలక్షణ మొప్పదు. అందువలన 'వద' అనబడినది

### 33. 'తోడ్కు'

'సమయంబని తోడ్కురాఁగఁ 'జారులఁ బనిచెన్'
(యామినీ. 2 ఆ)

'తోడుకొను' అను క్రియ 'తోడుక'గా మారినది. 'తోడుక' అనుటకు పద్యములో సందులేక 'తోడ్కు'గా కుదింపబడినది.

### 34. 'తొడుక'

'బోధమయున్ సంసారాం
బోధితరణిఁ గొలువఁ దొడుక పోయెద రనుచున్'
(కాళ. మా. 4–51)

'తోడుక', ఇందులో—'తొడుక' అయినది.

### 35. 'ఇయక'

'వారి వారి గోత్ర వంశ సంకరముగా
నియక యతివఁ బెండ్లియయిన మేలు'
(విష్ణుపు. 4—184)

'ఇయ్యక' అనవలె; లేదా 'ఈయక' అనవలె. ఆ రెండును పద్యమున సరిపడనందున, కవి తన రచన కనుకూలముగా—'ఇయక' అన్నాడు.

### 36. 'అయె'

'అఖిలానందరసాబ్ధి నైక్యమయె
నాహా మాట లింకేటికిన్?'
(యామినీ. 5. ఆ.)

'ఐక్యమయ్యె' అనవలె. 'అయ్యె' అంటే గణభంగమగును. అందువలన, 'ఐక్యమయె' అని ప్రయోగింపబడినది.

### 37. 'కలితే'

'అచ్చలమా యేటికి నెత్తిఁ
గొట్టుకొనఁగా సన్న్యాసమున్ న్యాసమున్.
గలితే చాలు మదీయ భక్తిరుచి
భక్తశ్రేణి కశ్రాంతమున్'
(పాండురంగ. 4–98)

ఇందులో, 'కలిగితే' అను అర్థమున 'కలితే' అని యున్నది. శ్రీ అనంతకృష్ణశర్మగారు—'కలిగితే-అనుటకు 'కలితే' అని అన్నమాచార్యుల ప్రయోగములు గలవు ఈ ప్రయోగ మితరులలో కానరాలేదు' అని తెలిపియున్నారు. ఎవరు వాడినను, అది సహజమైన రూపము కాదు.

### 38. 'నివు'

'కోకిలమా నివు మాతో
నేకగ్రీవముగనుండి' (యామినీ. 4. ఆ.)

ఇందు 'నీవు', ఛందస్సు చెడకుండుటకై—'నివు' అని హ్రస్వాదిగా వాడబడినది

### 39. 'మమేచ'; 'తల్చుకోక'

'కోకమా మ మేచఁ దల్చుకోక మానవే...'
('' — '')

'మమ్మేచ'—'తలఁచుకోక' అనవలె. ఛందస్సు ననుసరించి, 'మమేచ' అనియు, 'తల్చుకోక' అనియు ప్రయోగింపబడినవి.

### 40. 'తీక్షణాస్త్ర'

'అసిముఖ తీక్షణాస్త్ర వివిధాశుగ
సంచిత శౌర్యశాలి' (శతకంఠ. 1–107)

ఇందులో 'తీక్ష్ణ'శబ్దము ఛందస్సౌకర్యార్థము 'తీక్షణ'గా వాడబడినది ఇట్లే, పర్యంకము—'పరియంకము'గాను, పర్యంతము—'పరియంతము'గాను ప్రయుక్తములై యున్నవి.

'తన పరియంకమందు వనితామణి'
(భాగ. 10. ఉ. 987)

'బరు లుబ్బగ బృషోత్థష్ఠము
పరియంతము మెక్కి' (శశిరేఖా 4—44)

41. 'నీఱుగాఁ జొచ్చెన్'

'నీ మందస్మిత వదనము
నీ మోహముఁ దలఁచి మనము నీఱుగాఁ జొచ్చెన్'
(భాస్కర. కిష్కి. 295)

'నీఱు కాఁ జొచ్చెన్' అనవలె గణములు సరిపడుటకు 'నీఱుగాఁ జొచ్చెన్' అనబడినది. కాని, అర్థము సరిపడదు

42. 'వలని నాటకముల్'

'నా మొగమోటకై వలని నాటకముల్ ప్రకటించి యుంచి'
(పారిజా. 1—89)

'వలని నాటకముల్' అన్నమాటకు, 'కొరమాలిన వేషాలు' అని మన మర్థము చెప్పుకోవలె 'కొరమాలిన' అన్నయర్థమున 'వలని' అనుట లేదు. 'వలవని' అనుట కలదు.

'ఓపుకో భూవర వలవని
హోహూ లివి యేల?' (సిం. ద్వా. 2—62)

,వలవని చెలిమియును జేయవలదుర సుమతీ'
(సు. శత 82)

కాబట్టి, 'వలవని' అనుటకు అవకాశములేక 'వలని'అని ప్రయోగించినట్లు కనబడుచున్నది.

43. 'మా చ వి'

'పొంకముగాని యీ వలని
బొంకులు మా చవిగావు'
(పారిజా. 1—126)

'మాకు చవిగావు' అనుట క్రమము ఛందస్సుకు సరిపడుటకు 'మాచవిగావు' అనబడినది.

44 'గట్టివ చేతలు'

'గట్టివ చేతలున్ బసలుఁ గల్లదనంబులు'
(,,—1—127)

గట్టివ చేతలు=ధూర్తకృత్యములు — అని యర్థము 'ధూర్తుడు'అను అర్థమునిచ్చు పదము 'గట్టివా'గాని. 'గట్టివ'కాదు.

గట్టి+వా=గట్టివా = గట్టిగా మాటాడువాడు. వా=వాడు (వారు). పద్యములో 'వా'శబ్దము గణానుకూలముగా 'వ' అని హ్రస్వముగ వాడబడినది.

45 'మధుమావతోర్గంటి'

'మధుమావ తోర్గంటి మండలమున'
(క్రీడా. 242)

'మధుమావతి + ఓర్గంటి = మధుమావతి యోర్గంటి' అగును. 'మధుమావ తోర్గంటి'అనుట గణముల ననుసరించియే.

46. 'మధురత'

'మధుర తౌదార్య సమాధి సామ్య శ్లేష
ములు పదియును ప్రాణములు'
(అప్ప. 1—33)

ఇందులో 'మాధుర్య' శబ్దమునకు బదులుగా—గణానుకూలముగా—'మధురతా'శబ్దము వాడబడినది.

గిడుగువారు—ఫుట్‌నోటులో— 'కావ్యగుణవాచకమైన యప్పుడు 'మాధుర్య'అని యుండదగు. అట్లున్నచో ఛందోభంగము. 'ధర్మధర్మిణో రభేదః' అను న్యాయము రసవాచకమైనయప్పుడే చెల్లును ఇచ్చట చెల్లదు'అని వ్రాసియున్నారు.

47. 'కజాయము'

'తెమ్మన్నన్ దెచ్చెద సాధుగుప్తములు
నవ్యంబుల్ కజాయంబు లిం దెన్నే నున్నవి'
(పాండు. 4—176)

ఇందు 'కజ్జాయంబులు', గణము సరిపడుటకై, 'కజాయంబులు'గా వాడబడినవి.

పాండు. కర్త, ఇట్లే, 'వక్కాణించు'ను 'వకాణించు'అని ప్రయోగించియున్నాడు.

'నీ నామములు వకాణింతు నెపుడు'
(4-92)

## 48. 'శరణ్యామయ్యా'

'...అగుణత్రయబద్ధ శరణ్యామయ్యా భా
స్వద్ధత చిత్ప్రబుద్ధ బసవా! బసవా! వృషాధిపా!'
(వృషా. శత - 31)

'శరణయ్యా' అని యనవలసియున్నను, ఆ వృత్తమున సరిపడనందున 'శరణ్యామయ్యా' అనబడినది.

ఇట్లే, 'సఖులు' అనవలసిన చోట, 'సఖ్యులు' అని ప్రయోగింపబడినది.

'సంతస చిత్తులై సుతులు సఖ్యులు
తమ్ములు భూసురేంద్రులున్'
(శశిరేఖా. 5 - 37)

## 49. 'దయ్యపు వెల్గు'

'ఆ, దయ్యపువెల్గు సుమ్మ
సతతస్థితి వెల్గెడుఁ బుండరీకవా
గ్దయ్యలఁ బ్రజ్వరిల్లుచు'
(పాండు. 4-123)

ఇందులో 'దయ్యపు వెల్గు' అనుమాట 'దివ్యజ్యోతి' అను అర్థమున వాడబడినది. అర్థము సరిపడునుగాని, ఔచిత్యము లేదు 'దివ్యజ్యోతి' అనుటలోగల ఉదాత్తభావము 'దయ్యపు వెల్గు' అనుటలో లేదు.

రామకృష్ణకవి ఈ మాత్రమెరుగడా! ఎరుగక కాదు; 'దివ్యజ్యోతి' అనుపదము ఆ పద్యమున ఇముడదు. 'దయ్యపువెల్గు' అంటే, ప్రాసము సరిపడి, పద్యము ధారాళముగా సాగిపోవుచున్నది. అందువల్ల ఆ పదము వాడినాడు.

## 50. 'వార్దోడై'

'పీడంబెట్టెదు సౌకుమార్యవతి
డప్పింగూరెఁ బాంచాలి వా,
ర్దోడై వచ్చిరి వారు లేక యిట మీతో'
(భా. మహాప్రస్థానిక. 50)

ఇందులోను, 'వారుతోడై' అనుటకు వీలు లేకనే 'వార్దోడై' అని ప్రయోగింపబడినది. (వారు+తోడై=వార్దోడై)

ఆంధ్రభాషానుశాసనకర్తలు, — 'ఘటేలతు ర్పెద్దలు; చూడర్జునులు—మొదలగు రూపములను బాలసరస్వతి యుదాహరించెనుగాని, యివి యిప్పుడు రుచింపవు' అన్నారు ((క్రియా. 97). 'వార్దోడై' అను రూపమును అట్టిదే.

ఇపుడు రుచింపకపోయినను, వ్యాకరణసమ్మతములు కాకపోయినను ప్రాచీనప్రయోగములను మనము మార్చరాదు. అవి భాషాపరిణామచరిత్రకు ఆధారములు. కావున వాటిని మార్చుట భాషకు అపకారము చేయుట యగును.

సంధిసమాసాదుల విషయమునను, యతిగణప్రాసముల విషయమునను పూర్వకవులు స్వతంత్రించి చేసిన ప్రయోగములును చాలా కలవు. మరియొక వ్యాసమున మనవిచేసెదను.

# చంద్రరేఖా విలాసం

డా. మహీధర నళినీమోహన్

(గత సంచిక తరువాయి)

నిజానికి ఈ మూడవ పద్ధతి చాలా సాహసంతో కూడుకొన్నది. ఒక్క శాటర్న్–5 రాకెట్టులో తీసుకు వెళ్ళగలిగిన ఇంధనం చాటాచాటీగా అత్తెసరు పదునుగా సరిపోతుంది. ప్రతికదలికనూ ఆచితూచి ఇంధనం రవ్వంతవ్యర్థంకాకుండా జాగ్రత్తగా పిసినిగొట్టులా జరపాలి. అనుకున్న ప్రకారం జరగక ఏపాటి ఏటూమోటీ వచ్చినా మనుష్యులు చంద్రునిలోని ఏ బండరాళ్ళకో గుద్దుకొని చచ్చిపోగలరు.



మూడుదశలలో ప్రేలి విడిపోయే శాటర్న్–5 రాకెట్.

చూడగా చూడగా ఈ మూడవ పద్ధతే అనువైనది అని తోచింది. ఆలస్యంకాకుండా ఉన్న రాకెట్టుతోనే పని జరుపుకోవచ్చు. ప్రయాణం సవ్యంగానే జరుగుతుందని లెక్కలు చూపిస్తున్నాయి అంతేకాదు, భూకక్ష్య సమాగమపద్ధతిలో అదనపుఖర్చుకి తోడు ఒక ఇబ్బందికూడా ఉంది. రెండు బ్రహ్మాండమైన రాకెట్లను భూకక్ష్యలో సమావేశం చేయడమూ, ఒకదానిలోని తైలాన్ని రెండవదానిలోకి భారరహితస్థితిలో 'పంపు' చేయడమూ కష్టమైన పనులే. అంతేకాదు. అంతరిక్షంలో తిరిగే రాకెట్లకు అంటుకున్న స్థిరవిద్యుత్తు (STATIC CHARGE) వల్ల రాకెట్లు దగ్గరగా వచ్చినప్పుడు 'స్పార్క్' (రవ్వలు) పుట్టి ఇంధనం అంటుకుంటే భయంకరంగా పేలిపోయే ప్రమాదం ఉంది పైగా చంద్రకక్ష్య సమాగమపద్ధతిలో చంద్రనౌక చిన్నసైజులో ఉండడంచేత చంద్రోపరితలానికి బహుదగ్గరగావెళ్ళి, దిగడానికి అనువైనస్థలం చూచుకుని. దిగేచోట ఎగుడుదిగుడు బండరాళ్ళు ఉన్నట్లైతే కొంచెం పక్కకిజరిగి చదునైనచోటు చూసుకుని జాగ్రత్తగా దిగడానికి వీళ్ళు ఉన్నాయి. ఏకారణంచేతనైనా చంద్రునిమీదికి దిగడం అపాయకరంఅనితోస్తే ఆఖరిక్షణంలోనైనాసరే వెంటనే తిరుగుముఖంపట్టి, చంద్రునిచుట్టూ చేరువలోనే తిరిగే మాతృనౌకను సురక్షితంగా చేరుకోడానికి అవకాశాలున్నాయి. అవసరం అయితే మాతృనౌకలోని నావికుడు తన నౌకను కొంచెం కిందికిదింపి, చంద్రనౌకను సమీపించి, అందులోని నావికులను రక్షించడానికి అవకాశాలున్నాయి. వందలకొద్దీ ఇంజనీర్లూ, శాస్త్రజ్ఞులూ,

నెలలతరబడి తర్జనభర్జనలుచేసి, ఆఖరికి చంద్ర కక్ష్య సమాగమపద్ధతినే అవలంబించాలని నిశ్చయించారు. తరువాత ప్రయాణ కార్యక్రమము, దానిని అంచెలవారీగా నిర్వహించవలసిన క్రమమూ గబగబా తయారయాయి. ఈ ఎపోలో కార్యక్రమంలో 11 వ అంచెలో మనిషిని చంద్రునిమీదికి పంపాలని నిశ్చయించారు ఇంతకుపూర్వం పంపిన వ్యోమనౌకలు, అవి సాధించిన విశేషాలనూ గురించి మరోసారి తెలుసుకుందాం.

ఫ్లోరిడాలోని కెనెడీ రాకెట్ లాంచింగ్ స్టేషనులో ఒకచోట బ్రహ్మాండమైన మూడు అంతస్థుల శాటర్న్-5 రాకెట్టు నిలువబడిఉంది. దానిమీద రోదసీనౌక ఈ నౌకలో మూడు ముఖ్యవిభాగాలు ఉన్నాయి—కమాండు మాడ్యూలు, సర్వీసుమాడ్యూలు, లూనార్ మాడ్యూలూనూ. ఇదంతా కలిపి 363 అడుగుల ఎత్తు. దీనిని పట్టుకుని స్థిరంగాఉంచే పెద్దఇనుపచట్రం. అందులోనే పైకీ కిందికీ తిరగడానికి లిఫ్టు.

ఈ ఎపోలో—11 చంద్రలోక యాత్రకోసం ముగ్గురు మెరికల్లాంటి జెట్‌విమానపు పైలట్లను ఎన్నిక చేశారు. వాళ్లకి ఏళ్లతరబడి శిక్షణ నిచ్చారు. వాళ్ల పేర్లు నీల్‌ఆర్మ్‌స్ట్రాంగ్, ఎడ్విన్‌ఆల్డ్రిన్, మైకేల్‌కాలిన్స్‌అని మీకు అందరికీ తెలిసినదే. త్వరలో వాళ్లపేర్లు ప్రపంచప్రసిద్ధం కానున్నాయి.

ఆర్మ్‌స్ట్రాంగ్ టెస్ట్ పైలట్‌గా పనిచేశాడు. X—15 అనే విమానాన్ని 200,000 అడుగుల ఎత్తున గంటకు 4000 మైళ్లవేగంతో నడిపించాడు. 1966 మార్చి 16 వ తేదీని జెమినీ-8 వ్యోమనౌకకి సారధ్యం వహించి, భూకక్ష్యలో తిరుగుతున్న మరో వ్యోమనౌకతో విజయవంతంగా కలుపగలిగేడు. 1968, మే 7 వ తేదీని చంద్రుని మీదికి దిగే ఘట్టాన్ని అభ్యాసం చేస్తూండగా, వెంట్రుకవాసిలో చావు తప్పించుకున్నాడు. చంద్రుని మీద మొట్టమొదటిసారి (జూలై 21. 1969, భారతీయ కాలమానంప్రకారం రాత్రి 11 గంటల 57 నిమిషాలకి) అడుగుపెట్టిన కీర్తి ఇతడికి దక్కింది.

చంద్రునిమీద అడుగుపెట్టిన రెండవ వ్యక్తి ఆల్డ్రిన్. చంద్రనౌకకు సారథి ఇతడు. ఏస్ట్రొనాటిక్స్ (వ్యోమయానం) అనే శాఖలో డాక్టరేటుడిగ్రీ పొందినవాడు. 1966 నవంబరులో జెమిని—12 వ్యోమనౌకలో జేమ్స్‌లోవెల్‌తో కలిసి ఇతడు 59 సార్లు భూప్రదక్షిణాలు చేశాడు. అప్పుడే ఆ వ్యోమనౌకలో నుంచి బయటికివచ్చి 129 నిమిషాలపాటు అంతరిక్షంలో 'నడిచాడు'.

**APOLLO 11 —— Launch And Translunar Injection**



Astronaut Insertion

అపోలో-11 వ్యోమనౌకలో వ్యోమగాముల ప్రవేశం.



Check Of Systems

వ్యోమనౌకలో యంత్రాల తనిఖీ.



Saturn Staging

శాటర్న్ రాకెట్ ప్రయోగం.



Translunar Injection

చంద్రమండల కక్ష్యలో చేరడానికి ప్రేలుడు.

మైకేల్‌కాలిన్స్ చంద్రునిమీదకు దిగకుండా మాతృనౌకలోనేఉండి, చంద్రప్రదక్షిణాలు చేశాడు. ముగ్గురిలోనే ఇతడి పనే తక్కువ ప్రమాదకరమైనది. 1966 జూలైలో జెమిని—10 వ్యోమనౌకకు పైలట్‌గా ఇతడు 44 భూప్రదక్షిణాలు చేశాడు. కక్ష్యలో తిరుగుతున్న నిర్మానుష్యమైన మరో వ్యోమనౌకతో తన నౌకను కలుపగలిగేడు. ఈ ప్రయాణంలోనే 39 నిమిషాలపాటు అంతరిక్షంలో నడిచాడు.

ఈ విధంగా చంద్రమండలయాత్రకు ఎన్నుకోబడ్డ ముగ్గురూ వ్యోమయానంలో పూర్వానుభవం ఉన్నవాళ్లే. భయంకరమైన పరిస్థితులలో మనోనిగ్రహం, గుండె నిబ్బరం చూపినవాళ్లే.

ఈ ముగ్గురు నావికులనూ తీసుకుని 1969 జూలై 16 వ తేదీని 1902 గంటలకు (I. S. T.) రాకెట్టు బయలుదేరింది. మొదటి అంతస్థు 38 మైళ్ల ఎత్తుదాకా ఎగిరి ఇంధనం అయిపోయాక, విడిపోయి కిందపడిపోయింది. అప్పుడు రెండవ అంతస్థు అందుకుని 119 మైళ్ల ఎత్తుదాకా ఎగిరి, విడిపోయింది అప్పుడు మూడవ అంతస్థు అంటుకుని, గంటకి సుమారు 17.427 మైళ్ల వేగం అందుకునేదాకా వెలిగి, ఆరిపోతుంది. అందులో ఇంకా ఇంధనం ఉంది. భూకక్ష్యలో తిరగడానికి ఆ వేగం చాలు. ఎంతసేపు ఎంతబలంగా వుండాలో భూమిమీదవున్న కంప్యూటర్లు నిర్ణయించి రేడియో సంకేతాలద్వారా ఆజ్ఞాపిస్తాయి. బయలుదేరిన $2\frac{1}{2}$ గంటలతరవాత, రాకెట్టు పసిఫిక్‌మహాసముద్రంపైన ఉండగా, కిందనుంచివచ్చిన ఆజ్ఞను శిరసావహించి, మూడవ అంతస్థు మరోసారి వెలిగి, గంటకు 24.245 మైళ్ల వేగాన్ని అందుకుని, ఇంధనం పూర్తికావడంతో విడిపోతుంది. ఈ వేగం భూమ్యాకర్షణ శక్తిని విదలించుకోడానికి చాలు. ఈ వేగంతో ప్రయాణంచేసే ఏవస్తువైనాసరే భూమినుంచి శాశ్వతంగా వైదొలగిపోతుంది. దీనిని భూమియొక్క 'నిష్క్రమణవేగం' (ESCAPE VELOCITY) అంటారు మరో మూడురోజులతరవాత చంద్రుడు ఎక్కడ ఉండబోతున్నాడో ఆ దిశలో వ్యోమనౌక ప్రయాణం చేస్తుంది. నౌక ప్రయాణమార్గాన్ని ఎప్పటికప్పుడు గుణించి, సరిగ్గా ఉన్నదీ లేనిదీ చూస్తున్న భూమిమీది కంప్యూటర్లు దారి తప్పుతున్నట్లైతే ఎంత తప్పుతున్నదీ, ఎంత సరిచేయవలసినదీ క్షణంలో లెక్కలుకట్టి, సరిదిద్దడానికి సర్వీసు మాడ్యూలులోఉన్న అనేకమైన చిన్నచిన్న రాకెట్టు ఇంజనులలో ఏది ఏ దిశలోవంగి, ఎంతసేపు ఎంతబలంగా వుండాలో నిర్ణయించి, ఆజ్ఞలను రేడియోతరంగాలద్వారా సంకేతభాషలో పంపిస్తాయి. ఈ రేడియోతరంగాలు భూ వాతావరణంలోంచి, మబ్బులలోనుంచీ దూసుకుని సెకనుకి 1,86,000

మైళ్ళ వేగంతో ప్రయాణంచేసి, వ్యోమనౌకలోఉన్న 'ఏరియల్'కి తాకుతాయి. ఏరియల్‌కి తగిలిన బలహీనమైన ఈ రేడియో సంకేతాలను నౌకలోని ఎలక్ట్రానిక్ పరికరాలు లక్షలకొద్దీ రెట్లు బలవత్తరంగా మార్చి, రాకెట్టుమోటారుకి పనిచేస్తాయి. వెంటనే దారి సరిచేయబడుతుంది. సాధారణంగా ఈ పనిని భూమిమీదనున్న కంప్యూటర్లే చేస్తున్నప్పటికీ అవసరంవస్తే ఈ పనిని స్వయంగా నౌకలోని రోదసీ నావికులే చేయడానికికూడా తరిఫీదు అవకాశాలూ ఉన్నాయి. వ్యోమనౌకలోనే చిన్నరకం కంప్యూటర్లు ఉన్నాయి. ఆకాశంలో కనబడే ఏదో ఒక నక్షత్రాన్ని గుర్తించి, దానివైపు ఒక ఏరియల్ తిప్పి భూమినీ, చంద్రుణ్ణీ కూడాచూచి, వీటి మధ్యకోణాలు కొలిచి, ఎన్నిడిగ్రీలకోణాలు ఉన్నదీ అసలు ఎంతఉండవలసినదీ గుణించి, అవసరమైన మార్పులను సూచిస్తాయి ఈ చిన్నకంప్యూటర్లు. ఏకారణంచేతనైనా భూమి మీదనుండి వార్తలు అందకపోతే బొత్తిగా అగమ్యగోచరం అయిపోకుండా ఈ పద్ధతి చాలా అవసరం.

భూమినుంచి వ్యోమనౌకదూరం అవుతున్నకొద్దీ దాని వేగం అంతకంతకు తగ్గిపోతూ ఉంటుంది. చంద్రుడినుంచి 43,495 మైళ్ల దూరంలో భూచంద్రుల ఆకర్షణశక్తులు సరిసమానంగా ఉంటాయి. ఆ చోటును దాటేక చంద్రాకర్షణకు లోబడి చంద్రనౌకవేగం అంతకంతకు పెరుగనారంభిస్తుంది చంద్రునికి 5600 మైళ్లదూరంలోకి వచ్చాక సర్వీసు మాడ్యూలులోని 'రెట్రో రాకెట్లు' (RETRO ROCKETS) వాడాలు ప్రయాణాభిముఖంగా తిప్పి మండిస్తారు. ఇల్లా చేయడంవల్ల నౌక వేగం తగ్గుతుంది. చంద్రునికి సుమారు 100 మైళ్లదూరంలో మరోసారి బలంగా రాకెట్లుమండి, వ్యోమనౌకను చంద్ర కక్ష్యలో పడవేస్తాయి. ఇది చాలా ముఖ్యమైనఘట్టం. ఏకారణంచేతనైనా రెట్రోరాకెటు మండకపోయినట్లైతే వేగం తగ్గక చంద్రాకర్షణవల్ల మరింత ఎక్కువ అవుతూపోతుంది అంత వేగంగా సమీపించే వస్తువును చంద్రుడు ఆకట్టి ఉంచుకోలేడు. కాని నౌక గమనదిశమార్చి, తనచుట్టూ ఒక అర్ధ వలయంమాత్రం తిప్పకోగలడు. అందుచేత నౌక చంద్రుని చుట్టూతిరిగి, వంపుతిరిగి మళ్లీ భూమి వైపుగాసాగి, మూడురోజులతరువాత భూమిమీద పడిపోతుంది. రెట్రో రాకెట్లు మండకపోతే వ్యోమ నావికుల ప్రాణాలు కాపాడడానికి, అదృష్టవశాత్తూ ప్రకృతిలో ఈ సౌకర్యం ఒకటి ఉంది.

జూలై 19 వ తేదీ 22 56 గంటలకు వ్యోమనౌక చంద్రునిచుట్టూ దీర్ఘవృత్తాకారకక్ష్యలో (ELLIPTIC ORBIT) పడింది. దీనిని వృత్తాకార కక్ష్యగా మార్చడానికి మరోసారి సర్వీసు మాడ్యూలులోనికి రెట్రో రాకెట్లును కాల్చవలసి వచ్చింది. మొత్తంమీద జూలై 20 వ తేదీని

APOLLO 11 — Descent To Lunar Surface



Transfer To LM

అపోలో-11 వ్యోమనౌకనుంచి చంద్ర శకటానికి వ్యోమగాముల బదిలీ.



Separation Of LM From CSM

కొలంబియా సర్విస్ మాడ్యూల్‌నుంచి చంద్రశకటం విశ్లేషం.



Landing On Moon

చంద్రమండలంలోపరితలంపై చంద్రశకటం అవతరణ.



First Step On Moon

చంద్రమండలోపరితలంపై శ్రీ ఆరమ్‌స్ట్రాంగ్ మొదటి అడుగు.

0311 గంటలకి చంద్రునికి 69 మైళ్ల ఎత్తున వ్యోమనౌక వృత్తాకార కక్ష్యలోపడింది. తరువాత కొన్నిగంటలు విశ్రాంతి తీసుకుని ఆర్మ్‌స్ట్రాంగ్, ఆల్డ్రిన్‌లు చంద్రనౌకలోకిమారి, యంత్రాలన్ని సరిగ్గా పనిచేస్తున్నదీ లేనిదీ చూశారు. ఈ రెండు నౌకలనూ కలిపి ఉంచిన శీల (క్లచ్)ను తీసేసి, చంద్రనౌకను విడదీసి. అందులోఉన్న రాకెట్టును గమనానికి వ్యతిరేక దిశలోకాల్చి, జూలై 21 వ తేదీ 0044 గంటలకు చంద్రాభిముఖంగా దిగసాగేరు. రాకెట్ల వల్ల వేగం తగ్గుతుంది వేగంతగ్గిన నౌక చంద్రునివైపు చాపాకారమార్గంలో పడడం మొదలు పెడుతుంది. సుమారు 50,000 అడుగుల ఎత్తుదాకా వచ్చాక, చంద్రనౌక శిరస్సుపైకి, రాకెట్టు నాడాలు చంద్రుని వైపుకే ఉండేలాగ సరిదిద్ది, రెట్రో రాకెట్టును కాలుస్తారు దీనితో నౌకవేగం బాగా తగ్గిపోయి గాలిలో దూదిపింజెలాగ మెల్లగా దిగడం సాగిస్తుంది. సుమారు 100 అడుగుల దరిదాపులలోకి వచ్చాక అందులోని నావికులు కిందికిచూచి; దిగబోయే స్థలం చదునుగా ఉన్నదీ లేనిదీ గమనించి, అవసరం అయితే ప్రక్కరాకెట్ల సాయంతో కొన్నివందల అడుగుల వరకూ పక్కకు జరుగుతారు. ఏ క్షణంలోనైనాసరే కిందికి దిగడం ప్రమాదం అనిపిస్తే రాకెట్టు వేగం హెచ్చించి, పైకి ఎగిరి, మాతృనౌకను చేరుకొనే అవకాశం ఉంది. ఆఖరికి గంటకు మూడుమైళ్ల లోపు వేగంతో చంద్రనౌక జూలై 21 వ తేదీని 0153 గంటలకు చంద్రోపరితలానికి తగిలింది. నౌకకాళ్ళు చంద్రునికి తగులగానే నౌకలోపల 'చంద్రునిపై దిగేము' అన్న అక్షరాలు వెలుగుతాయి నావికులు రాకెట్టు ఇంజను ఆపివేశారు

చంద్రునిమీదికినౌక దిగీదిగగానే లోపలి యంత్రాలన్నీ సరిగ్గా పనిచేస్తున్నదీ లేనిదీ జాగ్రత్తగా పరిశీలించాలి. ఇంధనపు టాంకు కారుతోందేమో, మరేదైనాభాగం చెడిందేమో చూసారు. ఏమంటే సవ్యంగా లేకపోతే వెంటనే రాకెట్టును మండించి, చంద్రుని విడిచిపెట్టి పైకి వెళ్ళిపోవాలి. ఈ యాత్రలో చంద్రనౌక చక్కగా చంద్రునిమీద వాలింది ప్రమాదమేమీ లేదు.

నాలుగుగంటలపాటు విశ్రాంతి తీసుకుని, ప్రత్యేకమైన దుస్తులు (SPACE SUIT) వేసుకుని, నౌక తలుపు తెరిచి, నిచ్చెనమీదుగా కిందికి దిగి, జూలై 21 న 1147 గం.కు ఆరమ్‌స్ట్రాంగ్ చంద్రునిమీద కాలుమోపేడు. తరువాత మరో అరగంటకు ఆల్డ్రిన్‌కూడా దిగేడు.

వ్యోమ నావికుల పూటుమ గురించి నాలుగు మాటలు చెప్పాలి. సుమారు కోటిన్నర డాలరు ఖర్చుచేసి, బహుకాలం అనేక పరిశోధనలు జరిపి వాటిని తయారు చేశారు. చంద్రునిలో గాలి బొత్తిగా

లేదు. కనుక మనిషికి అవసరమైన ప్రాణవాయువు తీసుకు వెళ్ళాలి. అంతేకాదు, భూమిమీద దట్టమైన వాతావరణంలో పుట్టిపెరిగి, శరీరంమీద అంతటా చదరపుటంగుళానికి 14.7 పౌనుల బరువుతో గాలి నొక్కుతూ ఉండడానికి అలవాటు పడ్డాయి మన శరీరాలు. ఆ వత్తిడిని అధిగమించి మన ఊపిరితిత్తులు పనిచేస్తున్నాయి. రక్తం ప్రవహిస్తోంది చంద్రునిమీద వత్తిడి శూన్యం కావడంతో రక్షణ లేకపోతే వ్యోమ నావికుల రక్తనాళాలు పగిలిపోవచ్చు. ఊపిరితిత్తులు బెలూన్లలా తేలిపోవచ్చు కనుక, వారికోసం తయారుచేసిన సూటులో తగినంత వత్తిడి కల్పించాలి. అంతేకాదు, విశ్వావకాశంలో ఎక్కడెక్కడినుంచో ఉల్కలు గంటకి అనేకవేల మైళ్ల వేగంతోవచ్చి చంద్రునిమీద తుపాకీ గుళ్లల్లాగ పడుతూ ఉంటాయి. అటువంటి ఉల్కలు భూమిమీదికీ వస్తాయికానీ, భూమిచుట్టూ దట్టమైన గాలి ఉండి, ఆ ఉల్కలను దారిలోనే అటకాయించి, మసిచేసేస్తూ ఉండడంవల్ల మనకు వాటివల్ల ఏమీ ప్రమాదంలేదు. చంద్రునిమీద నిరోధించగల గాలి లేకపోవడంచేత సెనగగింజఅంత ఉల్క వచ్చి తగిలితే చాలు వ్యోమనావికుల ప్రాణాలకే ముప్పు వస్తుంది. ఈ ఉల్కలదాడినుంచి రక్షణ కల్పించగల బలిష్ఠమైన మూడుపొరల సూటును తయారుచేశారు అంతేకాదు, బయట ఎండలోఉంటే అపారమైనవేడి, నీడలోఉంటే అపారమైన చలీనూ. వీటినుంచి రక్షించడానికి సూటులోపల చిన్న 'ఎయిర్ కండిషనరు' అమర్చారు. అంతేకాదు, భూమిమీద మనం మాట్లాడేమాట గాలిలో తరంగాలరూపంలో ప్రయాణంచేసి మరొకడి చెవికి తగిలి వినిపించడం అనేది జరుగుతోంది. శబ్దం వినపడాలంటే గాలి (లేదా మరేదైనా 'మీడియం') అవసరం. గాలిలేని చంద్రునిమీద ఒకరితోఒకరు మాట్లాడాలంటే గాలి లేకపోయినా ప్రయాణంచేయగల రేడియో తరంగాలను ఉపయోగించాలి. కనుక ఆ సూటులోనే వార్తాప్రసార పరిగ్రహణార్థం రేడియో యంత్రాలను అమర్చారు. ఇంతాచేసి సూటు మరీ బరువై కాళ్లూ చేతులూ కదపడానికికూడా లేకపోతే ఏం ఉపయోగం? తేలికగా, కదలికలకు వీలుగా ఉండాలి. తమ చాకచక్యంఅంతా ఉపయోగించి తయారుచేయగా ఆ సూటు 180 పౌనుల బరువు తూగింది ఇంత బరువు మోయడం శ్రమఅని భయపడనక్కరలేదు చంద్రాకర్షణ భూమ్యాకర్షణలో ఆరవవంతు మాత్రమే కనుక, ఈ సూటు చంద్రునిమీద 30 పౌనులు మాత్రమే తూగుతుంది.

చంద్రునిమీద దిగిన వ్యోమనావికులు కూడ తమ జాతీయపతాకాన్ని పాతేరు. చంద్రునిలో గాలి లేదుకనుక జెండా ఎగురుతున్నట్టు కనిపించడం కోసం గట్టితీగముక్క ఒకటి జెండాలో గుచ్చేరు. రెండు అల్యూమినియం పెట్టెలలో ఇరవయ్యేసి పౌనుల చంద్రునిమట్టి, రాళ్ళు పోగుచేశారు. అక్కడ వాళ్ళు చేసిన వైజ్ఞానికక్రియలు ముఖ్యంగా మూడు ఉన్నాయి

1. సౌరపవనప్రయోగం (SOLAR WIND EXPERIMENT). సూర్యుడినుంచి ప్రచండ వేగంతో వెలువడే అణుశకలాలను కొలుస్తుంది ఇది.

2. సీస్మోమీటరును చంద్రునిమీద ప్రతిష్ఠించారు. భూకంపాలలాగే చంద్రకంపాలు వస్తే తెలుసుకుని ఆ వార్తను ఈ యంత్రం భూమిమీదికి వార్త పంపుతుంది.

3. లేజరు (LASER) కాంతిని ప్రతిఫలింపగల అద్దాలను చంద్రునిమీద అమర్చారు వీటి సాయంతో భూచంద్రులమధ్యదూరం అంగుళాలతో సహా తెలుసుకోవచ్చు.

శాస్త్రజ్ఞులు వారికి ఇచ్చిన ప్రయోగాలను విజయవంతంగా పూర్తిచేసి 1417 గంకి చంద్రనౌకలో ప్రవేశించి 4 గంటలపాటు విశ్రాంతి తీసుకున్నారు. అన్నింటికన్న భయంకరమైన ఘట్టం చివరఉంది. చంద్రోపరితలంమీదనుంచి చంద్రనౌక పైకిలేచి చంద్రప్రదక్షిణాలు చేస్తున్న మాతృనౌకను చేరుకోవడమే చాలా కష్టమైనపని. రాకెట్టుఇంజను దెబ్బతినడంవల్లగానీ, మరేకారణంచేతనైనాగానీ చంద్రనౌక పైకిలేవనుగాకలేవనులని భీష్మించుకు

భూ ర




చంద్రోపరితలంపై దిగిన చంద్రశకటం స్వరూపం.

కూర్చుంటే అందులోని నావికు లిద్దరికీ దుర్మరణం తప్పదు. చంద్రునిచుట్టూ 69 మైళ్ల ఎత్తున తిరుగుతున్న నావికుడు మాతృనౌకను కిందికి దించి వీళ్లను రక్షించే అవకాశంలేదు. ఏమంటే మాతృనౌకను చంద్రునిమీదికి దిగడానికి అనువుగా నిర్మించనేలేదు. పోనీ భూమిమీద ఇటువంటిదే మరో రాకెట్టును లాంచింగుబల్ల మీద సిద్ధంగా ఉంచినప్పటికీ వాళ్లని రక్షించడం సాధ్యంకాదు. ఏమంటే ప్రయాణానికే మూడురోజులు పడుతుంది చంద్రుడిమీద దిగబడిపోయినవారికి నౌకలో ఆక్సిజను మరో 48 గంటలవరకూ మాత్రమే సరిపోతుంది పోనీ మరో నౌకను, చంద్రనౌకతోసహా చంద్రకక్ష్యలో ఇంతకుముందే ప్రదక్షిణాలు చేయిస్తూ సిద్ధంగా ఉంచినప్పటికీ వీళ్లని రక్షించడం సాధ్యంకాదు. చంద్రనౌకలో ఇద్దరికి మాత్రమే చోటు ఉంది పైనుంచి ఒక పైలట్ చంద్రనౌను దింపుకు వచ్చినప్పటికీ ముగ్గురికి అందులో చోటు లేదు కదా? అధికమైన బరువును పైకి లేవనెత్తే శక్తి దానికి లేదుకదా? కనుక చంద్రునిమీది నౌకయొక్క రాకెట్టు చెడిపోవడమే జరిగితే తీరని నష్టం జరుగుతుంది. ఈ ప్రమాదానికి సిద్ధపడే ఉన్నారు ఆ నావికులు. వాళ్ల ఆలోచనలు గజిబిజిగానూ, పనులు తికమకగానూ ఉండకుండా శాంతంగా ఆలోచించే స్థితిలో ఉంచడానికే చాలాసేపు విశ్రాంతిని ఇచ్చారు. ఈ యాత్ర సరిగ్గా ముగుస్తుందో లేదో, ఎప్పుడు ఏ దుర్వార్త వినవలసి వస్తుందోనని భూమిమీద అన్నిదేశాలలోనూ కోట్లకొద్దీ జనం చాలా ఆందోళనపడ్డారు. ఆ నావికులు కేవలం అమెరికనులేకాదు. యావత్తు మానవజాతికీ ప్రతినిధులు. అతిస్నేహః పాపశంకీకదా?

చంద్రనౌకలో రెండు భాగాలు. కిందకి దిగడానికి పనికివచ్చిన అధోభాగం. దీనికీ నాలుగు కాళ్లూ, నిచ్చెన. రాకెట్టు మోటారులు వగైరాలు అన్నీ ఉన్నాయి. పై భాగం కూడా స్వయం సమృద్ధమైనదే. రాకెట్టు మోటారులూ, ఇంధనమూ, రాడార్ కంప్యూటరుయంత్రాలు వగైరాలన్నీ పై భాగంలో ఉన్నాయి. ఒకసారి చంద్రునిమీదికి దిగిన తరువాత ఇంక అధోభాగపు ఉపయోగం ఏమీ లేదు. దానినికూడా పైకి తీసుకుపోవడం బరువు చేటు; అంత ఇంధనమూ లేదు. కనుక ఈ రెండు భాగాలనూ కలిపి ఉంచిన శీలలు తీసివేసి, పై భాగాన్ని వేరు చేశారు. జూలై 21 వ తేదీ 2320 గం కు అధోభాగాన్నే లాంచింగు బల్లగా ఉపయోగించి, పై భాగం నావికులను, అపురూపమైన చంద్రశిలలను తీసుకుని పైకి లేచింది. రాకెట్టు మోటారు అనుకున్నట్లుగా ఇబ్బంది పెట్టకుండా పనిచేసింది సుమారు నాలుగుగంటలపాటు ప్రయాసపడి మాతృనౌకను కలుసుకోగలిగేరు. చంద్రనౌకలోనుంచి మాతృనౌకలోకి మారేరు. చంద్రనౌకను దూరంగా వదిలేశారు వదిలివేయడమంటే మాతృనౌక వేగాన్ని హెచ్చించారు. ఆ చిన్ననౌక చంద్రుని చుట్టూ అలా తిరుగుతూనే ఉండిపోతుంది.

జూలై 22 వ తేదీ 1026 గంటలకి మాతృనౌక వేగాన్ని 5460 మైళ్లకు (ఇదే చంద్రాకర్షణను తప్పించుకోడానికి అవసరమైన వేగం) హెచ్చించి, భూమిదిశగా బయలుదేరేరు భూచంద్రుల సమానఆకర్షణప్రాంతాన్ని దాటేక దానివేగం అంతకంతకు హెచ్చుతుంది అవసరమైతే దిశను మార్చుకుంటారు. జూలై 24 వ 2154 గం.కి సర్వీసు మాడ్యూలునుంచి కమాండుమాడ్యూలు విడిపోయింది. 2108 గంటలకి (400,000 అడుగుల ఎత్తున) భూ వాతావరణంలో ప్రవేశించింది. ఇక్కడినుంచి భూమిమీదికి సురక్షితంగా చేరగలగడం మరో ముఖ్యమైనఘట్టం. ఆ నౌక ఒక ప్రత్యేకమైన కోణంలోనే భూవాతావరణంలో ప్రవేశించాలి. ఎక్కువవాలుగా భూమి ఉపరితలానికి మరీ దగ్గరగా వచ్చేటట్లయితే గాలి చాలా దట్టంగా ఉండడంచేత 25000 మైళ్ల వేగంతోవచ్చే నౌక మసి అయిపోతుంది, విపరీతమైనవేడిపుట్టి. ఆ కోణం మరీ తక్కువగా ఉండినట్లైతే నీటిబారున చిళ్ల

## APOLLO 11 — Transearth Injection And Recovery



Transearth Injection

**చంద్రమండలంనుండి చంద్రశకటం భూమికి పునఃప్రయాణం చేయడానికి ప్రేలుడు.**



CM/SM Separation

**కొలంబియా మాడ్యూలు, సర్వీస్ మాడ్యూలుల విశ్లేషం.**

పెంకు విసిరితే నీటి అంచులకి తగులుతూ జర్రున జారిపోయినట్లుగా భూవాతావరణపు పై అంచులో నుంచి ఆ నౌక దూసుకొని బహుదూరం వెళ్ళిపోవచ్చు భూమిని విడిచి. ఇందులో ఏది జరిగినా ప్రమాదమే. భూమిని సమీపించే కోణం ఈ రెంటికీమధ్యస్థంగా ఉంటేనే గాలి ఒరపిడివల్ల నౌక వేగం తగినంతగాతగ్గుతుంది, మరీ వేడెక్కిపోకుండా. ఆ నౌక గోడలు రెజీనుతో, అల్యూమినియపు మిశ్రమ లోహంతో మూడు నాలుగు పొరలుగా ఉంటాయి. బయట ఎర్రగా కాలిపోతున్న వేడి ఉన్నప్పటికీ లోపలమాత్రం మనిషి సుఖంగా జీవించి ఉండడానికి తగినంత చల్లగా ఉంటుంది.

భూమికి 6000 మీటర్ల ఎత్తుకురాగానే మూడు పేరాషూట్లు విప్పుకున్నాయి. నౌక పసిఫిక్ మహాసముద్రంలో జూలై 24 న 2219 కి దిగింది. దగ్గరలోనే వారికోసం కోటికళ్లతో ఎదురు చూస్తున్న విమానాలు, పడవలు వారిని సురక్షితంగా పైకి తీశారు. లోగడ తక్కిన వ్యోమయాత్రికులు తిరిగివచ్చినప్పుడు చేసిన అట్టహాసమేదీ ఈ సారి జరుగలేదు. తప్పెటలూ, తాళాలూ లేవు. వాళ్లని ఎవ్వరూ ముట్టుకోలేదు. వాళ్లకి మహామారి ఏదో సోకినట్లుగా ప్రవర్తించారు. ఆ నౌకమీద సూక్ష్మజీవులను చంపే ద్రవం గుమ్మరించారు. తలుపు కొద్దిగా తెరిచి, రెండు సంచులవంటివి లోపలపడేసి, గభుక్కున తలుపు మూసేశారు. ఆ సంచులు వ్యోమనావికులు కట్టుకోవలసిన దుస్తులు. అవి వాళ్లను పూర్తిగా మూసేసి ఉంచుతాయి. ఆ దుస్తులకు లోపలకు మాత్రమే తెరుచుకునే తలుపు అమర్చారు. అందులోని గాలి లోపలికి వెడుతుందేకాని, వారు వదిలిన గాలి బయటికి రాదు. మలినమైన గాలిని శుభ్రం చేయడానికి అందులోనే పరికరాలు అమర్చారు. ఆ దుస్తులమీద మరో గుండిగడు ద్రవంపోసి, వాళ్లను 1,58,000,000 డాలర్ల ఖర్చుతో ప్రత్యేకంగా నిర్మించిన 'లూనార్ లేబరేటరీ'లోకి తీసుకువెళ్లి, వాళ్లకి తోడుగా కొద్దిమంది డాక్టర్లను, కొంత మంది శాస్త్రజ్ఞులనుకూడా ఉంచి, ఆ లేబరేటరీ తలుపులు బిగించేశారు. గాలి చొరబడడానికికూడా సందులేకుండా ఎందుకు ఈ హంగామా అంతా? దానికి కారణం లేకపోలేదు.

చంద్రమండలంమీద కూడా భూమిమీద లాగే రకరకాల జీవులు నివసిస్తూ ఉండి ఉంటాయని పూర్వం అనుకునేవారు. చంద్రమండల పరిస్థితులుగా తెలిసివచ్చాక ఆ భావం మారింది. అక్కడ

పగలు నీళ్ళు మరిగే వేడి రాత్రి గాలి అంటూ ఉంటె గడ్డకట్టేసేటంత చలి. గాలి లేదు, నీరు లేదు. ఇల్లాంటి గడ్డుపరిస్థితుల్లో ఏ జీవి బ్రతుకలేదన్న నిశ్చయానికి వచ్చారు శాస్త్రజ్ఞులు. కాని కొన్ని రకాల సూక్ష్మజీవులు ఇల్లాంటి దుర్భర పరిస్థితుల్లో కూడా బ్రతికి ఉండవచ్చునేమో అని సందేహం కలిగింది. చంద్రుని నేల లోపల శీతోష్ణాలు మరీ ఇంత విపరీతంగా ఉండవు. నేల లోపల మంచు రూపంలో నీరు ఉండవచ్చు. ప్రాణవాయువు లేకపోయినా బ్రతగ్గల సూక్ష్మజీవులు అల్లాంటి చోట్ల ఉండవచ్చు లేవని బొత్తిగా కొట్టిపారవేయడానికి లేదు. ఆ సూక్ష్మజీవులు చంద్రునిమీదికి దిగిన నావికుల శరీరాలను పట్టుకుని భూమిమీదకు దిగుమతిఅయ్యే ప్రమాదం ఉంది. కొత్తరకం సూక్ష్మజీవులను ఎదిరించే శక్తి మనకు లేకపోవచ్చు. అటువంటి జీవులు నిజంగానే ఉండి వ్యాధులు కలిగిస్తే భూమిమీద జీవరాశి యావత్తూ నాశనమైపోవచ్చు మన విజ్ఞానం అంతా ఆ సూక్ష్మజీవి దాడిముందు బలాదూరు అయిపోవచ్చు. ఈ ప్రమాదం నుంచి భూమిని రక్షించడంకోసం ఆ నావికులను, వారు తెచ్చిన వస్తువులను గాలిచొరని 'క్వారన్టైను'లో మూడు వారాలపాటు ఉంచారు. ప్రమాదం అంటూ ఏమైనా ఉంటే అది ఈ మూడువారాలలోనూ తేలిపోతుందని వారి నమ్మిక. ఇదెక్కడి క్వారన్టైనూ ? వాళ్ళు సముద్రంలో పడ్డాక 'మాడ్యూలు'లో నుంచి బయటికి రావడానికి తలుపు తెరిచినప్పుడు ఆ సూక్ష్మజీవులు గాలిలోకి పోవా ? అదీనేకాక, మూడువారాల వ్యవధి ఎల్లా సరిపోతుంది? కొన్నిరకాల సూక్ష్మజీవులు రెండు మూడేళ్లదాకా ఫలితాలను ఇవ్వవుకదా ? అని కొందరి శల్యపరీక్ష.

ప్రపంచం నలుమూలలా ప్రతివ్యక్తినీ కదిలించేసి, శిరఃకంపం చేయించిన ఈ చంద్రలోక యాత్రను చూచి అణుమాత్రమూ చలించని మేరు సమానులు కూడా కొద్దిమంది లేకపోలేదు. 1. చైనావాళ్ళు. ఈ వార్త వాళ్ళ పత్రికల్లో కనీసం ఓ మూలనైనా వేయలేదట 2. యూరప్‌లో కొందరు ప్రేయసీప్రియులు 'ఈ చంద్రుడు మా అమరప్రేమకు గుర్తు. చంద్రుణ్ణి కలుషితం చేయడానికి మీరు ఎవరు?, అని నినాదాలు చేశారట. 3. కాశీలో ఒక జ్యోతిశ్శాస్త్ర పండితుడు నిరసనగా చేయి విదలించి 'ఛబ్బే! వీళ్ళమొహం. వీళ్ళు కాలుపెట్టినది మనం అనుకునే నవగ్రహాలలోనూ ఒకడైన చంద్రునిలో కానేకాదు. అది మరేదో చోటు అయి ఉంటుంది' అన్నాడట.

వీళ్ళని చూచి చంద్రుడు పరిహాస చంద్రికలు వెదజల్లుతున్నాడు.



Reentry



Splashdown

పసిఫిక్ సముద్రంలో కొలంబియా మాడ్యూలు అవతరణ.



Recovery

వ్యోమగాముల రక్షణ.

# మహా వర్గమాన

## శ్రీ నిఖిలేశ్వర్

భౌతికంగా మనలేని మనుగడకోసం
గాలిలో చేతులు విసిరే మానవత్వం
ఈనాడు
బానిసయ్యై—జంతువై-- పేడలో పురుగై
గిలగిలలాడుతూ
కారుకూతలు కూస్తున్నది.

పొందికగా జాలువారే పదాలు
అశ్లీలాలమధ్య ద్వీపమై
స్వచ్ఛమైన భాషగా
జిడ్డుగా— బంకగా
తొలగని పురాతన ఛాందసంలో
అంటరానితనంగా బ్రతికే
మరుగుజ్జుల పవిత్ర కులాలు
నాగరికత నిర్మించిన వర్గప్రాకారాలు.

జీవితాంతం
వారసత్వంగా
నరాల్లో పారుతున్న రోగాలను
కనపడని సూక్ష్మజీవులను,
ఒక్క నిమిషం
అస్తిత్వానికి అర్థాన్ని ఇచ్చే ఆనందం——
సృష్టించిన భారాన్ని ఎత్తుకుని
మనస్సులో ఏకాకిగా
వ్యవస్థ చేసిన మధ్యతరగతి మానవుడు

# మహా వర్గ మానవుడు

ఏ వర్గానికి చెందని
మానవత్వాన్ని వెతుక్కొంటూ
నడుస్తున్నాడు తప్పుకొంటూ.

చుట్టూ ఎవరి ఆనందంకోసం
వారే పోటీ పడుతూ...
ఎదలోపలి పొరల్లో
తప్పిపోయిన మానవత్వం,
దారిద్ర్యం విశ్వజనీకంగా
మానవత్వం ఒక భ్రమగా
నిలిచిన ఈ రోజు—

అందరికోసం
అందరి ఆనందం —అందంకోసం
జరుగుతున్న సమరంలో
వ్యక్తి పోరాటం—
బాధల్లో చిక్కితే
వోడితే
ఒంటరిగానే జీవితాన్ని
గుండెనిండా అర్పించే స్తోమతు—
వ్యక్తుల సమూహంకోసం
సమిష్టి నేర్పించే నిజమైన త్యాగం

అట్టడుగు అహరహం
చరిత్ర రాళ్లను కొడుతూ
రక్తం కక్కుతూ
మహావర్గ మానవుడు;
మధ్యతరగతి నపుంసకత్వాన్ని విడిచి
దగ్గరికివెళ్లి మరోరాయి తీసి
అందరికోసం బద్దలకొట్టమని
యుగధర్మం
గుండె చీల్చి అరుస్తున్నది.

# రుపతి వేంకటకవులు - సంప్రదాయ చమత్కారములు

శ్రీ గుండవరపు లక్ష్మీనారాయణ

ఆంధ్ర సాహిత్యముతో నేమాత్రము పరిచయమున్న వారిలోనైనను శ్రీమత్సరదేవతా మహిమ సంప్రాప్తాశుధారా కవిత్వ ప్రథిత ప్రబంధ రచనా పారీణులైన తిరుపతి వేంకటేశ్వరుల నెఱుగని వారుండరు. వీరు దుస్తరతర బుద్ధిభాక్షితవధాన విధాన పటిష్ఠులేకాక తెనుగున చాటుపద్యములు మధురాతి మధురముగ సూరిపామరులకు నచ్చువిధముగా చెప్పఁగల వారలు. భావించినంతలోనే సాహిత్య సాహిత్య ప్రపంచంబు వీరి రసనాగ్రంబున నాట్యమాడెడిది. నేనే వచ్చెద నేనే వచ్చెదనని శబ్దములు పరువులెత్తెడివి. అటుగద్వాలనుండి ఇటు చెన్నపట్టణంబునకు మధ్యంగల్గు దేశంబెల్ల వీరి ఆశుధారా కవిత్వావేశ మంత్రాక్షతలతో కృత కవితా నిలయమైనది. వారువీరను భేదము లేకుండగ అందఱకు అవధాన కవిత్వముపై నాసక్తి చిగిర్చినది. వీరి కవితాకన్య సమస్తదేశ పృథివీపతి సభలయందు మంచి పేర్పడ్డది. ఇట్టి వాణీవశంవదుల కవిత్వముపైని ఎన్ని అంశములతోడనైనను వ్రాయవచ్చును. ఒక్కముక్కలో చెప్పవలెనన్న వీరి ఊహా సుందరీ లాస్య విలాసములు స్పృశింపని అంశమేదియును సాహిత్య రంగస్థలమున లభించుట కష్టము. ప్రస్తుతము వీరి గ్రంథములలో కొన్ని శాస్త్ర సంప్రదాయములను ఎట్లు చమత్కరించినారో ఘుణాక్షర న్యాయముగా వెదకినప్పుడు లభించినవి సూచించుటయే యీ వ్యాసముయొక్క లక్ష్యము.

వివాహ సందర్భమున పురోహితులు వధూవరులచే పల్కించు మంత్ర మొకడు లక్షణాపరిణయమునందు చమత్కరింపబడినది. శ్రుతిహితముగ ధృతకుతుకస్వాంతులగుచు ద్విజులు పెండ్లి జరిపించు సందర్భమున—

'నాతిచరామియన్న వచ
నార్థ మెఱుంగునా? లేదో? యమ్మురా
రాతి పఠించి యచ్చెలి శి
రమున్నన హస్తమువెట్టి బిట్టు ప్రే
మాతిశయమ్మునన్ గురువ
రామమతిన్, బదియాఱువేలపై
చేతులిడక్కు భార్యలఁ ద్య
జింపఁ దలంచెనా లక్షణార్థమై.'

అను పద్యమును వ్రాసిరి. ఇచ్చట పురోహితులు వివాహములో చేయించెడి 'ధర్మేచ, అర్థేచ, కామేచ త్వయ్యైషానాఽతి చరితవ్యా; నాతిచరామి' అను ప్రమాణము చమత్కరింపబడినది. లక్షణాదేవి శిరముపై మురారాతి హస్తమునిడి, ఈ ప్రమాణము చేయుట చూడగా, తక్కిన పదియాఱువేల భార్యలను లక్షణా నిమిత్తమై విడువదలచినాడా? అని ఇట చమత్కారము.

ఇటులే శ్రీనివాసవిలాసము నందు నొక వైవాహిక మంత్రప్రస్తావన జరుపఁబడినది. కాని ఇచట లక్షణాపరిణయములోవలె వివాహ సందర్భమున కాక, కేవలము లక్ష్మీ, శ్రీనివాసులు కురమ్మతిగిరిపై నిల్చిన స్థానముల నవకాశముగా తీసికొని చమత్కరించినారు. ఆ పద్యము—

'సిరితన పెండ్లివేళ ముని
సింహులు భర్త శిరమ్మునందు నా
దర మెసఁగన్ వసింపుమని
తద్దయుఁ బల్కిన మంత్రమున్ హృదం
తరముననుంచి సార్థక మొ
నర్పఁ దలంచియకాదె! కుర్మతీ
శ్వరునకు మీఁదిభాగమున
వాస మొనర్చుచు నుండె నెంతయున్.'

లక్ష్మీదేవి స్థానము కుర్మతిగిరియొక్క ఊర్ధ్వ శిఖరము. శ్రీనివాసుని నెలవు ఆ గిరియొక్క కంద రము. ఈ యంశమే పై చమత్కారమునకు ఆధా రము. ఈ యంశమే ఆధారముగ గైకొని అనేక లౌకికచమత్కారములు గూడ నచట వారు చేసిరి.

షడ్దర్శినీవేది చర్ల బ్రహ్మయ శాస్త్రిగారి శిష్యులకు పెండ్లి మంత్రములు తెలియుటలో నాశ్చర్యమేమున్నది? ఇక శబ్దశాస్త్ర ప్రశస్త ప్రభావం బాతపత్రంబుగా గల వీరి వ్యాకరణ చమత్కా రములను పరిశీలించుదము.

వీరి ప్రసిద్ధ నాటకమగు పాండవ జననము నందు సూత్రధారునిచే కథోద్ఘాత విధానము ననుస రించి పలికించిన పద్యములలో అత్యంత సుభగంభావుక మైన చమత్కారమున్నది. ఆ పద్యము.

'పారాశర్య మునీంద్రుఁడు
భారతమును వ్రాసెఁ దెలుఁగు పఱచిరి కవితా
స్వారాజులో మూఁగురు
వీరిరువురు నాటకముగ వెలయించిరిలన్'.

ఇందు చమత్కారము 'పారాశర్య' శబ్దములో నున్నది. ఆ శబ్దము కూడ ఉన్నస్థానమునుబట్టి చమత్కార తరమైనది. ఈ పద్యమున్న కథా సందర్భమునాటికి పరాశరునకు వ్యాసుడు జనింప లేదు. కనుక పారాశర్యుడను వాడే లేడు. నాటకములో ఈ పద్యము తరువాత వచ్చెడి సూత్రధారియగు పరా శరుడు, తన నామమైన పరాశర శబ్దమునకు అపత్య ప్రత్యయమనెడి కళంకమును కూర్చిన సాహసికు డెవడని తెరలో నుండు ప్రవేశించును. పరాశరునకు అప్పటికి పారాశర్యు డొకడు (వ్యాసుడు) జనించుట జరుగలేదు. ఇదియే చమత్కారమునకు మూలము.

వీరి వ్యాకరణ శాస్త్ర వైదుష్యమునకు మఱి యొక చిహ్నము శ్రీనివాస విలాసములో కలదు. పంక్తి భోజనములలో జరుగు హాస్య ప్రసంగము లను అభివర్ణించుచు, వ్యాకరణ చమత్కారముతో ఒక సన్నివేశము సృజించిరి.

పంక్తిలో భోజనము వడ్డించు పాచకుడొకడు 'నిష్ఠానత్వ విఖ్యాతంబగు తేమనం బిదిగో' అని అనెను. దానికి కేవల వైయాకరణు డొకడు 'ఈ తేమన పదమ్మున కేసూత్రముచే నిష్ఠానత్వంబు కలిగె? నని ఖసూచి యగుచు భోజనమ్ము వదలి పరిశీలించు చున్నంత, అప్పుడు సరసతరసాహితీసాహితీ ధురీణులగు కవులు ఈ క్రింది విధముగా హేళన చేసిరి

'తూచుట కేమికోయణచి
సూత్రము గాదది బుద్ధిహీన కా
ణాచిపటందు వర్ఛక
గణంబులకైన సుసాధమైన యా
వాచక మెన్నడైన గనవా?
యమరంబున; లేదుఁ పాపమీ
పాచకుఁడైన మేలని యపస్మితము
బొనరించి రెంతయున్.'

ఈ చమత్కారమునకు మూలము నిష్ఠాన మను పదము. నిష్ఠానమన్నను, తేమనమన్నను భావము మజ్జిగపులుసు నిష్ఠానమను పేరుతో ప్రఖ్యాతమైన తేమన మిదిగో యని పాచకుని భావము. లేక దీని నుండి ఇంకొక అర్థముకూడ సాధింపవచ్చును. తేమన=నీయొక్క మనసు. కనుక నీ కత్యంతప్రియ మైన నిష్ఠానము (మజ్జిగపులుసు) ఇదిగో యన్నట్లు అర్థము తీసికొనవచ్చును ఈ రెండిటిలో మొదటి భావము మిక్కిలి సూటిగా నున్నది. ఈ రెంటిలో పాచకునిభావ మే యంశమునకు చెందినను సారాంశ మొకటియే. అది యేమనగా 'మజ్జిగపులుసు కావల

యురా?' అని. కాని కేవల వైయాకరణునకు నిష్ఠా నత్వమనుమాట విన్నంతనే, వానికి వ్యాకరణశాస్త్రము స్ఫురించి 'ఈ తేమనపదమ్మున కేసూత్రముచే నిష్ఠా నత్వము (సాధుత్వము) కలిగెన'ని యాలోచించు చుండెను. అప్పుడు పంక్తిలోగల సరసులు 'అయ్యా! ఇది ఇకోయణచి సూత్రముకాదు. గ్రుడ్డిగా వల్లె వేయుటకు. పసిపిల్లలకు తెలిసిన యీ నిష్ఠానమను మాట వినలేదా? అమరకోశములో ఉన్నదయ్యా బాబు. పాపము నీవు అమరకోశము కూడ చూడని వానివలె నున్నావు. నీకన్న పాచకుడే మేలని లపస్మిత మొనర్చిరి. అమరములోని 'స్యాత్తేమనంతు నిష్ఠానమ్' అనునది యీ చమత్కారమునకు ప్రాణము.

కవి చతుర్ముఖుడు కాకపోయినను చతురా ననుడే. సమర్థుడైనకవి సర్వశాస్త్రముల సారమును తన కవితావనిత సాహచర్యముతో ప్రతిధ్వనింప జేయ కలడు జయదేవ మహాకవి ప్రసన్నరాఘవములో కవితకు ఎన్నింటితో స్నేహముండవలెనని చెప్పెనో, వీరికి అన్నింటితో పరిచయము కలదు. ఇక ఖగోళశాస్త్ర విషయ జ్ఞానమునకు వీరి గ్రంథములలో ఉదాహరణములు కోకొల్లలు ఒకటి రెండు పరిశీ లింతము. వర్షర్తు వాసరములను అభివర్ణించుచు—

'ధరణి పయోధరముల కం
బరమాచ్ఛాదనము సర్వమతమైతగు నం
బరమునకుఁ బయోధరములు
కరమాచ్ఛాదనములగుట గడుఁ జిత్రమగున్'

'లోకములో పయోధరములకు అంబరము ఆచ్ఛాదనము అగుట సర్వమతము. కాని అంబర మునకు పయోధరములు ఆచ్ఛాదనములగుచున్నవి. ఇది కడుచిత్రముకదా' అని తాత్పర్యము.

దీనిలో అంబరము, పయోధరములు అను పదములు శ్లేషింపబడినవి. ఆ శ్లేష ప్రయోజన సహితమే 'యమర్థమధికృత్య ప్రవర్తతే—తత్ ప్రయోజనమ్' అని కదా ఆలంకారికోక్తి.

అంబరము=వస్త్రము, ఆకాశము
పయోధరములు=పాలిండ్లు, మేఘములు.

పాలిండ్లకు వస్త్రమాచ్ఛాదనమగుట సర్వ మతము వర్షర్తువులో మేఘములే (పయోధరములే) ఆకాశము (అంబరము)నకు ఆచ్ఛాదనములగుచున్నవని విరోధాభాసము.

ఖగోళ శాస్త్రాధారముతో నుద్భవించిన
శాస్త్ర చమత్కార మొకటి తిలకించుదము.

'కవి మిత్ర! సోమబాలక!
భవదున్నక్షేత్రమగుచుఁ బరఁగెడి కన్యన్
గవిసియుఁ ద్వల్లగ్నాత్యం
తవిభవదుండగు మని యొకతవ్వి వచించెన్'

ఈ పద్యములో శ్రీనివాస విలాసకృతిభర్తయగు సీతారామ భూపాలునకును, బుధగ్రహమునకును సరి పోవునట్లు అర్థద్వితీయముతో వర్ణించినారు:

బుధుని పరము :

కవిమిత్ర=శుక్రగ్రహమునకు మిత్రగ్రహము.
సోమబాలక=చంద్రుని కొడుకు.

ఉచ్చక్షేత్రము బుధగ్రహమునకు ఉచ్చరాశి యగు కన్య

ర పరము :

కవిమిత్ర=కవులకు మిత్రుడు.
సోమబాలక=ముక్కరవంశ సంజాతుడగు సోమ భూపతి పుత్రుడు.

లగ్నాత్యంత విభవదుడు = శ్రీనివాసుని లగ్నము తరువాత అత్యంత విభవదుడు.

ఈ విధముగా కవిమిత్ర, సోమబాలక, ఉచ్చ క్షేత్రము, లగ్న మొదలగు శబ్దములతో చమత్కా రము సాధింపబడినది.

సాధారణ కవులుచేయు వర్ణనములకు ఒక్కొక్క తటి విపరీతసామ్యములు చూపుట, ఒక్కొక్క తటి

విపరీతహేతువులతో ఖండించుట అను లక్షణములు వీరికి మెండు. ప్రత్యేకతపై ఆసక్తియే వీరి ప్రత్యేకత ఈ లక్షణములకు లక్ష్యములు —

లక్షణాపరిణయములో, సామాన్యముగా వర్ణింపబడు సాయాహ్నాగమన మెట్లు బట్టకట్టినదో చూడుడు

'పశ్చిమాచలమున కాంతి సరిఘవిల్లె
కాని తూరుపుకొండ రిక్తదశనుదె
నొకడు చెడిపోవుపైగాని యొకడు బాగు
పడుటలేదని జనులాడు పలుకు నిజము.

దీనిలోగల విపరీతసామ్యము ముకురదర్శిత ప్రతిబింబ సదృశము. ఇటువంటి రామణీయకముగల వర్ణనములు ఈ విద్యా స్నాతకుల గ్రంథములలో మాటిమాటికి దర్శన మొసగును. ఇక సాధారణముగా చేయబడు వర్ణనములనెట్లు వీరు విపరీత హేతువులచే ఖండించెదరో చూడుడు.

'తనకాల్వెట్టిన మాత్ర లోకము సమ
స్తంబున్ శుచింజేయు న
బ్జుని దోషాకరుఁడండ్రె ఱుంగక; కరం
బుల్ సాచి కోయంచు బా
యని నిశ్శీకమలిన్యుపగ్రహణ సౌ
ఖ్యంబందుచున్నట్టి సూ
ర్యుని దోషాకరుఁడంచుఁ బల్కెదము; చం
ద్రుం బల్కఁగాఁబాడియే'

సంభోగ శృంగార విశ్రాంతి కారకునిగా రవిని అచ్చటచ్చట స్వాధీనపతికలు విసిగికొనట కలదు కాని; చంద్రోపాలంభనమందు చంద్రుని దోషాకరునిగా నెన్నినట్లు, సూర్యుని ఎచ్చటను ఎవరును దోషాకరునిగా నిరూపింపలేదు. వీరు అది సాధించిరి. కాని వర్ణన సందర్భము కేవలము సూర్యోదయము మాత్రమే. ఇచ్చట స్త్రీల ప్రసక్తి లేదనుట గమనార్హాంశము.

నిషిద్ధ్యమానమగు నిశ్శీకమలిని ఉపగ్రహణముచే రవి దోషాకరుడట. అటువంటి దానికై కరములు సాచెడి నీచత్వ మాదిత్యున కబ్బెనట. అటువంటి దోషములులేక అబ్జుడు లోకమును తన పాదస్పర్శచే పవిత్రము చేయునట. రవిని ఒక్క జ్యోతిషశాస్త్రమునందు తప్ప ఎచ్చటను పాపిగా ఎవరును తెలుపలేదు. వీరి సమర్థనము చూచిన, వీరన్నట్టులే వాది దౌర్బల్యమేకాని వాద దౌర్బల్యము లేదనిపించును.

సర్వసంపన్నవౌ కవితాకుమారియని చెప్పుకొనబడిన, వీరి కవితాకన్యయొక్క మఱియొక అంశము గమనింతము— అదియేమన.—

వర్ణనములను ప్రసిద్ధములైన శాస్త్ర సంప్రదాయములతో ముడిపెట్టుచు, వానికి విలక్షణమైన వ్యాఖ్యానము చేయుట — ఉదాహరణము.

'ఎచట నగ్నియుండు నచటనే తాపంబు
సంభవించు టఖిల సమ్మతంబు
మెఱపు మేఘమంద నొఱపు వియోగుల
యందు సంభవించు టరుదుగాదె'

ఇచ్చట ధూమాగ్నిన్యాయచర్చచేసి దానికి విలక్షణమైన వ్యాఖ్యానము చేయబడినది. ప్రతిపత్తి యొక్క అనుమాన విచ్ఛేదనముకొఱకు ప్రయోక్తచే చెప్పబడు హేతువులతో గూడిన ది న్యాయము. ధూమాగ్ని న్యాయవివరణ —

'అయంపర్వతోవహ్నిమాన్, ధూమాత్, యథా మహానసతథాచాయమ్, తస్మాత్తథాయం పర్వతో వహ్నిమాన్.'

కాని యిచ్చట ఈ మహాకవులు ఆ న్యాయమును ఎట్లు మార్చిరో గమనింపుడు అగ్ని (మెఱపు) మేఘమందు, తాపము (ఒఱపు) వియోగులయందు కలదట ఇటువంటి సహృదయ హృదయాహ్లాదకర చమత్కారములు కథను ప్రక్కకునెట్టి నిలువబడక కథాకథనవిధానమునకు సంవిధానముగనే యుంచుట వీరికి నల్లేరుపై బండినడక.

విపరీత సామ్యములు చూపుట, విపరీత హేతువులచే ఖండించుట మొదలగువానికి ఉదాహరణములు

చూచితిమి. ప్రస్తుతము విపరీతమైన కారణముచే సామాన్య విషయమును సమర్థించుటయను అంశము వీరి కవితలో కలదు. ఉదాహరణము —

'తెలియనేరకయేఁ జతుర్థీ దినమున
విధుని సంసేవనంబు గావించి యుంటి
నేమి యపవాద మూడునో యింక నాక
టంచు ఛత్రంబు సంకోచమందె నంత'

చవితినాడు చంద్రుని చూచిన ఏదో ఒక అపవాదము కలుగునన్నెడి సంప్రదాయానుసారముగ ఈ పద్యము వ్రాయబడినది. చవితి చంద్రునిచూచి ఛత్ర పుష్పము ఏమి యపవాదు వచ్చునోయని, సూర్యోదయ కాలమందు సంకోచించెనట. ప్రతిదివస ప్రత్యూషకాలమునందు సంకోచించుట దాని సహజ లక్షణము. కాని ఇచ్చట దానికి కారణము కాని కారణముగా సంప్రదాయమును తెలుపుట జరిగినది

ఈ విధముగ వీయశశ్శీలులు ఒక్కొక్కచోట ఒకొక్కరియొద్ద ఒకొక్కమాట చెప్పిన గ్రహించిన శాస్త్రముల సారమును చక్కగా, అర్థాంతరముగాగాక, అర్థాంతరములతోగూర్చి ఆంధ్రభాషామతల్లిని వారి కావ్యాభరణములతో నలంకరించినారు. వారి శాస్త్ర వైదుష్యమును రేఖామాత్రముగ సూచించుటయే యీ వ్యాసముయొక్క ఐదంపర్యము. భవతు.

ఎన్నెన్ని పాత్రములు కవు
లెన్నెన్నివిధాలఁ జెప్పి రెన్నెన్ని విశే
షోన్నతులయ్యెడఁ గన్నడు
వన్నియుఁ దెలియంగ శక్యమా? యొక్కనికిన్.



# దీపాలు

శ్రీ ఇంద్రగంటి శ్రీకాంత్ శర్మ

దీపం చూస్తున్నప్పుడు
దృష్టి వెనకరంగు తెరలు.
ఒక్కొక్క తెర తొలగిస్తే
ఊగే ఊహావ్యాలలు—

క్రమక్రమంగా ఎదిగే
క్రమదీపికళిక చూడు
ఉన్న నిశాకర్దమాన
చిన్ని ఎర్రకలువ మొగ్గ

రవరవ రగిలే కాంక్ష
రక్తిని ఎరుగును దీపం
పాపపు కనుకొలకుల్లో
'పరుగిడు నెత్తురు' దీపం

జనన మరణ మధ్యంలో
సరిహద్దులు గుర్తించే
దీపం జ్వాలాపతాక
తీరం జేరని నౌక—

కామిని కనురెప్పల్లో
కాపురముంటుంది దివ్వె—
మహాజ్ఞాని మనస్సులో
మసలుతుంది మరొక దివ్వె

అడివయినా మేడయినా
అంతా ఒకటే దివ్వెకి
స్నేహంతో మెలుగుతుంది.
చీకటిలో వెలుగుతుంది.

* *

నిలువక నర్తిస్తుందది
నీడలు సృష్టిస్తుందది
ఎంతయింటి కంతవెలుగు
ఇదే సబబు అంటుందది—

* *

సామూహిక చైతన్యం
చాటుతుంది దీపావళి
ఏకాంతపు దీపికలో
ఇముడు వ్యధాదేహళి—

* *

ప్రతిహృదయ ప్రాంగణాన
వచ్చి నిలుచు "మానవతా
సతి' నొసటను చైతన్యపు
జ్వాలా సిందూరరేఖ—

* *

"విజ్ఞానం ఎవ్వరికీ
వెఱిగ తలవంచబోదు
దైవం ముందరకూడా
తలనెత్తుకు తిరుగుతుంది"

* *

అనే నిజం ప్రవచించే
అపర హేతువాది దివ్వె
ప్రణమిల్లే చైతన్యం—
వాడని సజీవకుసుమం—

* *

'దేహం' తేజఃపుంజం,
దీపం ప్రాణస్పందన'—
ఇది నిత్యం అనుసత్యం
ఎన్నటికీ మరువబోకు !!

# శ్రీనాథ పదప్రయోగకోశ సమీక్ష

## శ్రీ వంతరాం రామకృష్ణారావు

శ్రీనాథ పదకోశమును 1961-62 సంవత్సరముల మధ్య, ఉస్మానియా యూనివర్సిటీలో ఎం. ఏ. ఫైనల్ పరీక్షకు చదువు విద్యార్థులు తయారుచేసినారు. పదకోశ నిర్మాణమన్నది ముద్రణములు సుపరిష్కృతము లయినతరువాత చేపట్టవలసిన కార్యక్రమము. ఐనను ఏదో ఒకరూపములో పదకోశ ప్రకటనము జరుగుట ముదావహమే. ముద్రణములు తప్పుల తడకలైయుండగా, అది చాలదన్నట్లు 'విద్యార్థి బృందమునకు వలసినన్ని ప్రామాణిక ప్రతులు లభించలేదు. ఒకే గ్రంథ సందర్భమున వేర్వేరు ముద్రణముల నాశ్రయింపవలసివచ్చెను'. పల్నాటివీరచరిత్రమంతయు శ్రీనాథ కృతముకాదు. శ్రీనాథకృతములని చెప్పబడు భాగముల విషయమునను అభిప్రాయభేదములు కలవు. కావున పల్నాటివీరచరిత్రలోని పదజాలమునంతటిని ఈ పదకోశమున చేర్చుట సరికాదు. క్రీడాభిరామ కర్తృత్వమును వివాదగ్రస్తమే. కావున పల్నాటివీరచరిత్రలో శ్రీనాథ కర్తృకము లనబడుచున్న భాగములను, క్రీడాభిరామమును, ప్రధాన గ్రంథమున చేర్చివేయక అనుబంధములలో వేరుగా చూపియుండవలసినది. శ్రీనాథుని కాలమున వేయబడిన శాసనములనుగూడ ఈ పదకోశమున గ్రహించినారు. ఇది పదకోశ సంప్రదాయములకు విరుద్ధము. 'శ్రీనాథుడు ప్రత్యక్షముగ వానిని వ్రాసినను వ్రాయకున్నను అతని యనుమతిముద్రను పొందిన రచనలు కావున అవి మాకు ఉపాదేయములయినవి' అన్నారు. కాని, ఏ కొక్కొండ వేంకటరత్నము పంతులుగారో, దస్తావేజుపై సంతకము చేసినంతమాత్రాన, ఆ దస్తావేజులభాష ఆయనదే అనికాని ఆయనకుసమ్మతమే అనిగాని అనలేముగదా! అవి ఆనాటి వ్యావహారికభాషాస్వరూపమును తెలిసికొనుట కుపకరింపవచ్చును. అది వేరేమాట. 'చాటుపద్యమణిమంజరి మున్నగు సంకలనగ్రంథములలో శ్రీనాథునిపేర చెల్లు చాటువు లుండుటచే వానిని గ్రహించితిమి. శృంగార శ్రీనాథమునందును, శ్రీనాథుడు శృంగారియా? యను గ్రంథమునందును కొన్నిమంచి పద్యములు శ్రీనాథునివి లభించుటచే, స్వీకరించితిమి' అన్నారు. కాని, బండబూతు పద్యములనైనను వీరు వదలకపోవుట శోచనీయము.

అట్టి అసభ్యపద్యములకు ఈపదకోశములోస్థానము నిచ్చుట అసంగతము. 'భూతలమందు ధాతకు నపూజ్యత కల్గెను......భీతకురంగనేత్రయగు పెండెలనాగికి.........'అను పద్యమును శ్రీనాథుని చాటువుగా వీరంగీకరించి పదకోశమున గ్రహించుట వింత. 'పెండెలనాగి కొప్పువయిబెట్టిన రామకవీంద్రు హస్తము' ఇత్యాది పద్యమునుబట్టి 'భూతలమందు ధాతకు' అను పద్యము తురగా రామకవిదని స్పష్టపడుచుండగా, దీనిని శ్రీనాథుని కంటగట్టుట శోచనీయము. శ్రీ ప్రభాకరశాస్త్రిగారైనను ఇది శ్రీనాథుని దనలేదు.

'శ్రీనాథ పదసూచికలో తత్సమధాతువులతోపాటు రూపభేదముకల తత్సమశబ్దములకుగూడ అవకాశ మిచ్చినాము. విశేషరూపమును పొందదగిన తత్సమశబ్దముల పట్టికను బాలవ్యాకరణము ప్రకారము సిద్ధముచేసికొని అట్టి విశేషరూపములను శ్రీనాథుడు ప్రయోగించినచో వానిని గ్రంథస్థము చేసితిమి' అని తెలిపినారు. ఈ నిర్ణయము బహుధా ప్రశంసనీయము. దీనితోపాటు శ్రీనాథుడు ప్రయోగించిన అరుదయిన సంస్కృతసమములనుగూడ

చూపుట ఆవశ్యకము. ఈ సంపుటములో అట్లు చూపవలసిన పదములు –(1) కానినేయుఁడు. 'కాశికా పట్టనముమీఁదఁ గానినేయ (భీమ 2–114); 'కార్యసంసిద్ధిఁ బొందెదుకానినేయ'(భీమ 3–213). నిఘంటువులలోను, వ్యాకరణమునందును, 'కానీన' శబ్దము మాత్రమే లభించును. అంతమాత్రాన కానినేయ శబ్దమసాధువనుట సాహసమగును. 'మహా భాష్య విద్యా సమభ్యాసబలము' గలిగిన శ్రీనాథ మహాకవికి మనపాటి శబ్దజ్ఞానములేదా? 'కానీనా సుఖం బుండుమీ' అని ముందు ప్రయోగించి (3–212) వెంటనే 'కార్యసంసిద్ధిఁ బొందెదు కానినేయ' (3–213) అని శ్రీనాథుడు ప్రయోగించుట గమనార్హము. కన్యాశబ్ద పర్యాయమగు 'కనీ'శబ్దమును కళ్యాణ్యాదులలో చేర్చికొన్నచో (సి. కా 1131 సూ.) కానినేయ శబ్దము సిద్ధించును. ఈ నా అభిప్రాయమును శ్రీ వజ్ఝల వారును ఆమోదించియున్నారు. (2) కైవారము:– కైవార పదానుసార కమనీయముగా–(హర 6–9), కైవార దుర్భాషణంబులకుంగాని–(శృ. నై–7–89) కైవార కావ్యంబులు—(కాశీ. 7–57). కైవార శబ్దము, 'కేవసేవనే' అను ధాతువుపై 'ఆరన్' ప్రత్యయము చేరగా ఏర్పడును. (వ్యా. సం. స. 1299.) పదకోశమున, 'కైవారము' అనుచోట, ఈ ప్రయోగములు చూపబడలేదు. కైవార శబ్ద భవము, 'కయివారము.' 'అయి' — అను దానికి, 'ఐ' సవ్వాదేశముకాగా, 'కైవారము' అనురూపమును ఏర్పడును. శ. ర. కర్త, కయివారము, కైవారము –అను వానిని దేశ్యములనుట పొరపాటు: 'అనుచుఁ గైవార మొనరించు–'(నీలా 2–42) అను అచ్చతెనుగు కావ్యప్రయోగము ప్రామాదికమనియు, 'కైవారము' సంస్కృతసమముమాత్రమే యగుననియు శ్రీ వజ్ఝలవారు వ్రాయుట సరికాదు. విభిన్న మార్గములలో ఏర్పడిన శబ్దముల ఆకార సామ్యము బాధకము కానేరదు. కన్యాశబ్దమునకు, కన్య — అనునది సంస్కృతసమము. కన్యకా శబ్దభవము — కన్నియ. దీనిలో ఇత్వలోపము కలిగి, కన్య—అను తద్భవమేర్పడినది. నిత్యము—సంస్కృతసమము నిత్యము=నిత్తియము. ఇత్వ లోపము జరిగి, నిత్యము–అయినది. ఇదితద్భవము. 'నిత్యనేమము' లోనిది యీ తద్భవ'నిత్యము'. (నిత్తియము=నిత్తెము–అనియు అయినది. నత్తైన దెల్లక్షణికము, నిత్తెము కాకుండ–వరాహ.) మంత్రము—సంస్కృత సమము. మంత్రశబ్ద భవము మంతరము. అత్వలోపముచే, మంత్రము— అన్నది యేర్పడినది. ఇట్లిది తద్భవమయినది. 'జగమంత్రకాని యాటయు బొలెన్'అచ్చతెనుఁగు రామాయణము: (శ. ర: నూ. ని.) మంత్రము–అనుతద్భవ ముండుటచేతనే మంత్రకాని–ప్రయుక్తమయినది. ఇట్లే మంత్రసాని శబ్దము. 'మంత్రకాటుక (కు. సం 6–96) అను నన్నెచోడుని ప్రయోగమిట్టిదే. పరిశోధకులు దీనిని వైరిపదమనుట వింతకాదు. మనకు తెలియని రూపమును వాడుట కవిదే తప్పు!! అచ్చతెనుఁగు రామాయణము, యయాతిచరిత్ర మున్నగు అచ్చ తెనుగు కావ్యకర్తలు ధారాళముగా సంస్కృత సమములు వాడిరనువాదము లేవలేదు. కారణము, మన పరిశోధకులు పరిష్కరణకు పూనుకొనలేదు. అదృష్టమే. కన్య–కన్య; మంత్రము – మంత్రము— అనుతత్సమ తద్భవములలో ఏకాకృతి ఉన్నట్లే కైవారము–కైవారము — అనువానిలో ఏకాకృతి ఉండ వచ్చును. ఒకటి ఒప్పు ఒకటి తప్పు కానక్కరలేదు.

మృగవిలోకన కంతంత మేనుడస్పె. (శృ. నై. 2–113). ఈ పద్యపాదము, అంతంత–అనుచోట చూపలేదు. తప్పిపోయినది. ఉజ్జని (=ఉజ్జయిని) శబ్దము పదకోశమున కెక్కలేదు. (శృ. నై 5–83). కడ–అనుచోట, కాకికడకంటి చూపు పైరాకమున్న—(కాశీ 3–84) అను పద్యపాదము చూపబడలేదు. 'కడకంటిచూపు' అనువానిని ప్రత్యేక శీర్షికగా ఈయ లేదు. ఈ పద్యపాదము 'కాళికడకంటిచూపు' అను పాఠముతో, 'కంటిచూపు' అనుచోట కలదు. 'కాళి' అను పాఠమున యతిభంగము. 'కాకి'పాఠమున యతి సరిపడునుగాని అర్థము తృప్తికరముగా కనబడదు. '—అ' అనుచో ఈ పద్యపాదము: 'మున్న' పాఠ

ముతో నిచ్చిరి. 'కంటిచూపు' అనుచో, 'మున్నె'అని ముద్రించిరి, 'కేలుఁదమరయందు'అను ప్రయోగము తప్పిపోయినది 'కేలుఁదామరయందు శూలముద్భట'—(కాశీ 5–101 )అంపజాలంబు అనునది వేరుశీర్షికగా చూపబడలేదు. (హర 2–24) 'అంపకోల' అను దానిని ప్రత్యేకముగ చూపుటచే, దీనిని గూడ అట్లే చూపనగును. 'ఇక్కడనక్కడఁ' అనుదానిని ప్రత్యేక శీర్షికగా ఈయదగును. చలి యిక్కడనక్కడఁ బెట్టు వేకువన్—(క్రీడా 45 ). నిర్భరకరుణాధురీణయగు— అనుదానిని శివరాత్రిమాహాత్మ్యమున నున్నట్లు చూపినారు సరే కాని యిది కాశీఖండమునందును గలదు. కావున 'కాశీ 3–19' అనియు చూపవలెను. అగ్నిదేవర (కాశీ 5–302) అను రూపమును శీర్షికగా ఈయదగును. ఇది మిశ్రసమాసము. ఇట్టి మిశ్రసమాసములు క్వాచిత్కముగ ప్రయోగములందు కలవు. అవిగ్రాహ్యములే. (ఒక్కవైరిపదమే లాక్షణిక సమ్మతము, ప్రామాణికకవిసమ్మతముకాదు.) 'మొదవులలోనెల్లఁ గపిలమొదవు వరిష్ఠంబు' (అను 3–19) అని తిక్కనయే యిట్టి మిశ్రమును వాడెను. ఉపనిషత్తు (కాశీ 2–69,151. క్రీడా 20–7 శృ. నై 7–73. హర. 7–79 ) అను తత్సమరూపమును గ్రహింపదగును. ఇది చింతామణి కిని, భారతమునకును విలక్షణమగు ప్రయోగము. అపోసానము—అను పదమును చూపలేదు అపోశనంబులు వడ్డించిరి—భీమ...ఇది 'అపోశాన' శబ్దభవము. ఆపోశనమని యర్థము. అయ=అయ్య. శబ్దమును వీరు చూచుకొనలేదు. వీరే యననేల ? నిఘంటువులును గ్రహింపలేదు 'వ్యతికర, చ్ఛాయాధి పుండు దొడ్డాయ రెడ్డి'(కాశీ 1–25.) దొడ్డ+అయ=దొడ్డాయ. రెడ్డి దొడ్డయ (1–29) ఇతడే. ఈ ప్రయోగము లభింపక పూర్వము 'ఐయ' అను ద్రావిడ పదమును తెనుగుకవులు కొన్నిచోట్ల ఆమోదించి యుందురని భావించి యున్నాను. కాని, ఆయ శబ్దమే పూర్వకవి సమ్మతమని యీ ప్రయోగముచే నిర్ధారణ మగు చున్నది, 'అయా ! యనుడు నేమియాయా యనెడు త్వదీయ నామంబు నజ్ఞియ యడంచి' (బసవ). తాళపత్రలేఖకులు, అయ్యా, తదియ్య, జియ్య—అని వ్రాసినారు. లేఖన సంప్రదాయము నెరుగని పరిశోధకులు, ఇవే కవి పాఠములనుకొన్నారు ఉపబోఁటి (కాశీ 2–38) అను మిశ్రసమాసమును వేరుగా చూపదగును. అవసరంబిచ్చుట (శివ 2–97) అవసరంబిచ్చి (కాశీ 7–223) అను వానిని వేర్వేరు శీర్షికలలో గ్రహించుట ఆవశ్యకము. ఉత్తరజందెము. (శివ 2–64) అను రూపమును గూడ విడిగా చూపనగును. 'కొందురు' (భీమ 4–33) అనుదానిని వేరుగా గ్రహింపలేదు సరేకదా, 'కొందఱు' అనుదానిలో, కలిపి ముద్రించినారు. 'ఒండొరులతోడు తను జెప్పుకొందురు' అని యొకచో ముద్రించినారు. (356 పు).కొందురు-అననిచో, ప్రాసయతి చెడును. 'బచ్చెనయుగ (భీమ 4–127) కారణంబులు నుద్బోధకములుగాఁగ, (కాశీ 1–16)అనునవి తప్పిపోయినవి. '–కటా' అనుచోట, కాశీ 2–140; 5–154; 7–163, పద్యపాదములను; పల్నాటివీరచరిత్ర (57, 99) లోని రెండుదాహరణములను, ఉపేక్షించినారు. కాశ్మీరఖండమను దేశనామమును జూపలేదు. చూపుట ప్రణాళికలో నున్నదే. 'కప్పురపుఁ గ్రోవి కాశ్మీరఖండమున్రథి'—(భీమ 5–88). ఉప్పెఁగలు (కాశీ 3 – 12) శబ్దము నీయలేదు. కాఁడు ప్రత్యయమును శీర్షికగాపెట్టి 'ఈఁడు' ప్రత్యయమును విడిచినారు. (కా, ఈ-అనునవే తద్ధిత ప్రత్యయములు ) జటమటీఁడు– (కాశీ 7–60). 'కాకు'అనికాక 'కాకుసేయక'— అనియే శీర్షిక నుంచవగును (కాశీ. 5 – 88) 'కానకకన్న' (శృ నై 1—109) అను ప్రయోగము తప్పిపోయినది; చేర్పవలెను. 'కొండొక' (హర 7 –36) ప్రయోగము చేర్చమరచినారు. కొంతకొంత–(శృ నై 6–5) శీర్షిక వేరుగా నుంచదగును. 'కొంతతడవు' అనుచో, శృ నై 4–82 లోని పద్యపాదమును చేర్చుట విస్మరించిరి. '–కత్తె' అనుచో, 'కొడుకుఁ గాంచిన యట్టి కోపకత్తె' అను

ప్రయోగమును చూపలేదు. (క్రీడా 129). దీనిని వేరుశీర్షికగను చూపదగును. తన్సమముపై తద్ధిత ప్రత్యయము చేరుట దీనిలోని విశేషము. అగునయేని (శృ. నై. 2—71) అను దానిని ప్రత్యేక శీర్షికగా ఉంచవలెను. ఈతండ నలుఁడు-(శృ. నై. 5–167) అనునని, ఈతండ—అనుచో, ఈయలేదు. ఈయవలెను. అంతకం బెంనుచో, 'ఇమ్మనంతకం బెను మహాభాగ్యము' (హర 4- 65') అని యిచ్చినారు. దీనిని 'అంతకంబెను' అని చూపవలెను. 'అందఱు నందఱే', అనుదానిని వేరుశీర్షికగా పెట్టుట యుక్తము. ఔరుసౌరు అవికాక, 'ఔరుసౌరువడియె' అని శీర్షికనుంచుట లెస్స 'ఔరుసౌరువడు' అన్న మాట. 'కడచిన'అనికాక, కడచినప్పుడు, (కాశీ. 6-83) అని శీర్షికపెట్టుట మేలు. 'కడి' అని కాక, 'కడిమాడసేయ' (క్రీడా 56) అని శీర్షికగా పెట్టదగును.

'ఆ పెండ్లికొడుకులం దేపాటివాఁడు' (31 పు) అని యుదాహృతము. నా పెండ్లికొడుకులందేపాటి వాఁడు (కాశీ. 7—70) అని చూపవలెను. పదచ్ఛేదము పొరపాటు. 'నిన్నూటరెండు యోజనంబు లతిక్రమించినం' (కాశీ. 3-176) అని చూపినారు. (73) ఇదియు తప్పువిభజనయే ఇన్నూట ఒప్పు నిన్నూట కాదు. 'అనియె' అను శీర్షికక్రింద, మగనితోఁ బెక్కేండ్లు మనువు మనియె'(క్రీడా 128). అను పాదము చూపబడినది. మనువు+మనియె-అని గ్రహింపవలెను. మనువును, మనియెనని యర్థము. మనువుము+అనియె అని తప్పుగా విరచి గ్రహించి నారు. '—అనువొప్పఁగ'అని శీర్షికనుంచి 'విన్నను వొప్పఁగ దొట్టినీళ్లలో' (క్రీడా. 144) అను దానిని ఉదాహరణగ ఇచ్చినారు. విన్న+అనువొప్పగ— అని పదచ్ఛేదము చేసినారన్నమాట. విన్ననువు+ఒప్పఁగ—సరియయిన పదచ్ఛేదము. విన్ననువు శబ్దము విజ్ఞానశబ్దభవము. 'ఆ యెల్లవారికి' అని శీర్షిక పెట్టి, 'ఆ యెల్లవారి కాపోశనములున్' (భీమ 2—138) అని చూపినారు. 'పోసిరా? యెల్లవారి కాపోశనములు' అనుచో, పోసిరి+ఆ యెల్ల వారికి, అని తప్పుగా పదచ్ఛేదము చేసినారన్నమాట. ఎల్లవారికి ఆపోశనములు పోసిరా? అని ప్రశ్న. కంకేళి, కుడుంగంబున, కుతుకమున అనునవి అచ్చికములను భ్రాంతితో శీర్షికలుగ పెట్టినారు. ఇవి సంస్కృత సమములే. శృ. నై 3-115 లోని పద్యపాదమును 179 పుటలో గ్రంథనామము లేకుండ 8—79 అని చూపినారు. 9 పుటలో సరిగానే యున్నది. రోయడొకించు కేనియు మరుత్స్మృతి—అనువానిని గ్రంథ నామము లేకుండ 4–4అని యిచ్చినారు (179పు). ఇది శృ. నై. 8—79 లోనిది. 'అ'లో ఉందంద సద్భుతావహభంగిన్ (భీమ 6-93) అనునది చూపబడెను దీనిలో 'అ' అనుదానికి ప్రసక్తియే లేదు. 55 పుటలో 'స. నీ 3-94' అని చూపి నది. హరవిలాసము లోనిది. 'ఆపె' అనవిని చని ఆపె ఆ వార్త చెప్ప 6—44 పోగొట్టుననియెడు బుద్ధితో నాపె 6-75' అని కలదు. ఇవి పల్నాటి వీరచరిత్రలోనివి అయియుండును. 'ఏయకుండంగ: రాగిలోహండిన ప్రాణ్ణయు లేకుండంగ'('కాశీ 3-121). అని కలదు. ఉదాహృత పద్యపాదమున 'ఏయకుండంగ' అనునది లేనేలేదు. 'ఏయకుండంగ' అను శీర్షికను కాశీఖండ నూతన ముద్రణమునుబట్టి పెట్టినారు. 'రాగిలో వాణిన ప్రాణ్ణయకుండంగ' (నూ. ము. 1953) ఉదాహరణమును పూర్వముద్రణమునుండి యిచ్చినారు ఈ వ్యత్యాసమున కిదే కారణము. 'ఇటవిరాఁచ నేడకొ' రెడగంబోయెడి - (క్రీడా. పీ. 54' అన్నారు. (389 పు) క్రీడభిరామములోని పద్యమేయిది (159 ప) పీఠికలో ఉదహరింపబడి నది, గ్రంథసంఖ్యనే పేర్కొనవలెను 'శాటులు నోర్వంగాఁ గలవె చాలును' పల్నాటివీరచరిత్రలోనిదిగా చూపబడెను. ఇది క్రీ. పీ. 67 పద్యములోనిది. 'కొదువలేదు; అతఁడు రాకున్నఁ గొదలేశమైన' కాశీ .7-70' అన్నారు. దీనిలో 'కొదువలేదు' అన్నది లేనేలేదు ఈ భేదము ప్రతుల భేదమువలన వచ్చి నదే. 'భక్షింపఁగా, లేకున్నంగడువంగలారైదవు—శివ. 7-163—'అనుట సరికాదు. ఇది కాశీఖండము లోనిది. ఏటి కోళ్లను - అనుదానికి వాఁడేటి తండ్రి

చెపుమ్ (హర. 2–76) అనునది ఉదాహరణముగ ఈయబడెను. ఏటికోళ్లు—దీనిలో లేనేలేదు.

అందంద: అందందన్, అందందుః—అను శీర్షికలు పెట్టుటకు కారణము పాఠలోపము. అందంద- అను అవ్యయమే గ్రాహ్యము. (శ ర.) ఒక్కడ: అటు విఖండించు మనుజుం డొక్కడ యఘంబు—కాశీ 6–288. ఇట, ఒక్కడ—తప్పు పాఠము. ఈ పాఠమున యతి తప్పినది. ఒక్కట నఘంబు—సాధుపాఠమయియుండును. 'ఉత్తమాంగంబులొక్కట ఖండించెను మాయపుం బడంతి— (హర 6–129) 'ఒక్కలి; ఒక్కలిః' అను పదములను గ్రహించి, ఉదాహరణము లిచ్చిరి. (కాశీ 2–98; 1-133. ఇవి క్రీడాభిరామము క్రింద నిచ్చుట పొరపాటు). వీనిలో ఎక్కలి—సాధుపాఠము. ఎక్కలి=ప్రవాహముచే కొట్టుకొనివచ్చి క్రమ్ముకొన్న యిసుక. (శ. ర). అపుడు: కవికి వరాట రాజపుడు గప్పుర వీడెము పెట్టె—శృ. నై. 6.141—అని చూపబడెను. వరాటరాజ అడప—సాధుపాఠము. వరాట రాజుయొక్క అడప పక్షితో మగగమము రాక పోవుట కలదని గ్రహింపక, అడప పాఠమును, 'అపుడు'గా చేసినారు. అడప, అడపకానితో పరిహాస మాడినట్లు చెప్పుటయే యుచితముకాని, వరాట యువరాజు అడపకానితో పరిహాస మాడెననుట యుచితమునుగాదు. ఇట్లే నిషధరాజంతవాని—అను పాఠమును నైషధునంతవాని—అని పరిష్కర్తలు సవరించినారు. ఈ సవరింపబడిన పాఠమే పదకోశమున కెక్కినది (22 పు.). భీమ. 5–113 పద్యమున, అపలు గలిపె—అని ముద్రితము ఇది, అనలు కొలిపె—అని ఉండదగును ఈ ప్రయోగము పదకోశమున కెక్కలేదు. 'అంగుటి: వెల్వులంగుటి స్ఫోటంబు లాచరింప—కాశీ 3–22' అని చూపినారు. అంగుళి స్ఫోటంబు—ఒప్పు అంగుటి—తప్పు. 'కూడుసీరల కింటం గొదవలేకయుండునె—హర. 2–51' అని చూపినారు. (179 పు). ఇందు గణభంగ మేర్పడినది. కొదలేక—సాధుపాఠము. 'కానుక: మానవతీలలామకుం గానుక' అని చూపబడెను. ఇట, 'కానిక' కవిపాఠమనవలెను. 'మానవతీ లలామకుం, గానిక యిచ్చెం దావి వెలిగాని కనత్కనకారవిందమున్' (శృ. నై. 8–33) అని యమకము పాటింపబడియుండును. 'నిర్మలమణులు కానికలుగాంగ' (కాశీ 7–152) అని శ్రీనాథుండు యతిస్థానగతముగ 'కానిక' శబ్దమును ప్రయోగించెను. 'ఇవి; ఈంగకెన్నండునే నివి యిడనివారు. శృ. నై. 7–53' అని చూపినారు 'ఇవి' శబ్దము పరిష్కర్తలదికాని శ్రీనాథునిదికాదు. 'ఈం...గాటిని యిచ్చువారు' పూ. ము; పిఠాపురము. తాళపత్రప్రతి. దీనిబట్టి 'ఈంగకెన్నండుం గాటునే నిడనివారు' కవిపాఠమయియుండును. ఇందుకు ప్రయోగాంతరములు—(1) మంచి యీంగక్రుం గాటు పామునకు బలియు, నొసంగడని భర్తకె పొక్కు నువిదమదిని—పాండు. 4–149. (2) ఈంగకుంగాటేక పామునకుంగలి పెట్టక—వరాహ. 9–123. ఇల్లాండ్రుడర, ఇల్లాండ్రదుర— (కాశీ 1–130) అనునవి అపపాఠములనియు, 'ఇల్లాండురు' సాధువనియు అందురు. ఓకలించు—శబ్దము సరికాదు. ఓకిలించు—అనునదే కలదు. ఉయ్యెలలు: అబ్జనాభుని తూంగుటుయ్యెలలు గంటె—అని చూపబడెను. ఇట యతి తప్పినది. ఉయ్యాలలు—అనియే పాఠము. 'ఉల్లగందంబు: ఉల్లగందంబు పసుపున మూసె—శివ. 2–64'. ఇట, ఓలగందంబు—అనియే పాఠము. 'ఎక్కడకు: కాశీ 6.88 ఎక్కడకైన—శివ. 3–79' ఇవి ఎక్కడికి, ఎక్కడికైన అని ఉండదగును. (ఎక్కడకు—అన్నదే సాధువని కొందరనుట పొరపాటు). ఎరంగి—అను సాధు రేఫఘటితశబ్దము తప్పు. ఎఱంగి—అన్నదే ఒప్పు. 'ఎరంగి ప్రియము వలికి పెరువిత్తురు' (ఆది 7–112) అను ప్రయోగము కలదన్న భ్రాంతితో నిఘంటువులు ఎరంగు—అనియు, చూపినవి వైయాకరణ పారిజాతము ఇట్టి పొరపాటునకే లోనయ్యెను. ఇట, తెరలి—సాధుపాఠము 'కట్టెఱ్ఱ: సృష్టి కట్టెఱ్ఱ—కాశీ 1–121. ఇట 'కందెఱ' సాధు పాఠము 'అఖిల జగముల కందెఱ్ఱ' అని తిక్కన. 'కట్టెఱ్ఱచాయ: కట్టెఱ్ఱచాయం దెలుపన్—కాశీ. 1–121' ఇది పూ. ము, పాఠము కట్టెఱ్ఱ చాయ వేలుపు—నూ. ము. పాఠము. ఇదే ఒప్పు. వేలుపు—

శబ్దము తాళపత్ర మాతృకలలో 'వెలుపు' అని వ్రాయబడుట పరిపాటి. వెలుపు=వేలుపు—అని గ్రహింపవలెను దీనిని దెలుపు—అని పూ ము. లో గ్రహించినారు ప్రాఙ్నన్నయ యుగమునందలి భాషను గూర్చి పరిశోధనలు జరిగినట్లే, తాళపత్రలేఖన సంప్రదాయాదులపై పరిశోధనలు జరుగవలసి యున్నది. 'కడపని: కాశీ. 7—140' కడపనీ=కడప నిమ్ము—సాధుపాఠము. 'ఏమిగొంకక: హర 2—29'. ఇట, ఏమింగొంకక—సాధుగాను ం యుక్తము. 'ఒక్క ప్రేలికి:ఒక్కప్రేలకి వెండియుంగరంబు—హర 7—12'. ఈ పద్యపాఠము, ఒకజాట్ల ప్రేల వెండుంగరంబు' అను పాఠముతో సర్వలక్షణసారసంగ్రహమున చూపబడి యున్నది వెండి+ఉంగర బు=వెండుంగరంబు, దేశ్యేకార సంధి భారతమున ధారాళముగ కలదు. తప్పను కొని, వెండియుంగరంబు—అని దిద్దిరి. మనుచరిత్రలో 'కౌఁగిలది' అని ప్రయుక్తము. ఇదేదో కొంపముంచిన ప్రయోగమని పాపము పీఠికాకర్తలకు బెంగ. కాశీఖండ పూర్వముద్రణమున, 'మూఁడు నత్యంత గంభీరములు గవలయు' (కాశీ 4—26) అని కలదు. ఇది, నూ. ము. లో— గంభీరముగను వలయు అని మారిపోయినది కవలయు= కావలయు అని వేరేపదముగా శీర్షిక నుంచదగును. 'ఉన్న'శబ్దము పరమైనప్పుడే దీర్ఘము హ్రస్వమగునని, త్రి. శే. కాని ఉన్న—పరము కానక్కరలేదు. కవలయు—అను. 4—26. కంగోరు = కాఁగోరు. కు. సం. 6—722. కందగు=కాఁదగు బసవ. 2 ఆ. (వ్యా. సం. ప ). కన్నుదమ్మి—శృం నై 8—201. ఇట, కన్నుఁదమ్మి—అని యుండవలెను. 'కపురపు: ప్రతిదినమ్మును గపురపు దీపములు వేయు—హర పీ. 10' అని చూపినారు. ఇటగ ణభంగము కలిగినది. ప్రతిదినమ్మును గపురపు దీపములు వేయు అన్నచో గణభంగము తొలగును. 'ప్రతిదినమ్మును గపుర దీపములు నేయు' అని వే. ప్ర. ప్రతిపాఠము. గణభంగమును తొలగించుటకు, ఈ ప్రతిలో 'కపురపు'లోని, పువర్ణము తొలగింపబడెనేమో! లేదా, కపురదీపము— అని ఉండగా, 'పు'వర్ణము చేర్పబడెనేమో! ఈ పక్షమున 'కర్పూరదీప' శబ్దభవము 'కపురదీపము'— కావచ్చును. దీపశబ్దముతో అవాచ్ఛికవర్ణములు లేవుగుమక మార్పు కలుగవలసిన నిర్బంధము లేదు. ఈ విషయము గ్రాంథిక భాషాభిజ్ఞులకు తెల్లమే. కళాపించె—కాశీ 3—23 అని చూపుట సరికాదు. కళాపించె—సాధుపాఠము. 'కళ్యాలః కాశీ 3—11' ఇట, 'కళ్యాల' అను పూ. ము. పాఠమే ఒప్పు. కావుతము: భస్మంబు గావుతమని—హర 3—95. ఇట, కావుతయని—సాధుపాఠమనదగును. మకారము కలదన్న పక్షమున, 'కావుతమ' అని విభజించుట లెస్స 'ఉండుగాఁగావుతమ యఖండితముగ'— నన్నయ. ఇట, ఆశీర్వచన ప్రత్యయముపై 'అ' అను అవధారణము చేరుట సరిపడదు. కాతన్+అ=కాతన, వంటి రూపములు లేవు కావున, కావుతమ+అని=కావుతమని— అయ్యెననుట యుక్తము కీడ్పఱచి - కాశీ 1—93. ఇది కీడ్వెరసి' అయియుండును. (చూ. శ. ర. అనుబంధము). అందించు, అందిచ్చు, అను రెంటికిని ఒకే పద్యపాదము ఉదాహరణముగ చూపబడెను. అందిచ్చు— అన్నదే సరియగు పాఠము. దంతతాటంక మధ్యచక్రంబునందు—శివ. 3—46. ఇట యతి తప్పినది. చక్రమధ్యంబునందు—సాధుపాఠము. (32 పు) బ్రమసి తప్పిన పసరంబు వెదకినట్లు—హర 2—45. యతిభంగము కలిగినది. నెమకినట్లు—సాధుపాఠము. అధిరించి—కాశీ 5—281. ఇట, అతకరించి—సాధుపాఠము. ఉచ్చలి: నోరనుచ్చలి గ్రమ్మమై వడఁకం హర. 2—84. నోరమ్మచ్చలి అనుటకిది ముద్రణ పాలిత్యము కావచ్చును. నోరన్+ఉచ్చలి—అను పదచ్ఛేదము తప్పు. నుచ్చలి—అనునది యిట సాధుపాఠము నోరన్+నుచ్చలి—అని విడదీయవలెను. ఎవ్వండు పఠించును—(287 పు) అపపాఠము. ఎవ్వండు పఠించును— సాధుపాఠము ఎవ్వండు+పఠించు=ఎవ్వండు పఠించు— అయినది. ఈ పాఠమును కూచిమంచితిమ్మకవియు చూపియున్నాడు (సర్వల). 'ఎంత గుమతులైన' అను తిక్కన ప్రయోగమునుబట్టి భారతమున, తెనుఁగువిభాది పతుపములకు గసడదవలు నిత్యమని స్పష్టపడుచున్నది. భారతమున, గసడదవాదేశము వచ్చినచో నిత్యము గావచ్చును, రానిచో అపయిరాదు. ఎవ్వండు పఠించును—వంటి రూపమును నిర్వహించు ప్రయోగము సైతము కనబడదు. చింతామణి వ్యాఖ్యా

మూలమున సూరి గసడదవాదేశమిట కాదనెను. దానిని చూచి వచించును—అను సవరణను ప్రవేశపెట్టిరి. 'ఎవ్వండు వరి చును' వేరుశీర్షిగా ఈయదగును. ఇషిక యెత్తి—కాశీ 4–227 – సరికాదు. (270 పు). చెప్పకున్నఁ గోపించి యిషీక యెత్తి—సాధుపాఠము. బహిరుండో—కాశీ 7—249. (388 పు). ఇది తప్పుపాఠము. బహిసుండో—సాధుపాఠము. 'వెలియుఁ జుండోయని వ్రేసెఁజేతాళము' అను బసవపురాణ ప్రయోగమువంటిదిది. (బసవ. 4 ఆ.). ఉతియు కుండ: వర్షధారలచేత నుతియుకుండ-కాశీ 7–40 ఇట యతితప్పినది. పూ. ము. లో, ఉదకధారలచేత నుతియకుండ — అని కలదు. ఇది సవరణమై యుండును: 'వరషధారలచేత' అన్నది యిక్కడ సాధు పాఠము. 'హరషము గదురఁగ భారత, వరషమునం గలుగు పుణ్యావరతీర్థములు, త్కరిషంజూచుచు విగతా, మరషుండై పంచరించె మనుజవరేణ్యా (భాగ. 3—40.) 'వరిష' శబ్దమును గలదుకాని ఇత్యమధ్యములను నిల్పినచో 'కమ్మగా వినిపింపదు.' (భాగ వ౨). నిజమే. అందుచేతనే కాబోలు హరుషము అను రీతిని ఉత్యమధ్యములు తాళకు ప్రతులలో కనబడుమ. అవే కవి పాఠములను పట్టుదల ఉన్నచో అట్టి సంస్కృత శబ్దములును ఉండనగునమట ధర్మముగాని అవి భ్రష్ట రూపములనుట ధర్మముకాదు. మన శక్తి యుక్తులచే కవి భ్రష్టభాషను వ్రాసెనని సాధించుటకు వినియోగించుట శ్రేయమునుకాదు. 'వరషధారలచేత' అన్నదే కాశీఖండ పాఠమయియుండును వర్ష, ఉదక— పాఠములు గ్రాహ్యములు కావు. పదకోశమున కెక్కిన అపపాఠముల నన్నింటిని వివరించుటకు స్థలము చాలదు. మచ్చునకివి చూపబడెను.

'పదకోశములో పదములకు అర్థములు వ్రాయు నాచారము లేదు. కాని ఏ పదము ఏయే సందర్భములలో ఎన్నిమారులు వాడబడినదో దీనివలన తెలియును' అని తొలిపలుకు. కాని పదజాలమునంతటిని వర్గీకరణము లేకుండ పట్టికలుగా కూర్చుటచే ఈ చెప్పిన ప్రయోజనము నెరవేరలేదు. అల్లాడ అను నుజ్యంతము (అల్లాడన్), అల్లాడరెడ్డిలోని అల్లాడ శబ్దము ఒక చోటనే చేర్పబడెను. అగున్— అను క్రియయు, అగు—అనుధాతుజ విశేషణము ఒక పట్టికలోనే కూర్పబడెను. ఇదే గ్రంథ ప్రణాళికగా కనబడును.

పదకోశములు అకాడమి నిర్మింపదలచిన నిఘంటువునకు ముడిసరకుల వంటివి పదకోశములతోపాటు తాళపత్ర మాతృకా పాఠసేకరణమును అకాడమి జరిపింపవలసియున్నది. ఆ పాఠములపై చర్చలు జరిగినపిమ్మటనే సుపరిష్కృత ముద్రణ ప్రకటనకు పూనుకొనుట ఫలవంతమగును పదకోశములు నిర్దుష్టములు కావలెనన్నను, నిఘంటువు తిన్నగా తయారుకావలెనన్నను, సుపరిష్కృత ముద్రణములు వెలువడినప్పుడే సాధ్యమగును ఈ మహాకార్యమునకు నాందిగా అకాడమి తాళపత్రప్రతులనుండి పాఠసేకరణమును జరిపింపవలసియున్నది.

ఒకమాట తొలిపలుకులో 'తోటలో పిల్ల—కోటలో రాణి—అను సినిమా కలదని వింటిని శ్రీనాథ పదప్రయోగ సూచిక ఆవిర్భావ వికాసములు సరిగా ఇట్లే యున్నవి' అని కలదు. తొలిపలుకులో, సినిమా ప్రసంగము చేయుట పదకోశ గౌరవమునకు తగినదికాదని సవినయముగా మనవి చేయుచున్నాను.

పదకోశమును తయారుచేయింపించిన, సంపాదకులు శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనముగారికి, సహసంపాదకులు, శ్రీ వల్లాదుర్గయ్యగారికి, శ్రీ చెలమచెర్ల రంగాచార్యులుగారికి ధన్యవాదములు పదకోశ ప్రకటన భారమును వహించిన అకాడమివారికి భాషాభిమానుల పక్షమున కృతజ్ఞతలు. సెలవు.

---

(గ్రంథము: శ్రీనాథ పదప్రయోగకోశము; I భాగము. సంపాదకులు: శ్రీ ఖండవల్లి లక్ష్మీరంజనంగారు. ప్రకాశకులు: ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, కళాభవన్, హైదరాబాదు—4. మూల్యము: 30/ –)

# తిమ్మరుసు మంత్రి - ఒక విశేషం

డా. మారేమండ రామారావు

ఆపస్తంభ సూత్రుడూ, కౌండిన్యస గోత్రుడూ, యజుశ్శాఖీయుడూ, వేమరస పౌత్రుడూ, రాచిరాజు పుత్రుడూ అయిన సాళువ తిమ్మరుసు చరిత్ర ప్రసిద్ధుడు. ఇతడు తుళువ వీరనరసింహునివద్ద ప్రధానిగా ఉండి, ఆ రాజు మరణానంతరం సామ్రాజ్య క్షేమాన్ని పురస్కరించుకొని, బాలుడైన అతని పుత్రుని త్రోసిపుచ్చి, అప్పటికే మహామేధావి, యుక్తవయస్కుడూ, వీరనరసింహుని సవతి తమ్ముడూ అయిన కృష్ణరాయలని మృత్యుముఖంనుంచి తప్పించి విజయనగర సామ్రాజ్యానికి పట్టాభిషిక్తుడిని చేశాడు. అనంతరం ఇతడు రాయలకు శిరఃప్రధానీ, దండనాయకుడూ అయినాడు. రాయల పూర్వ దిగ్విజయయాత్ర జయప్రదం కావడానికీ, అందులోనూ కొండవీడు దుర్గం వశం కావడానికీ తిమ్మరుసు శక్తీ, గజపతిరాజధాని అయిన కటకం స్వాధీనం కావడానికి తిమ్మరుసు యుక్తీ ముఖ్యకారణములు అయినవి. రాయలూ, తిమ్మరుసుమంత్రీ ఎంతో అన్యోన్యంగానూ, సన్నిహితులుగానూ ఉండినా తుదకు తిమ్మరుసు రాయల ఆగ్రహానికి పాత్రుడై కండ్లను కోల్పోయి మగ్గి మహాకష్టములను అనుభవించాడని ఒక అభిప్రాయం లోకంలో ప్రబలంగా ఉన్నది. ఈ అభిప్రాయాన్ని విమర్శించడం ఈ వ్యాసంయొక్క ముఖ్యోద్దేశం.

పై అభిప్రాయానికి మూలం న్యూనిజ్ అనే పోర్చుగీసు వర్తకుని కథనం. ఈ న్యూనిజ్ రాయల కాలంలో విజయనగరం వచ్చి, అచ్చట కొంతకాలం ఉండి; అప్పుడు జరిగిన వృత్తాంతములను ఒక కథనంగా వ్రాశాడు. ఈ కథనంలో ప్రస్తుతం మనకి పనికివచ్చేవి ఈ కొద్ది అంశములు[1]—(1) రాయచూరు యుద్ధానంతరం కొంతకాలం అయినతరవాత రాయలు తనకు వయస్సు మళ్ళినదని గ్రహించాడు (2) అప్పటికి అతనికి ఆరు సంవత్సరముల వయస్సుగల పుత్రుడు ఉన్నాడు. (3) రాయలు తన తరువాత తన పుత్రుడు రాజ్యానికి రాగలుగుతాడో లేదో అనే భయంవల్ల ఆ కుమారుడికి పట్టాభిషేకం చేసి, తాను అతనికి మంత్రి అయి, అంతవరకూ ప్రధానిగా ఉండిన తిమ్మరుసును తనకు సలహాదారుని చేసుకున్నాడు. (4) ఈ బాలుని పట్టాభిషేకోత్సవములు ఎనిమిది నెలలకాలం జరిగినవి. అప్పుడు అతడు వ్యాధిగ్రస్తుడై మరణించాడు. (5) కొంతకాలానికి తిమ్మరుసు కుమారుడు విషప్రయోగం చెయ్యడంవల్ల ఆ కుమారుడు మరణించినట్లు రాయలకు తెలియవచ్చింది. (6) అంతట రాయలు తిమ్మరుసునూ, అతని పుత్రుడినీ, తమ్ముడైన గోవిందరాజునూ సభలో తూలనాడి, తిమ్మరుసునూ, అతని ఇద్దరు కుమారులనూ మూడు సంవత్సరములకాలం చెరలో ఉంచాడు. (7) పిమ్మట తిమ్మరుసు కుమారుడైన దన్నాయకుడు చెరనించి తప్పించుకొని, ఒక దుర్గంలో ఉండి, సైన్యం సమకూర్చుకొని రాయలపై తిరుగుబాటు చేశాడు. కాని రాయలు అతనిని పట్టించి సముఖానికి తెప్పించాడు. (8) ఆ పిదప రాయలు ఈ ద్రోహినీ, తిమ్మరుసునీ, అతనితోపాటు చెరలో ఉండిన అతని మరి ఒక కుమారుడినీ వధార్హులుగా నిర్ణయించి, బ్రాహ్మణులు కావడంవల్ల వారి కండ్లు పొడిపించి, తిరిగి వారిని చెరలో పెట్టించాడు. (9) దండనాయకుడైన తిమ్మరుసు పుత్రుడు చెరలో మరణించాడు. తిమ్మరుసున్నూ, అతని రెండవ కుమారుడైన గండ్రాజున్నూ చెరలోనే ఉండిపోయారు.

---

1. Sewell–Forgotten Empire–Chronicle of Nuniz, ch. VIII, pp. 359 361.

న్యూనిజ్ చెప్పిన ఈ కథ మరి ఏ ఇతరాధారంలోనూ కనిపించదు. తిమ్మరసుకు ఇద్దరు కుమారులున్నట్లున్నూ మరి ఎక్కడా చెప్పబడలేదు. ఇంతేకాక ఈ కథనంలో విరుద్ధాంశములున్నూ ఉన్నవి. తిమ్మరసును సభలో నిందించినప్పుడు అతని కుమారుడు ఒక్కడే ఉన్నట్లున్నూ, మూడు సంవత్సరముల కాలం చెరలో ఉన్నది అతనితోపాటు ఇద్దరు కుమారులున్నూ అని ఈ కథనంలో ఉన్నది. ఇందులో ఏది నిజమో తెలియదు. న్యూనిజ్ చెప్పిన కథ విశ్వసనీయంగా కనిపించదు.

న్యూనిజ్ కథనం రాయల కుమారుని పట్టాభిషేకంవరకూ ఇతరాధారములకు అనుకూలంగా ఉండడంవల్ల నమ్మతగినదిగా కనపడుతుంది. క్రీ. శ. 1517 లో కొండమరసు రాయలకు సంతాన ప్రాప్తి కావలెనని కోరుతూ ఒక శాసనం వేయించాడు.[2] అప్పటికే రాయలకు వివాహితలైన ఇద్దరు పుత్రికలు ఉండడంవల్ల ఈ కొండమరసు కోరిక పురుష సంతానాన్ని గురించే అని స్పష్టం అవుతూన్నది. క్రీ. 1518 వ సంవత్సరం అక్టోబరు 20 వ తేదీనాటి ఒక శాసనంలో రాయల దేవేరి అయిన తిరుమలదేవి తన కుమారుడైన తిరుమలరాయలనుగురించి ఒకదానం చేసినట్టు ఉన్నది.[3] మరికొన్ని శాసనములు[4] తిరుమలరాయలు కృష్ణరాయలకున్నూ, తిరుమలదేవికిన్నీ కుమారుడు అని తెలుపుతూన్నవి వీటినిబట్టి రాయలకు క్రీ. శ. 1578 లో తిరుమలరాయలనే కుమారుడు జన్మించాడని స్పష్టం అవుతుంది. ఈ తిరుమలరాయలు క్రీ. శ. 1524 లో వైశాఖమాసంనించి మార్గశిర మాసంవరకూ రాజ్యం చేసినట్టున్నూ శాసన ప్రమాణం ఉన్నది.

కృష్ణరాయలు తిమ్మరసు కండ్లు తీయించిన వైనం మరి ఏ యితరాధారంలోనూ కనిపించదు పూర్వులు, విజయనగరచరిత్ర విషయంలో పరమ ప్రామాణికులూ అయిన డా|| నేలటూరి వెంకటరమణయ్యగారు ఈ విషయాన్ని విపులంగా చర్చించారు. ఆ సందర్భంలో ఆయన 'వాని శా. శ 1446 తోరణ తరువాత తిమ్మరసయ్య ప్రస్తావము శాసనములం దెచ్చటను గన్పట్టదు. ఇతని పక్షమున కొండవీటి సామ్రాజ్యమును పాలించుచుండిన యితని యల్లుడగు నాదెండ్ల గోపమంత్రి శా. శ. 1447 ఫాల్గుణ శుక్ల 15 నాడు కొండవీటిలో సపరివార పట్టాభిరామ విగ్రహమును ప్రతిష్ఠించెను. ఇది గోపమంత్రి కడపటి శాసనము. మరియు సాళువ తిమ్మరసు శాసనములు స్వభాను సర్వధారి సంవత్సరములమధ్య కానరావు కావున సాళువ తిమ్మరసు మంత్రి యధికారము శా. శ. 1447 కు సరియైన క్రీ. శ 1525 తో ముగిసెనని నిర్ణయింపవచ్చును. ......న్యూనిజ్ కథ కిది యనుకూలము

2. S. I I. IX—ii no. 507.

3. S. I. I. IX—ii, no 510.

4. Ep. Car. IX, Ma 82; 116 of 1918, 139 of 1896.

5. 181 of 1913; 139 of 1896, 115, 116, 117 of 1918; 91 of 1912.

గనే యున్నది' అని వ్రాసినారు.[6] అంతేకాక 'ఇట్లు న్యూనిజు వర్ణించిన యంశముల నెల్లను శాసనాద్యన్య సాధనముల మూలమున నిరూపించుటకు వీలుగాకపోయినను నాడు చెప్పు వృత్తాంతము మొత్తముమీద సత్యాత్మకమయి యెన్నదగియున్నది.' అనిన్నీ అభిప్రాయపడినారు[7]. కాని కొన్ని శాసనములనించి తెలియవచ్చే అంశాలు ఈ అభిప్రాయం సరియైనది కాదేమో ననే ఊహను కలిగిస్తున్నాయి.

రాయలు తన కుమారునికి పట్టాభిషేకం చెయ్యడం, అనంతరం ఆ కుమారుడు మరణించడం క్రీ. శ. 1524 లో జరిగినవి కదా! ఆ మీద మూడు సంవత్సరములు తిమ్మరుసు చెరలో ఉన్నాడు అని న్యూనిజ్ చెప్పాడు. అప్పుడు క్రీ. శ. 1524 నించి 1527-28 వరకూ తిమ్మరుసు చెరలో ఉన్నట్టు స్పష్టం అవుతుంది. రాయలు అతని కండ్లను పొడిపించడం ఆ మీదటనే జరిగి ఉండాలి. అనగా రాయలు మరణించడానికి ఒక సంవత్సరం ముందు ఇది జరిగి ఉండాలి. తిరుమల తిరుపతి శాసనములలో తిమ్మరుసు ప్రశంస ఉన్నది. రాయల రాజ్యకాలంలో ఇతడు వేయించిన శాసనములలో 'ప్రధాని' అనే విశేషణం ఉన్నది క్రీ. శ. 1536 ఫిబ్రవరి 26 వ తేదీనాడు తాళ్ళపాకం తిరుమలయ్యంగారివద్దనించి 4,600 పణములు తీసుకొని అందుకు బదులుగా తిమ్మరుసు తన తమ్ముడు గోవిందరాజుకు రావలసిన ప్రసాదంలో 1/4 వంతు ఆయనకు విక్రయించాడు.[8] అలాగే క్రీ. శ 1536 డిశంబరు 28 వ తేదీనాడు తిమ్మరుసు పై తిరుమలయ్యంగారివద్దనించి 1,900 పణములు తీసుకొని తనపేర శ్రీ వెంకటేశ్వరునికి అర్పించే ప్రసాదంలో 1/4 వంతును ఆయనకి విక్రయించాడు.[9] అదే విధంగా తిమ్మరుసున్నూ, ఆయన తమ్ముడు గోవిందరాజున్నూ 5,203 పణములు తీసుకొని పై తిరుమలయ్యంగారికి తిరుపతిలోని గోవిందరాజస్వామికి సమర్పించే ప్రసాదంలో తమకు రావలసిన 1/4 వంతును విక్రయించారు.[10] ఈ మూడు శాసనకాలములలో తిమ్మరుసు తిరుమల తిరుపతులలో ఉన్నట్టే కనిపిస్తుంది. ఈ మూడు శాసనములూ కృష్ణరాయల తర్వాత రాజ్యానికి వచ్చిన అతని సవతి తమ్ముడైన అచ్యుతరాయల కాలంనాటివే. వీటిని బట్టి తిమ్మరుసు క్రీ. శ. 1536 లో సంవత్సరాంతంవరకూ సజీవి అయివుండి, క్షేత్రసంచారం చేస్తూ, దానధర్మములు చేస్తూ ఉండినట్లు స్పష్టం అవుతుంది. అతడు క్రీ. శ. 1528 లో కండ్లను కోల్పోయిఉంటే ఎక్కడనో అనామకుడుగా పడిఉండేవాడు కదా! అతని తమ్ముడు గోవిందరాజు ప్రశంస క్రీ. శ. 1541 వరకూ కనిపిస్తుంది.[11] అందువల్ల తిమ్మరుసు కండ్లు తీయించడమునుగురించి న్యూనిజ్ చెప్పినది సత్యదూరమని స్పష్టం అవుతుంది.

ఇంతేకాక మరి ఒక విశేషమున్నూ తెలియవస్తుంది. డా॥ వెంకటరమణయ్యగారు శా. శ 1446 లేక క్రీ. శ 1524 కు తరవాత తిమ్మరుసు ప్రశంస కనిపించదు అని వ్రాశారు.[12] దీనికి అతడు ఆ కాలంలో చెరసాలలో ఉండడమే కారణం కానక్కరలేదు. రాయలు తన రాజత్వాన్ని త్యజించి, తన పుత్రునికి పట్టం కట్టి, తను అతనికి మంత్రిఅయి, అప్పటివరకూ శిరఃప్రధానిగా ఉండిన తిమ్మరుసును కేవలం సలహాదారుగమాత్రం నియమించాడు. దీన్నిబట్టి క్రీ. శ. 1524 లోనే తిమ్మరుసు పదచ్యుతుడైనట్టు తెలుస్తుంది. అచ్యుతరాయలనాటి తిమ్మరసు శాసనములలో 'ప్రధాని' శబ్దం లేకపోవడం

---

6. భారతి, మే 1953, పే. 400.
7 డిటో పే. 401.
8. T. T. D. I. IV, no. 72.
9. T. T. D. I. IV, no. 93.
10. T. T. D. I. IV, no. 74.
11. T. T. D. I. IV, no. 166.
12. భారతి, మే 1953, పే. 400.

ఈ ఊహని బలపరుస్తున్నది[13] అప్పుడు క్రీ. శ. 1524–1536 మధ్య తిమ్మరసు సామాన్యపౌరుడు గానే ఉన్నాడని స్పష్టం అవుతుంది. అంతేకాక రాయలు తన కుమారుడు క్రీ. శ 1524 లో మరణించాక తిరిగి రాజ్యాన్ని చేపట్టి క్రీ శ 1529 వరకూ పరిపాలించాడుకదా ! ఈ కాలంలో అతడు తిరిగి తిమ్మరసును మహాప్రధానిని చేసుకోలేదు ఇందుకు కారణం ఏమిటి అనే ప్రశ్న వస్తుంది. దానికి ఈ విధంగా సమాధానం చెప్పవచ్చును రాయలు స్వార్థపరుడై తన కుమారుని పట్టాభిషిక్తుడినిని చెయ్యదలిస్తే, సామ్రాజ్యక్షేమం పురస్కరించుకొని తిమ్మరసు రాయల కోరికని ప్రతిఘటించి ఉంటాడు. అందువల్ల వారిద్దరికీ విరోధం ఏర్పడి, తిమ్మరసు మీద ఉండిన భక్తివిశ్వాసములుపోయి, రాయలు తిమ్మరసును దూరంగా ఉంచి ఉంటాడు

పైన చెప్పబడిన అంశములనుబట్టి రాయలు తిమ్మరసుమంత్రి కండ్లు పొడిపించాడని చెప్పే న్యూనిజ్ కథనం విశ్వసనీయం కాదని తెలుస్తుంది. క్రీ. శ. 1524 అనంతరం తిమ్మరసు సామాన్య పౌరుడుగానే ఉంటూ క్రీ. శ. 1536 తరవాత ఎప్పుడో మరణించి ఉంటాడని చెప్పవచ్చును విజ్ఞులు ఈ విషయమై అవసరం అయిన పరిశోధన సాగిస్తారని ఆశిస్తున్నాను

---

13. తిమ్మరసు క్రీ. శ 1524 కు పూర్వం వేయించిన శాసనములలో ఈ 'ప్రధాని' శబ్దం ఉన్నది. T. T. D. I. III, no. 21. 22.



# మృగాంకుడు

## శ్రీ పువ్వాడ నాగసుందరమ్మ

ఉడుపతి నాకు తోడనుచు నుల్లస మందిన కల్యభామకున్
పులకలు మేన నిండఁగ నపూర్వములౌ మధురానుభూతులన్
తొలఁకెడి రేకు చెక్కిళులతో సరసమ్ములు నాడె రాజు కెం
పలమిన సోయగమ్ము మరుదంకురమై మిథునాళి చొక్కఁగన్.

లలితనికుంజసౌరభవిలాసములన్ తెలికాంతు లీను పూ
వుల మరుదావిలోన వలపుం దలఁపుల్ పరవళ్లు ద్రొక్కు నె
చ్చెలి నయనమ్ములందు శశిఁజేరి, మృగాంకు మృగాక్షిఁగట్టి సం
చలరేఁ బ్రియుండు తొల్లి; యిపు డాతలఁపుల్ గగనప్రయాణముల్,

శరదిందూదయవేళఁ గల్వకొలనుల్ స్వచ్ఛమ్ములై నిండఁగన్
స్మరుతూపుల్ సుమియింపఁ గన్నెమదిలో సాంద్రంపుఁ గ్రొవ్వెన్నెలల్
సరసమ్మయ్యె శరత్తు ప్రేమికులకున్ నాఁడీభువిన్; నేఁడు దు
ర్భరమై తోఁచు శరత్తు మానవపదగ్రస్తేందురాత్రమ్ములన్.

కవితాంభోనిధికిన్ నిశాకరుని రాకల్ కామితార్థమ్ములై
వివిధోత్తుంగతరంగభంగివిలసత్ఫేనామృతాంశుప్రభల్
కవి భావోదయ మార్గదర్శకములై కాంతిల్లె నిందన్క, న
క్కవితా వార్ధికిఁ గల్గబోదు ముదమింకన్ కార్శ్యపుం జంద్రికన్.

కడలి పొగిలె సారంగ మంకమ్ము గాఁగఁ
దనయు మోమునఁ గాంతులు తఱిగె ననుచుఁ;
గడలి హృదయాగ్ని రగిలె మృగాంకు నుదుట
మనుజ పాదాలు మాయని మచ్చ గొలుప.

కనిన తీయని కలలు నిక్కాలలు గాఁగ
నాకసమ్ము విజ్ఞాన విహాయసమ్ము!
శీతకరుతలమ్ము విహారసీమ! చంద్ర
శిల ధరిత్రికిఁ గరగతామలక ధనము.

# విజయం

## శ్రీ యర్రంశెట్టి శాయి

పడగ్గదిలో పందిరిమంచం క్రిందనుంచి పెద్ద పెట్టె బయటకు లాగి దానిముందు మఠం వేసుకొని కూర్చుంది రాజ్యం. కొద్దిగా సెంటు వాసనా, కలరా ఉండలను వాసనా మిళితమయిపోయి ఓ క్రొత్త పరిమళం పెట్టెలోంచి బయటకు వెలువడుతోంది. ఆ పరిమళానికి వెలలేని విలువున్నది. అది గడచినకొన్నితీయనిపాతరోజులను రాజ్యం ముందుకి నెడుతుంది. జ్ఞాపకాలను కెలికి బయటకు లాగుతుంది. గుండెల్లో పేరుకుపోయిన అశాంతినీ, అసంతృప్తినీ, ఆరిపోయిన కోరికల చీకటినీ — అక్కడే పుట్టి పెరిగి, పెద్దవయి, దారుణంగా హత్యచేయబడుతోన్న ఆశల సంపుటినీ, తాత్కాలికంగా ఆ పెట్టెముందు కూర్చున్నంతసేపు మరపింపజేసి, దూరంగా నెట్టి, మనసుని, వర్షం వచ్చేముందు వీచే చల్లని గాలిలో సంతోషంగా కేరింతాలుకొట్టే — చిన్నపిల్లలా — ఉక్కిరి బిక్కిరి చేసి సంతోషం, తన్మయత్వంలో ముంచి తేలుస్తుంది. ఓ నిమిషం తరువాత పెట్టెలోని బట్టలను కదిలించింది రాజ్యం. పెద్ద పిల్లలిద్దరూ బడికి పోయారు. చిన్నవాళ్లిద్దరూ వసారాలో కూర్చుని కాగితం విమానాన్ని ఎగరవేయడానికి ప్రయత్నిస్తున్నారు. కిటికీలోంచి సాయంసమయపు ఎండ రాజ్యం వీపు నిండా అలుముకొని, భుజాలమీద కూర్చొని రాజ్యంతోపాటు తనూ పెట్టెలోకి తొంగి చూడ్డానికి ప్రయత్నిస్తోంది.

లోపల పైనే ఉలెన్ సూటు ఉంది. దానిని జాగ్రత్తగా రెండు చేతులతో మడత నలగకుండా పట్టుకొని తీసి ప్రక్కన చాపమీద పెట్టింది. కోటు జేబు దగ్గర రెండు మూడు దారపు ముక్కలు అంటుకొని ఉన్నాయి. వాటిని తీసిపారేసింది. ఆ కోటుని ఇదివర కెన్నిసార్లు చూసినా మళ్లీ చూడాలనిపిస్తుందామెకి. రాజారావు ఆ సూటు ఎన్నోసార్లు ధరించలేదు. ముచ్చటగా మూడుసార్లు — అంతే! మొదటగా పెళ్లిలో. తరవాత ఓసారి సినిమాకి వెళ్లినప్పుడు. ఆఖరిసారి దీపావళి పండగనాడు మామగారింటోనూ. పెళ్లిలో విడిదింటికి పెళ్లికొడుకయి కారులో తరలివచ్చినప్పుడు ఆ సూటులో ఉన్నాడతను. అప్పుడే అతన్ని స్పష్టంగా, ఎక్కువసేపు చూపించింది రాజ్యం. పెళ్లిచూపులనాడు అతన్ని పరీక్షగా చూడ్డానికి ధైర్యం లేకపోయింది. సిగ్గు, భయం, ఖంగారు — అన్నీ కూడబలుక్కొని, కలసికట్టుగా ఎదుర్కొని, ఆ కోరికని చిత్తుగా ఓడించేసినయి. పెళ్లిరోజున కారులోంచి దిగి విడిదింటిలోకి నడుస్తున్న అతనూ, అతనితోపాటు అతగాడు ధరించిన కాఫీకలర్ సూటూ ఆమెకు నచ్చినట్లు గుర్తుగా, అప్పుడు ఆమె కళ్లు బరువుగా, అందంగా కాటుకతోసహా క్రిందకు వాలినయి.

ప్రక్కనేఉన్న ఆమె స్నేహితురాండ్రు చక్కిలిగిలి నవ్వా ఎక్కువగా మాటలతో పులకరింపజేశారు.

'యుడీసి కుర్రాడు పోజులు బాగానే పెడుతున్నాడోయ్!' అంది శైలజ.

'పాపం! మన రాజ్యం 'దాసోహం' అనేయాల్సిందే అతగాడికి తప్పదు' అంది శారద జాలిగా మొఖంపెట్టి.

'ఈవిడ మాత్రమేం తక్కువదాతల్లీ, మనం యస్సెల్సీలో ఉన్నప్పుడు ఆ సోంబాబుని తన ఇంటి చుట్టూ గానుగెద్దులా తిప్పించుకోలా?' నవ్వుతో అంది శకుంతల.

'అమ్మా! చెల్లాయ్ విమానం చింపేసింది!' పరిగెత్తుకొంటూవచ్చి అన్నాడు చిరంజీవి.

రాజ్యం జ్ఞాపకాల గూడులోనుంచి బయట పడింది.

'పోనీలే! ఇంకోటి చేసిస్తాను! నువ్వుపోయి ఆడుకో!' అంది వాడితో. చెల్లాయ్‌నేమీ కోప్పడనందుకు అసంతృప్తిగా బయటకు నడిచాడు చిరంజీవి.

పెట్లో ఓ మూల వెండి సామానుంది తన పెళ్ళినాటిదది వెండిపళ్ళెం—చెంబు—గంధపుగిన్నె—బొట్టుభరిణె—హారతిపళ్ళెం—పన్నీరుబుడ్డీ—నిండా వివాహంనాటి జ్ఞాపకాలను పులుముకొని కనబడినయి. మరోప్రక్కనుంచీ ఓ ప్లాస్టిక్ కవరు బయటకు తీసిందామె. అందులో నాలుగు రంగుల రాజారావు 'టై'లు ఉన్నయి. వివాహమయిన క్రొత్తలో చాలా రోజులు అవి కట్టుకొన్నాడు రాజారావు. రానురాను వాటివంక చూడడమే మానుకొన్నాడు. కవరుని సూటు ప్రక్కనుంచి పెట్లోంచి మూడు చీరెలు బయటకు తీసింది. వాటిల్లో బ్లూరంగుచీరంటే చాలా ఇష్టం తనకు. చీరంతా చిన్నచిన్నజరీపువ్వులు ఎంతో అందంగా అమిరినయి పెళ్ళికని తనే విమలపిన్నితో స్వయంగా సెలక్టు చేసుకొంది నూటనలభై రూపాయలు దాని ఖరీదు. ఆ విషయం గుర్తుకి రాగానే రాజ్యం గుండె ఝల్లుమంది. అంత ఖరీదుపెట్టి అప్పుడు చీర కొనగలిగింది కాని ఇప్పుడు తలుచుకొంటేనే భయమేస్తుంది.

రోజూ కట్టుకోడానికి ఓ సాదాచీర కొనాలంటేనే బ్రహ్మాండమయి పోతోంది. ఆ చీర మడత విప్పి తృప్తిగాచూసి క్రింద ఉంచింది. రెండో చీర కూడా ఖరీదయినదేగాని అదెందుకనో తననెప్పుడూ అంతగా ఆకర్షించలేదు ఎప్పుడో ఏదో శుభ కార్యానికి తప్పితే సాధారణంగా ఈ మూడు చీరలూ ఎప్పుడూ కట్టుకోదు. రెండేళ్ళక్రితం వరకూ ప్రతిసంవత్సరం తమ పెళ్ళయిన రోజుకు గుర్తుగా ఆయన కోరిక మీద బ్లూ చీర కట్టుకొనేది. ఆ రోజు ఇద్దరూ సినిమాకి వెళ్ళేవాళ్ళు. ఆ ఒక్కరోజే తమకి పర్వదినంలా గడిచేది కాని రెండేళ్ళనుంచి చేతకాని టైలరు కుట్టిన బట్టల్లా, జీవితం ఎగుడుదిగుడుగా తయారయి, ఆ గుర్తుసిక్కూడా బలవంతంగా తన అడుగున పడేసుకొంది. చకచకమంటూ ఎదిగిపోతున్న పిల్లల్లా, వాళ్ళనాసుకొని, పంతంకట్టి, ధీమాగా కొండల్లా పెరిగిపోయిన ధరలూ, వాటితో పాటు ఎదగలేక బిక్కమొగం వేసుకొని, ఆశగా చూస్తూ నిలబడిపోయిన భర్త జీతం—ఇవన్నీ—తీయని గతాన్నీ—ఆశలు నింపుకొన్న భవిష్యత్తునీ దరిదాపులకు రాకుండా తరిమి, మనస్సును కలవరపరచి, ఉక్కిరిబిక్కిరయే ప్రస్తుతాన్ని ముందుకు నెడుతూంటాయి. గోడకు ఉన్న పాత గడియారం నీరసంగా అయిదు గంటలు కొట్టింది కంగారుగా గడియారంవంక చూసింది రాజ్యం.

'అయ్యో! అయిదయిపోయింది. ఆయన వొచ్చేస్తారిక. తనింతవరకూ కదలనే లేదు.'

ఓ చీరను బయటే ఉంచి మిగతా సామానంతా పెట్లోకి సర్దేసి, పెట్టె మంచం క్రిందకు తోసి హడావుడిగా హాల్లోకి నడిచిందామె. చంటిది అక్కడే కూర్చుని ఓ చెక్క బొమ్మని నేలకేసి కొడుతూ శాయశక్తులా విరగ్గొట్టటానికి ప్రయత్నిస్తోంది. కాగితం మీద 'అ ఆ'లు వ్రాస్తున్న చిరంజీవినీ, ఆ పిల్లనూ బాత్‌రూంలోకి తీసుకుపోయి అయిదు నిముషాల్లో స్నానం చేయించేసింది. బలవంతంగా స్నానం చేయించినందుకు నిరసనగా, కొంపలంటుకు పోయినట్లు ఏడ్చేస్తోంది ఆ పిల్ల. ఏడుపు పట్టించుకోకుండానే, తుండుతో వళ్ళు తుడిచేసి, ఇద్దరకూ ఉతికిన బట్టలు వేసేసి చాపమీద కూర్చోబెట్టింది. ఈ లోగా స్కూలునుంచి పెద్దవాళ్ళిద్దరూ వచ్చేశారు.

'త్వరగా స్నానాలు కానియ్యండర్రా! నాన్నారి ఆఫీసులో డ్రామాలకెళ్దాం!' అంది తను వంటింట్లోకి నడుస్తూ.

రమ, శాంత నేను ముందంటే నేను ముందని పందాలేసుకొని బాత్‌రూంలోకి పరిగెత్తారు. వాళ్ళిద్దరూ స్నానం ముగించేసరికి తను కాఫీ తయారు

చేసేసింది రాజ్యం. వాళ్లకు కాఫీలిచ్చి తను త్రాగి భర్తకు ఫ్లాస్కులో పోసి ఉంచింది ఇదంతా గడిచే సరికి ఐదున్నర అయిపోయింది. కొద్దిగా భయం వేసింది రాజ్యానికి.

'ఆయన ఈ పాటికి వస్తూనే ఉంటారు! అయిదున్నరకల్లా అందర్నీ రెడీగా ఉండమని మరీ మరీ చెప్పివెళ్లారు. ఆరున్నరకే ప్రోగ్రామ్ మొదలట.'

స్నానం ముగించేసి చీర కట్టుకొంటూ ఉండగా రాజారావు వచ్చాడు. అతన్ని చూసి తనింకా 'రెడీ' అవనందుకు ఏమీ అనలేక నవ్వేసింది రాజ్యం.

'నాకు తెలుసు నువ్వింత ఘటికురాలివేనని. నిన్ననికూడా సంభ్రమంలేదులే! మీ ఆడజాతి అలాంటిది!' అనూ నవ్వుతూ అన్నాడు రాజారావు.

'నాకేం ఆలస్యం లేదు. అయిదు నిముషాల్లో బయల్దేరగలను. మీరీలోపల కాఫీ త్రాగండి! ఫ్లాస్కులో ఉంది!' అందామె.

అంతా బయల్దేరేసరికి ఇంటిదగ్గరే ఆరున్నర అయిపోయింది. అడ్డదోవవెంబడి నడిచి పది నిమిషాల్లోనే కలక్టరాఫీసుకి చేరుకొన్నారు. ఓపెన్ఎయిర్ థియేటరుదగ్గర చాలా హడావుడిగా ఉంది బయట బోలెడు కార్లు ఆగిఉన్నాయి అప్పటికే ఫంక్షన్ బిగినయిపోయింది. కొద్దిగా రాజ్యంమీద విసుక్కొన్నాడు రాజారావు.

'అసహ్యంగాలేదూ, మన మిలా రావడం?' అన్నాడు ఆమెనింక చూడకుండానే

వెనుక ఖాళీగాఉన్న కుర్చీల్లో కూర్చున్నా రందరూ. మైకు ముందునుంచుని ఒకాతను ఏదో ఇంగ్లీషులో చదువుతున్నాడు. స్టేజిమీద కుర్చీల్లో కూర్చున్నవారివంక చూపిస్తూ 'ఆ సూటు వేసుకొని కూర్చున్నాయనే కలక్టరుగారు' అన్నాడు రాజారావు భార్యతో. రాజ్యం కలెక్టరుగారివంక చూసింది. ఆయన ఓ మహాశిలాశాసక దేముడిలా అనిపించిం దామెకి. నల్లనిసూటులో తెల్లగా మెరిసిపోతున్నాడు. వెనుక చేతులుకట్టుకొని అతివినయంగా నిలబడ్డ చిన్నఆఫీసర్లతో ఏదో మాట్లాడుతూ అప్పుడప్పుడూ చిఱునవ్వు నవ్వుతున్నారు. ఆయనప్రక్కన అంత అందంగానూ, ధీమాగానూ ఆయన సతీమణి కూర్చుని ఉంది. ఆమె సన్నగానూ,-నాజూగ్గానూ, తెల్లగానూ ఉంది. చాలా సింపుల్గా ఉంది. ఆమె చెవులకు మెఱపుల్లా మెరుస్తోన్న దిద్దులున్నాయి. చెవులను కప్పేస్తూ నల్లనిజుట్టుఉంది. చేతికి చిన్నవజ్రమంత బంగారపురంగు గడియారం ఉంది: ఒకోచేతికి ఒకోబంగారపు గాజుంది. పెదాలను తెలియజేస్తూ ఏదో లిప్స్టిక్ ఉంది. మొఖం గులాబీరంగుగా ఉంది చేతులు కరువయిపోయిన అదేరంగు జాకెట్టుమీద సన్నగా ప్రాకి భుజంమీదనుంచి వెనుకకు తిరిగి అంతమయి పోయింది గులాబీరంగు సిల్కుచీర.

పరీక్షగా ఆమెనే చూస్తోంది రాజ్యం. ఎక్కడో, ఎప్పుడో చూసినట్టున్న ఆమె ముఖం రాజ్యాన్ని ఇరకాటంలో పెట్టింది. ఎక్కడ? ఎప్పుడు? ఆలోచిస్తోంది రాజ్యం. మరోసారి ఆమె ముఖంలోకి చూసింది. ఆ కళ్లు—నవ్వుతోన్న ఆ కళ్లు—ఖచ్చితంగా తనకు పరిచయమున్నవే! గతంలో జ్ఞాపకాల టార్చిలైటువేసి వెతుకుతోంది రాజ్యం—పెళ్లికి ముందు హైస్కూల్లో చదివేప్పుడు—యస్సెల్సీ క్లాసులో—అవును ఆమె ఎవరో కాదు. యస్సెల్సీలో తన క్లాసుమేటు జగదాంబ.

జమీందారుగారమ్మాయి. ఆ సంవత్సరమే మరో ఊర్నుంచివచ్చి తమ స్కూలులో చేరింది.

తనతో బాగా పరిచయంఉంది కూడానూ.

చప్పట్లు మార్మ్రోగినయి. ఉలిక్కిపడి ఈ లోకంలోకి వచ్చిపడింది రాజ్యం.

జగదాంబ లేచి నుంచుంది. ఆవిడముందు టేబుల్మీద రకరకాల పాకెట్లు ఉంచబడినయి.

'ఆటల్లో గెలిచినవాళ్లకి ఆవిడ ఇస్తుంది బహుమతులు' అన్నాడు రాజారావు.

మైకులో పేర్లు వినబడుతున్నయి. ఒక్కొక్కరే వచ్చి హర్షధ్వానాలమధ్య బహుమతి అందుకొని వెళ్ల

సాగేరు. వాళ్ళ నమస్కారాలను చిఱునవ్వుతో అందుకొంటోందామె. మైకులో రాజారావుపేరు వినబడింది. లేచి ముందుకువెళ్ళి బహుమతి తీసుకొని తిరిగివచ్చాడు అతను. 'చెన్'ఆటలో రెండో బహుమతి వచ్చిందతనికి పిల్లలు అతను తెచ్చిన ఎయిర్‌బాగ్‌ని ఆనందంగా చూస్తున్నారు.

రాజ్యానికి ఓ వింత ఆనందంగా ఉంది.

'తన భర్త కధికారిణయిన కలెక్టరుగారి భార్య ఒకప్పుడు తనకి క్లాసుమేటు. ఆ సంగతి అతనికి తెలియజేసేవరకూ ఉండలేకపోయిందామె.'

'ఏమండీ! ఆవిడ...యస్సెల్సీలో నా 'క్లాసు మేట్'అండీ' మెల్లగా అంది.

రాజారావు తన ముందు కూర్చున్న మిగతా గుమాస్తాల భార్యలవంక చూస్తూ 'ఎవరూ?' అనడిగాడు.

'నేను చెప్పేది కలెక్టరుగారి భార్య సంగతి!'

'ఆ!' అదిరిపోయాడు రాజారావు.

'అవునండీ! పేరు జగదాంబ మా బెంచీలోనే కూర్చునేది. అప్పుడప్పుడు వాళ్ళ కారులో తిరిగే వాళ్ళం కూడానూ!'

రాజారావు గుండెలు కాసేపు దడదడ కొట్టుకొన్నాయి. 'ఆమె రాజ్యం క్లాస్‌మేటా?' రాజ్యం అతనివంకే చూస్తూ, గొప్పగా నవ్వుతోంది. అప్పుడు ఆమె అతనికి తన భార్యలాకాకుండా ఓ పెద్దింటి ఆడపడుచులా వరాలిచ్చేస్తున్న దేవతలా కనబడింది.

ఓ యుడీసీగాడి జీవితంలోకి చొచ్చుకొచ్చేసి, వాడితో కలసిపోయి, సుఖాలూ, దుఃఖాలూ, సగానికి పంచేసుకొని, పది సంవత్సరాల సంసారాన్ని ఈదుకొచ్చేస్తున్న రాజ్యానికి అంతగొప్పస్నేహితురాలుందా?

బహుమతు లివ్వటం పూర్తయిపోయింది ఓచిన్నహాస్యనాటిక ప్రదర్శన మొదలయింది. జనమంతా హోరున ఘోష పెట్టేస్తూ విరగబడి నవ్వేస్తున్నారు. వాళ్ళతోపాటు రాజ్యం, పిల్లలూ అందరూ నవ్వుతున్నారు. కాని రాజారావు కేమీ కనిపించటంలేదు, వినిపించటంలేదు. అతనిని ఆలోచనలు ముసుగులా క్రమ్మేసినయి. నాలుగు పొడవయిన కొమ్మలున్న చెట్టెక్కి నలుగురూ తలో కొమ్మా పంచుకొని చివరికంటా బయల్దేరిన రాజకుమారుల్లా, అతని ఆలోచనలు, కలక్టరుభార్య రాజ్యానికి క్లాస్‌మేటవడంమూలాన లభించబోయే అవకాశాలను చివరికంటా వెళ్ళిచూచి తిరిగి వచ్చేస్తున్నయి

జనగణమన పాడుతోన్నప్పుడు అందరూ లేచి నుంచొంటుంటే తను ఉలిక్కిపడి లేచి నుంచున్నాడు రాజారావు. అందరూ ఇళ్ళకు తిరుగు ముఖం పట్టేరు.

భోజనాలు ముగించి గదిలో మంచంమీద పడుకొన్నాడు రాజారావు. పిల్లలందరూ హాల్లో పడుకొని తాము చూచిన నాటిక గురించి ఒకళ్ల మాటలు మరొకరు వినిపించుకోకుండా మాట్లాడేస్తున్నారు. పడకొండయేసరికి ఒకళ్ళొకళ్ళే అందరూ నిద్రపోయారు. రాజారావు ఇంకా ఆలోచిస్తూనే ఉన్నాడప్పటికి. గదిలో బెడ్‌లైటు అవసానదశలో ఉన్నట్లు వెలుగుతోంది. ప్రక్కనే నిద్రలోకి జారుతున్న రాజ్యం వంక చూశాడతను. ఓ క్షణమాగి మెల్లగా 'రాజ్యం' అని పిలచాడు.

'ఊఁ' అంది రాజ్యం నిద్రమత్తుతో.

'నిద్రవస్తోందా?'

'ఊఁ! ఏం కావాలి?' బలవంతంగా కళ్ళు తెరచి అతనివంక చూస్తూ అడిగిందామె.

జవాబేమీ చెప్పకుండా ఆమెవంకే కాసేపు చూశాడతను.

'ఏమిటలా చూస్తున్నారు!' నవ్వుతూ అడిగిందామె.

'కలెక్టరుగారిభార్య నీకు ఫ్రెండన్నావుకదూ?'

'బావుందండీ! ఇంత అర్ధరాత్రప్పుడు అడుగుతున్నారా?' అంది పరిహాసంగా.

'ఆవిడ నీతో బాగా మెలిగేది? ప్రాణస్నేహితురాలేనా?'

'ఆ! మరీ అంత ప్రాణమేం కాదుగాని, ఫరవా లేదు. చనువుగానే ఉండేది. అయినా ఇప్పుడెందు కొచ్చిందా అనుమానం?'

రాజారావు చిన్నగా నవ్వేడు 'అవసరం వచ్చింది.'

'ఏమిటది?' ఆశ్చర్యంగా అడిగింది రాజ్యం. ఆమెకు నిద్రమత్తంతా వదిలిపోయింది

'నువ్వోసారి వాళ్ళింటికి వెళ్ళాలి?'

'ఎందుకూ?'

'మీ క్లాస్‌మేటన్నావు గదా! మామూలుగా కలుసుకోకూడదా?'

'బావుంది! మా ఇద్దరికీ లేని బెంగ మీకు పట్టుకొందే పాపం!'

'అది కాదు రాజ్యం! నువ్వు ఆవిడతో చెప్పి కలెక్టరుగారికి రికమెండ్ చేయిస్తే నాకు ప్రమోషన్ దొరికిపోతుంది. లేపోతే ఈ పెరిగే ఖర్చుతో మన సంసారం అధోగతి పాలవుతుందేమో భయంగా ఉంది పైన మనవాడెవ్వడూ లేపోవటంవల్ల నాకంటె జూనియర్లు కూడా ప్రమోషన్ సంపాదించేశారు. ఇప్పుడీ అవకాశం మనం ఉపయోగించుకోంటే తప్పేముంది? కలెక్టరుగారికి బోర్డులో కూడా మంచి ఇన్‌ఫ్లూయెన్స్ ఉందిట.

ఈ ఆలోచన ఆమె కుకూడా బాగానే ఉన్నట్లు తోచింది కాని ఇదంతా అనుకొన్నట్లు జరుగుతుందా అనే అనుమానం ఆమెని పీడించసాగింది. జగదాంబ కొంచెం గర్విష్టి అనే చెప్పుకోవాలి తనూ, శైలజా, శారదా అందరూ చాలసార్లు ఆ విషయం గురించి మాట్లాడుకొనే వాళ్ళు. తామందరూ మధ్యతరగతి వాళ్ళు, అంచేత తమలేమిని మాటల్లో, ఏదో విషయంలో పైకిలాగి చూపిస్తూండేది జగదాంబ. అందుకని ఎంత స్నేహంగా ఉన్నా ఆమె అంటే ఎవరికీ ఇష్టంగా ఉండేదికాదు ఇప్పుడు తను ఆవిడ దగ్గరకు భర్త గురించివెళ్తే ఆవిడ తనని తేలికచేసి మాట్లాడినా, సహించగలగాలి అందుకు తనకి బోలెడు ఓర్పుకావాలి ఆవిడ మాట్లాడే ప్రతిమాటా నిజమే అనాలి తన వ్యక్తిత్వాన్ని ఆ కాసేపు చంపేసుకోవాలి? ఇది సాధ్యమేనా?

'ఏమిటాలోచిస్తున్నావ్? పోనీ, ఇష్టంలేపోతే వెళ్ళొద్దులే!' రాజారావు ఆమె కళ్ళల్లోకి చూస్తూ మెల్లగా అన్నాడు.

'అబ్బే! ఇష్టం లేపోటాని కేముందనీ! వెళ్తాను!' అతని కనుమానం రాకుండా ఉండటానికి వెంటనే జవాబిచ్చిందామె. భర్తకి కనీసం ఈమాత్ర మయినా సహాయం చేయలేకపోతే తనింకా ఆయన కోసం చేయగలిగిం దేముందనీ!

'ఎప్పుడు వెళ్ళమంటారు?' కాసేపాగి అడిగింది రాజ్యం.

'నీ యిష్టం! ఎంత త్వరగావెళ్తే అంత మంచిది. పోనీ రేపే వెళ్ళరాదూ. ఆదివారం కూడనూ!'

'అలాగే! ప్రొద్దున్నే వెళ్ళొచ్చేస్తాను!' అందామె. ఆ తరువాతకూడా ఏవేవో ఆలోచనలతో ఇద్దరకూ ఆలస్యంగా నిద్రపట్టింది.

చాలా త్వరగా తెల్లారిం దా రోజు. ఉదయం నుంచీ రాజారావు రాజ్యాన్ని తొందరపెడుతూనే ఉన్నాడు. ఆమెకి అన్నిపనుల్లోనూ సాయం చేస్తున్నాడు.

'వంటపని వచ్చి చూసుకోవచ్చులే! అంతగ్గాక పోతే ఓ పూట కారియర్ తీసుకొస్తాను. ముందు నువ్ కాఫీ టిఫిన్ ముగించి రెడీ అవ్!' అంటూ పురమాయించాడు. అలాగే వప్పుకొని ఎనిమిదిన్నర కల్లా తయారయిపోయింది రాజ్యం. పెళ్ళిలో ఎవరో ప్రజంట్ చేసిన ఓ చక్కని మనీపర్స్ తీసి బయట పెట్టింది.

'అందులో ఏమయినా చిల్లరుంచండి రిక్షా వాడికి...' అందతనితో.

'రిక్షా ఎందుకు, కనకం గాడిని జట్కా తీసుకు రమ్మన్నాను. వాడయితే ఎంతసేపయినా గొణక్కుండా బయట కూర్చొని నిన్ను మళ్ళీ తీసుకొచ్చేస్తాడు...' తనదగ్గరున్న ఆఖరి రెండ్రూపాయలూ పర్సులో ఉంచుతూ అన్నాడతను. ఆమె

మరికొంత చిల్లర ప్రోగుచేసి పర్సులో వేసుకొంది. కనకం జట్కాబండీ వచ్చేసరికి తొమ్మిదయిపోయింది. అంతలోపల రాజారావు నాలుగుసార్లు బండికోసం పిల్లల్ని పరుగులెత్తించేడు.

బండెక్కబోతూ 'అరె. చెప్పులు బాగాలేవండీ, అతుకు అసహ్యంగా కనబడుతోంది. ప్రక్కింటి వదినెగారినడిగి వేసుకొస్తానుండండి!' అంటూ వాటిని లోపలకు విసిరేసి ప్రక్కింట్లోకి నడిచింది.

'అబ్బ! ఇంకా ఆలస్యంచేయకు. పది దాటి వాళ్ళింటికి వెళ్ళటం అంత బావుండదు...' అన్నాడతను. ప్రక్కింటి వదినగారి చెప్పులేసుకొని తిరిగి వచ్చింది రాజ్యం.

'మీ కెప్పట్నుంచో చెపుతున్నాను ఒక్కజత చెప్పులు కొనండీఅని' వింటేనా? అసహ్యంగా చెప్పులు కూడా అడుక్కోవాల్సివచ్చింది......'విసుక్కొంటూ బండి ఎక్కింది రాజ్యం పిల్లలు అందరూవచ్చి బండివగ్గర నుంచున్నారు. చంటిది ఏడుపు మొదలు పెట్టింది తననుకూడా తీసుకువెళ్ళమంటూ.

'వెళ్తానండీ!'అంది రాజ్యం. బండి కదిలింది.

'వెళ్ళిరా!' అన్నాడు రాజారావు 'విష్ యూ బెస్ట్ ఆఫ్ ది లక్' అనుకొన్నాడు మనసులో. లోపలకి పిల్లలందరినీ తీసుకొచ్చాడు.

'చాక్లెట్లు కొనుక్కొచ్చి దానికి తినిపించండే! ఇల్లెగిరిపోయేట్లుంది దీని ఏడుపుతో!' అన్నాడు పెద్దపిల్లకి పావలా ఇస్తూ. అతనికి చాలా సంతోషంగా ఉందప్పుడు. తనని తప్పకుండా అదృష్టదేవత వరిస్తుం దిహాను. రాజ్యం జగదాంబ మంచి ఫ్రెండ్స్. పదేళ్ళతరువాత కనబడి ఓ సహాయంచేయమని ఒకప్పటి క్లాస్‌మేట్, మంచిస్నేహితురాలూ అడుగుతోంటే ఎవరు కాదనగలరు? తప్పక అంగీకరిస్తుంది భర్తతో చెప్తుంది. కలెక్టరు మామూలు రూల్సుప్రకారం భార్యమాట వినితీరతాడు వినేసి మళ్ళీ తనపైన వాళ్ళకి వినిపిస్తాడు. వాళ్ళు వెంటనే ఆర్డర్స్ పంపిస్తారు అంతే! ఓసారి తను ఆ మెట్టు ఎక్కాడంటే మెల్లమెల్లగా మెట్లన్నీ ఎక్కెయొచ్చు

'రాజారావ్.'

బయటనుంచి ఎవరిదో గొంతు వినిపించింది. లేచి బయటికొచ్చాడు రాజారావు చంద్రశేఖర్ నిలబడి ఉన్నాడక్కడ అతని చేతిలో కాయితాలసంచి ఉంది.

'రావోయ్ లోపలకు!' అన్నాడు రాజారావు.

అతను లోపలికొచ్చి కూర్చున్నాడు చంద్రశేఖర్, రాజారావు చాలాకాలం సెటిల్‌మెంటులో కలసి పనిచేశారు. ఆ డిపార్ట్‌మెంటు తీసేసింతర్వాత చెరో డిపార్టుమెంటుకి బదిలీ అయిపోయారు. మాటల్లో అతను అడిగాడు, 'ఎప్పుడోయ్, నీ ప్రమోషన్ మాటేమిటి! ఈసారి లిస్టులోనయినా నీ పేరు ఉంటుందా?'

'ఆ సారి రావాలనే అనుకొంటున్నాను. నమ్మకం ఉంది!' అన్నాడు రాజారావు

'ఏం? హైద్రాబాద్‌పోయి ఏమయినా ప్రసాదం పంచేవేమిటి?' నవ్వుతూ అన్నాడు చంద్రశేఖరం.

'ఏం అక్కర్లేదు! అడ్డమయిన వాడూ రికమండేషన్లు పెట్టేసి దూకేస్తుండగాలేంది, ఇక నేనేమిటి ఊరుకొనేది? ఇన్నాళ్ళూ ఇష్టంలేగ్గాని లేపోతే నేనూ ఎప్పుడో తగిలించేవాణ్ణి, కానీ ఎన్నాళ్ళూరుకోవటం. జూనియర్‌గాళ్ళందరూ మనని ప్రక్కకినెట్టి పరిగెత్తుకుపోతున్నారు. నేను తల్చుకొంటే వాళ్ళ బాబుల్లాంటి రికమండేషన్లు పుట్టించగలను. అందుకా ఎందుకూ? సమషాల్లో కలెక్టరుగారు నా గురించి ట్రంక్‌కాల్లో బోర్డుకి రికమెండ్ చేసేటు చేయగలను'

'మన కలెక్టరుగారితోనా?' ఆశ్చర్యంగా అడిగాడతను.

'అవును పెద్ద గొప్పేముందని! ఆయన భార్యా, నా భార్యా హైస్కూల్లో క్లాస్‌మేట్స్. ఒకరికొకరు ప్రాణం పెట్టేసుకొనేంత స్నేహం...'

కాసేపాగి 'నేనిక వెళ్తాను' అని వెళ్లిపోయాడు చంద్రశేఖరం.

రాజారావు ఇంకా రాజ్యం గురించి ఆలోచిస్తూండగానే రాజ్యం జట్కాలో కలెక్టరుగారిల్లు చేరుకొంది. బండి దిగి కొంచెం బెరుగ్గానే భవనం వేపుకి నడిచింది. అది మొదటిసారి ఆ భవనానికి రావడం. అదీ ఒకర్తి—ఎప్పుడూ పాండురంగడి గుడికి వెళ్తూ రోడ్డుమీదనుంచి చూడ్డమే! ఓ కుక్క వెనుక పూలతోటలోనుంచి మొరుగుతోంది.

'ఎవరు కావాలమ్మా!' ప్యూన్ ఆమె దగ్గరకొచ్చి అడిగాడు వినయంగా.

'కలెక్టరుగారి భార్యను కలుసుకోవాలి!'

'రండి!' అంటూ లోపలకు నడిచాడతను ఓ గదిలోకి నడిచి 'ఇక్కడ కూర్చోండి! ఇప్పుడే అమ్మగారికి చెప్పివస్తాను. తమరెవరని అడిగితే ఏం చెప్పాలి?' అన్నాడు సంశయంగా.

'రాజ్యం వచ్చిందని చెప్పు. ఆవిడ గ్రహిస్తుందిలే!'

అతను లోపలికెళ్లాడు. అక్కడ ఖాళీగా ఉన్న ఓ కుర్చీలో కూర్చుంది రాజ్యం. 'విజిటర్స్' అని వ్రాసిన బోర్డు ఉందా గదిముందు. రెండు నిముషాల తరువాత ప్యూను తిరిగివచ్చాడు

'అమ్మగారు రమ్మంటున్నారు!' ముందుకి దారితీశాడతను. రాజ్యం అతన్ని అనుసరించింది లోపల పెద్ద హాలు. చాలా అందంగా అలంకరించబడి వుంది. ఖరీదయిన ఫర్నిచరూ, గోడలకు మెరుస్తోన్న ఇంగ్లీష్ రంగులూ—క్రింద ఎర్రని తివాచీ—కళ్లు చెదురుతున్నాయి.

మధ్యలో ఓ సోఫాలో కూర్చుని ఉంది జగదాంబ. ఏదో ఇంగ్లీష్ నవల చదువుతోంది పుస్తకం ప్రక్కనపెట్టి రాజ్యం వంక పరీక్షగా చూసిందామె. రాజ్యం ఆమె వంక చూసి చిన్నగా నవ్వింది.

'గుర్తు పట్టలేదా జగదాంబా!' అంది దగ్గరగా నడిచి మందహాసంతో.

'నువ్వా! చంపేశావ్! రాజ్యం అంటే ఎవరా అని ఆలోచిస్తున్నాను. బావుంది. కూర్చో ... అలా నిలబడిపోయావేం? ఇప్పుడెక్కడ ఉండటం? ఏమిటి? ...హైస్కూలు వదిలిం తర్వాత మనం ఇదే కలుసుకోవటమనుకొంటాను. ఫిఫ్టీ ఎయిట్ మార్చికివెళ్లాం మనం. అంటే అప్పుడే పదకొండేళ్లయిపోయిందన్న మాట...తమాషాగా లేదూ?'

ఉత్సాహంగా అందామె.

రాజ్యం గట్టిగా నవ్వేసింది. 'అవును! ఆశ్చర్యంగా వుంది. రోజులంత త్వరగా ఎలా గడిచినయ్యో తలుచుకొంటే!'.

'నీ పేరే మర్చిపోయానసలు. ప్యూను వచ్చి ఎవరో ఒకామె మీ కోసం వచ్చారని చెబితే, బహుశా ఏ ధర్మం కోసమో, విరాళంకోసమో వచ్చి ఉంటారనుకొన్నాను ఎందుకంటే ఎప్పుడూ ఎవ్వంొకళ్లు అందుకు తయారవుతుంటారు పెద్ద హెడేక్ అయిపోయిందనుకో!'.

రాజ్యం ఉక్కిరిబిక్కిరయింది ఆ మాటలు తననుద్దేశించి అనకపోయినా తనని ఎద్దేవాచేసినట్లు అనిపిస్తోన్నాయి.

'ఇది చాలనట్లు మొన్న ఆయన ఆఫీసులో పనిచేసే ఓ గుమాస్తా ఏదో తప్పుచేసి దొంకిపోయాట్ట. అతనిమీద ఏక్షన్ తీసుకోవద్దని అతని భార్య ఒక్కడికొచ్చి నా కాళ్ళమీద పడిపోయింది. వదిలించు కొనేప్పటికి ప్రాణంమీదకొచ్చిందనుకో!'

ఫ్యూన్ ఇద్దరకూ రెండు గ్లాసుల్లో కూల్ డ్రింకులు తీసుకొచ్చి ఇచ్చేడు.

రాజ్యానికి ఆమె మాటలు వింటోంటే కంపర మెత్తినట్లుంది. 'రాకుండా ఉండాల్సింది' అని అప్పటి కప్పుడే నాలుగయిదుసార్లు అనుకొంది.

'మీ ఆయనేం చేస్తారూ...ఎక్కడో గుమాస్తా అని నీ పెళ్ళప్పుడు ఎవరో చెప్పారు! కదూ?'.

'రాజ్యానికి ఆమె ప్రశ్న తల కొట్టేసినట్లని పించింది. గుమాస్తా అంటే జగదాంబ దృష్టిలో అతి దారుణమయిన చిన్న ఉద్యోగంలా కన్పిస్తోంది. కొద్దిగా ఉక్రోషం వచ్చిందామెకి కాని తమాయించు కొని ఏమీ జవాబివ్వకుండానే ఊరుకుండిపోయింది.

'ఆ డ్రింక్ తీసుకో! బిస్కెట్సు అయిపోయి నట్లున్నాయి. ఏదీ, గెస్ట్సు బాగా ఎక్కువయి పోయారు. నెలకు మూడొందలు అతిథులకే ఖర్చవు తుంది మాకు. పాపం తక్కువ జీతాలు తీసుకొనే మిగతావాళ్ళలా గడుపుకొంటున్నారో అర్థం కాదు నాకు వాళ్ళ కిలాంటి ఖర్చులేమీ బహుశా ఉండవేమో కదూ'

ఏమీ జవాబివ్వలేదు రాజ్యం. చిరునవ్వు నవ్వి ఊరుకొంది.

'నాకివ్వాళేమీ వద్దు!' అంది డ్రింక్ తీసుకో కుండానే.

'ఫరవాలేదు. ఎండలోపడి వచ్చావు. చల్లగా వుంటుంది ఫ్రిజిరేటర్‌లో ఉంచిందది. ఇంత చల్లగా ఎప్పుడూ తాగి ఉండవు! పాపం! మీ లాంటి మీ లాంటివాళ్ళకెలా గడుస్తోందో కాని, రిఫ్రిజరేటర్ లేకపోతే మా యింట్లో ఒక్కరోజయినా గడవదేమో అనిపిస్తుంది.'

'మా ఇంట్లోనూ ఉందది!' అంది రాజ్యం అకస్మాత్తుగా, అనాలోచితంగా.

జగదాంబ ఆశ్చర్యపోయింది 'అలాగా!... అవును...లేపోతే చాలా కష్టం మరి...' అంటూ సర్దుకొంది.

రాజ్యానికి కాసేపటివరకూ గుండెలు వేగంగా కొట్టుకొన్నాయి. తక్కున ఎలా అబద్ధం చెప్పగలిగిందో ఆశ్చర్యంగా ఉంది. కానీ తన జవాబుని తన మనసు హర్షిస్తోంది.

జగదాంబని సరయినచోట దెబ్బకొట్టింది తను. ఇక వదలగూడదు. తనెందుకు చిన్నచూపు చూడ బడాలి? ఆమే స్త్రీయే! తనూ స్త్రీయే! ఆమె గొప్పదయినంతమాత్రాన ఎదుటివాళ్ళను కించపరచా లని ఎక్కడుంది? తనకీమాత్రం వ్యక్తిత్వంలేదూ?

'పొద్దుట్నుంచీ ఏమీ తోచటంలేదనుకో! ఆయన ఆఫీసు జీపు చెడిపోయిందని మా కారులో కాంపుకి వెళ్ళిపోయారు. కారు లేపోతే ఎక్కడికి వెళ్ళ టానికీ కుదరదు...కట్టేసినట్లుంది!' కాసేపాగి అంది జగదాంబ.

'అలాగా! మావారు కారు ఎప్పుడూ నాకోసం వదిలివెళ్తారు. అసలాయనకి కారు అవసరమేలేదు. నెలకి నాలుగయిదుసార్లు ప్లేనులోనే బొంబే వెళ్తారు.........' జగదాంబ దెబ్బతిన్నట్లు రాజ్యం వంక చూసింది.

'ఇంతకూ మీవారేం చేస్తారో చెప్పావుకాదు!' అంది నెమ్మదిగా.

'బొంబేలో పెద్ద బట్టలమిల్లులో షేర్లున్నాయి ఆయనకి. ఆ బిజినెస్ చూస్తూంటారుకూడా! వచ్చే నెలలో కంపెనీ ఖర్చుమీదే మేము అమెరికా వెళ్తున్నాం!'

ఓ నవలలోచదివిన సంఘటనలు గుర్తుతెచ్చు కొంటూఅంది రాజ్యం.

'ఆ!' విచిత్రంగా నమ్మలేనట్లు చూసింది జగదాంబ.

రాజ్యానికి నవ్వు వచ్చింది. చాలా గర్వంకూడా కలిగింది

'ఈ విజయం చాలు తనకు! మరోసారి ఎవ్వరినీ కించపరచటానికి జగదాంబ సాహసించదు.'

'ఆ మధ్యనో రోజు నేనూ మావారూ కారులో గుడికి వెళ్తూంటే నువ్వు మీ బంగాళాముందు నుంచునిఉండటం చూశాను. దూరాన్నుంచే నిన్ను గుర్తుపట్టాను. అప్పుడే తెలిసింది నాకు నువ్విక్కడున్నట్లు. తరువాత ఒకటిరెండుసార్లు మీ శ్రీవారు మా ఆయనదగ్గరకొచ్చారట ఏదో పనుండి మావారికి కేంద్రమంత్రులందరితో మంచిపరిచయం ఉందిలే. అందుకని చాలామంది వచ్చిపోతూంటారు మా యింటికి...........'

జగదాంబకు మాటలు రావడంలేదు. ఆమె మొఖం వాడిపోయింది.

'మరి నువ్వు క్లబ్బులో చేరలేదా?' అడిగింది.

'ఛ! అలాంటివి మావారి కిష్టముండదు సరే! ఇక నేను వెళ్తాను! మా యింటికోసారి రా నువ్వు! కారు పంపుతాను రేపో ఎల్లుండో! వీలయితే మీ శ్రీవారిని కూడా తీసుకురా! అందరం మా ఎస్టేట్స్‌కి వెళ్దాం! పిక్నిక్ ఏర్పాటుచేస్తాను. ఆఫీసు ఫైళ్ళలో మునిగి తేలే మీ వారికి కొంచెం రిలీఫ్‌గా కూడా ఉంటుంది!'. బయటకు నడిచింది రాజ్యం జగదాంబ ఆమెతోపాటు బయటకు వచ్చింది. ఆమె ముఖంలో కత్తివాటుకి నెత్తురు చుక్కలేదు.

'కారులో రాలేదా?' చుట్టూ చూస్తూ అడిగింది జగదాంబ.

'ఊహు! లేదు. కారులో అమ్మాయి వాళ్ళ ఫ్రెండింటికి వెళ్ళింది. దగ్గరేగదాని మా గుఱ్ఱబ్బండిలో వచ్చేశాను. అది మా సొంతబండే! బోలెడు మంది అతిథులొస్తుంటారుగదా, వాళ్ళకి పని కొస్తుందని కొనిపడేశారు ఆయన...'

బండి ఎక్కి కూర్చుందామె వెంటనే ముందుకి కదిలింది బండి

'వెళ్తాను! కారు పంపించగానే తప్పకుండా రా!' అంది రాజ్యం.

జగదాంబ విసురుగా వెనక్కు తిరిగి లోపలకు నడిచింది.

బండిలో కూర్చుని కాసేపటివరకూ మామూలు మనిషి కాలేక పోయింది రాజ్యం. తను ఇక్కడకు వచ్చిన కారణమేమిటో, తనుచేసిన పని ఏమిటో తలుచుకొంటే దుఃఖం ఆగలేదామెకి. క్షణికావేశంలో జగదాంబను జయించటానికి, చిత్తుచేసేయడానికీ, గొప్పలు సగర్వంగా చెప్పింది తను. తను ఎన్నడూ, కనీ వినీ ఎరుగని విషయాల గురించి అనుభవంలో ఉన్నట్లు మాట్లాడింది. జగదాంబను చిన్నబుచ్చింది. అక్కడితో ఆగక ఆమె భర్తనుకూడా పరోక్షంగా అవమాన పరచింది.

బండి ఆమె ఇంటిముందాగింది దిగి బండి అతనికి డబ్బులిచ్చిలోనికి వడివడిగా నడిచింది రాజ్యం. రాజారావు గడపలోనే ఆమెకోసం ఆతృతగా ఎదురు చూస్తూ నుంచున్నాడు.

'ఏమయింది?...' నవ్వుతూ అడిగాడతను.

అతనితో ఏమీ మాట్లాడకుండానే గదిలోకి నడిచిందామె. ఆమె వెనుకే అతనూ వెళ్ళాడు.

'విశేషాలు చెప్పు...' దగ్గరగా వెళ్ళి అడిగాడు.

అతని గుండెలమీద వాలిపోయి వెక్కివెక్కి ఏడవటం మొదలు పెట్టింది రాజ్యం రాజారావు ఈ హఠాత్పరిణామానికి విస్మయపోయాడు

'వద్దండీ! ఇంకెప్పుడూ ఎక్కడికీ వెళ్ళను నేను. మనకి ఎవరి సహాయమూ అక్కర్లేదు భగవంతుడు మనకి తోడుంటే చాలు. మనకి తిండికి కరువయినా ఫరవాలేదు. కాని మిమ్మల్ని మా స్నేహితురాండ్రముందు తక్కువగా చూపుకొని, వాళ్ళసహాయం దేవురించటం నావల్లకాదు. మనకీ కొంచెం ఆత్మ గౌరవం వుంది...'

రాజారావు బిగ్గరగా నవ్వేశాడు. జరిగిందంతా ఊహించుకోడానికి ప్రయత్నిస్తూన్నాడతను

'పోనీలే! దీనికింత హైరాన ఎందుకూ? ఆవిడ మనకి సహాయం చేస్తుందని మనం కలలు కనేములేదు గదా! పద భోజనానికి! పిల్లలందరూ ఎదురు చూస్తున్నారు...' ఆప్యాయంగా ఆమె వీపు నిమురుతూ అన్నాడు.



# రాష్ట్రపతి ఎన్నిక

ఈసారి రాష్ట్రపతి పదవికి 'మధ్యంతర ఎన్నికలు' జరిగాయి. ఎప్పుడూ రాష్ట్రపతి ఎన్నిక గూడా మామూలుగా జనరల్ ఎన్నికల అనంతరం జరుగుతూ వుండేది పూర్వం డా॥ రాజేంద్రప్రసాద్ రెండుసార్లు రాష్ట్రపతిగా ఎన్నిక అయినప్పుడు, ఆ అనంతరం డా॥ రాధాకృష్ణన్, డా॥ జకీర్‌హుస్సేన్‌లు ఎన్నిక అయినప్పుడు గూడా దేవిధంగా జరిగింది. కాని ఈసారి అట్లా జరగలేదు. 1967 మే నెలలో రాష్ట్రపతిగా ఎన్నిక అయిన డా॥ జకీర్‌హుస్సేన్ 1969 మే నెల 3 వ తేదీన దివంగతులైనారు. రాష్ట్రపతి స్థానంలో ఈ విధంగా ఖాళీ ఏర్పడింది. ఇటువంటి సందర్భంలో ఇట్లా రాష్ట్రపతి స్థానంలో వున్న వ్యక్తి మరణించడంవల్లనేగాక ఇంకా మరికొన్ని విధాలుగా గూడా ఆ ఖాళీ ఏర్పడవచ్చు. రాష్ట్రపతి పదవిలోవున్న వ్యక్తి రాజీనామా ఇచ్చినప్పుడు, లేక తొలగింపబడినప్పుడు గూడా ఇట్లా ఖాళీ ఏర్పడవచ్చు ఇటువంటి సందర్భం అంటూ ఏర్పడినప్పుడు ఏమి చేయవలసివుంటుందో—రాజ్యాంగంలో 62(2) అధికరణంలో ఇట్లా చెప్పబడివుంది: 'మృతివల్లగాని, రాజీనామావల్లగాని, లేక తొలగింపబడినందువల్ల గాని, లేదా తదితర కారణంవల్లగాని రాష్ట్రపతి స్థానంలో ఖాళీ ఏర్పడినట్లయితే, ఆ ఖాళీని సాధ్యమైనంత త్వరలో భర్తీ చెయ్యాలి. ఈ భర్తీ చేయడం అన్నది ఏ సందర్భంలో అయినా సరే, ఆ ఖాళీ ఏర్పడిన అనంతరం ఆరు నెలలలోగా జరగవలసివుంది. అట్లా జరిగిన ఎన్నికలో ఎన్నిక అయిన వ్యక్తి, ఆ పదవిలో చేరినదగ్గరనుంచి ఐదు సంవత్సరాలు ఆ పదవిని వహిస్తాడు.'

ఇట్లా రాష్ట్రపతి పదవికి ఎన్నిక జరిగింది. ఈ పదవికి పదిహేనుమంది పోటీకి నిలబడ్డారు. వారు—శ్రీయుతులు భగ్మల్; కె. కె ఛటర్జీ; సి డి. దేశ్‌ముఖ్; వి. వి. గిరి; శ్రీమతి గురుచరణ్ కౌర్; హరిరామ్; ఎస్ ఎస్ కచ్వాహ; కుభిరామ్; బాబూలాల్ మాగ్; పి. ఎన్. రాజ్‌భోజ్; నీలం సంజీవ రెడ్డి; పి. సేనాని; ఆర్. త్రిపాఠి; ఆర్. పి వ్యాస్. ఎం. ఏ. శర్మ.

ఈ పదిహేనుమందిలోను నిజంగా పోటీ అన్నది జరిగింది ప్రధానంగా ముగ్గురిమధ్యనే అని చెప్పవలసివుంది. వారు—శ్రీయుతులు వి. వి. గిరి; శ్రీ నీలం సంజీవరెడ్డి; శ్రీ సి. డి. దేశ్‌ముఖ్‌లు. శ్రీ సంజీవరెడ్డి కాంగ్రెస్‌పార్టీ అభ్యర్థి; శ్రీ గిరి ఇండిపెండెంటుగా నిలబడ్డారు. శ్రీ సి. డి. దేశ్‌ముఖ్‌ను స్వతంత్రా, జనసంఘంపార్టీలు బలపరిచాయి. శ్రీ గిరికి ఉభయకమ్యూనిస్టుపార్టీలు, తక్కిన మరికొన్ని వామ పక్షాల మద్దతు లభించింది.

ఈ ఎన్నికలను ఆయా అభ్యర్థులను బలపరచిన పార్టీల బలా బలాలనుబట్టి చూస్తే కాంగ్రెస్ పార్టీ నిలబెట్టిన అభ్యర్థి గెలవవలసివుంది. కాని అట్లా జరగలేదు. ఇండిపెండెంటుగా నిలబడిన శ్రీ గిరి విజయం పొందారు. ఇందుకు అయిన కారణాలు ఇప్పటికే చరిత్రప్రసిద్ధం అయిపోయినాయి.

# రాష్ట్రపతి ఎన్నిక

రాష్ట్రపతి పదవికి ఎన్నిక జరగడానికి రాజ్యాంగంలోనే ఒక పద్ధతి నిర్ణయింపబడివుంది. ఆ విషయం రాజ్యాంగంలోని 54 వ అధికరణంలో చెప్పబడివుంది. రాష్ట్రపతి పదవికి ఎన్నికకు ఒక ప్రత్యేక నియోజకవర్గం. లేక ఎలక్టోరల్ కాలేజి వుంది పార్లమెంటు యొక్క ఉభయ సభల సభ్యులు, రాష్ట్ర శాసన సభల సభ్యులు ఇందులో ఓటర్లు. ఇచ్చట ఓటుకు విలువ మదింపు చేయబడుతుంది. ప్రతి రాష్ట్ర శాసన సభలోని ఓటుకు, పార్లమెంటు సభ్యుని ఓటుకు గూడా ఇట్లా విలువ తేల్చబడుతుంది. ఇది ఎట్లా జరగాలో రాజ్యాంగంలో 54 వ అధికరణంలో చెప్పబడివుంది. 1969 ఆగస్టులో జరిగిన రాష్ట్రపతి ఎన్నికలకు జరిగిన ఈ ఓట్ల విలువ మదింపు శాసన సభలకు సంబంధించి రాష్ట్రాలవారీగా ఇట్లా వుంది:

| రాష్ట్రం | శాసనసభ్యుల సంఖ్య | ఓటు విలువ |
|---|---|---|
| 1. ఆంధ్రప్రదేశ్ | 287 | 125 |
| 2. అస్సామ్ | 126 | 94 |
| 3. బీహార్ | 318 | 146 |
| 4. గుజరాత్ | 168 | 123 |
| 5. హర్యానా | 81 | 94 |
| 6. జమ్మూ–కాశ్మీర్ | 75 | 59 |
| 7. కేరళ | 183 | 127 |
| 8 మధ్యప్రదేశ్ | 296 | 109 |
| 9. మహారాష్ట్ర | 270 | 146 |
| 10. మైసూరు | 216 | 109 |
| 11. నాగలాండు | 52 | 7 |
| 12 ఒరిస్సా | 140 | 125 |
| 13. పంజాబు | 104 | 107 |
| 14. రాజస్థాన్ | 184 | 110 |
| 15 తమిళనాడు | 234 | 144 |
| 16 ఉత్తరప్రదేశ్ | 425 | 174 |
| 17. పశ్చిమబెంగాలు | 280 | 125 |

అంటే ఇచ్చట ఓటు విలువ ఆయా రాష్ట్రం జనాభాను ఆ రాష్ట్ర శాసన సభ్యుల మొత్తపు సంఖ్యచేతను, వెయ్యిచేతను విభాగించి విలువ తేల్చారు. ఈ విధంగా ఈ ఎన్నికలో అన్ని రాష్ట్రాల శాసన సభ్యుల మొత్తం ఓటు విలువ 430847 అని తేలింది. అప్పుడు పార్లమెంటు ఓట్లు, రాష్ట్ర శాసన సభల వోట్లు సమస్థాయిలో వుండేట్లు చూచుకొనవలసి వుంది అంటే పార్లమెంటు మొత్తం ఓటు విలువగూడా 430847 కావాలి. భాగహారానికి వీలుగా పార్లమెంటు ఓటు మొత్తానికి ఒకటిని చేర్చి ఆ ఓటు బలాన్ని 430848 అన్నారు. ఈ ఓటు విలువ మొత్తాన్ని పార్లమెంటు ఉభయసభల సభ్యుల సంఖ్యచేతను విభాగిస్తే అప్పుడు పార్లమెంటు ప్రతిఒక్క సభ్యుని ఓటు విలువ వస్తుంది. పార్లమెంటులో లోక్‌సభలో 520 మంది సభ్యులు. రాజ్య సభలో 228 మంది సభ్యులు వున్నారు. కనుక ఇచ్చట ప్రతిఒక్క ఓటువిలువ 430848÷748=576 అయింది.

రాష్ట్రపతి ఎన్నిక Proportional representation పద్ధతిని, single transperable vote ప్రకారం జరుగుతుంది. ఇచ్చట ప్రిఫరెన్సు వోట్లు వుంటాయి వోటింగు రహస్య పద్ధతిని జరుగుతుంది. ఇట్లా జరిగే ఈ ఎన్నికలో విజయం పొందాలి అంటే మొత్తం పోలైన వోట్లలో సగంపైన ఒక్క వోటు విధిగా వచ్చితీరాలి మొదటి ఓటు లెక్కలో అన్ని ఓట్లు ఏ అభ్యర్థికీ రాకపోతే రెండో ఓటును లెక్కపెట్టాలి. అప్పుడు ఏ అభ్యర్థికి మొత్తం పోలైన ఓట్లలో సగంపైన ఒక్క ఓటుకు దాటిన మొత్తంగాని, అంతకన్నా ఎక్కువగాని వస్తాయో, ఆ అభ్యర్థి ఎన్నిక అయినట్లు ప్రకటిస్తారు.

ఇట్లా 1969 ఆగస్టులో జరిగిన ఎన్నికలో శ్రీ వి. వి. గిరి గెలిచారు మొదటిలెక్కలో ఏ అభ్యర్థికి

గెలుపునకు అవసరమైన ఓట్లు రాలేదు. ఈ ఎన్నికలో మొత్తం 836337 మొదటి ప్రిఫరెన్సు ఓట్లు పోలైనాయి. వాటిలో శ్రీ గిరికి 401515 ఓట్లు, శ్రీ సంజీవరెడ్డికి 313548 ఓట్లు, శ్రీ దేశ్‌ముఖ్‌కి 112769 ఓట్లు, తక్కినవారికి 8505 ఓట్లు వచ్చాయి. ఈ మొదటి ఓట్లలో ఇంకో 16659 ఓట్లు శ్రీ గిరికి వచ్చివుంటే ఆయన మొదటి లెక్కలోనే నెగ్గివుండేవారు. కాని అట్లా జరగలేదు అప్పుడు రెండవ ఓట్ల లెక్క అవసరం అయింది. ఈ రెండో లెక్కలో శ్రీ గిరి నెగ్గారు. శ్రీ సంజీవరెడ్డి కన్నా ఆయనకు 14650 ఓట్లు అధికంగా వచ్చాయి. రెండవ లెక్క అనంతరం ప్రధాన అభ్యర్థులకు వచ్చిన ఓట్ల వివరాలు ఈ విధంగా వున్నాయి :

| | |
|---|---|
| శ్రీ వి. వి. గిరి | 420077 |
| శ్రీ ఎన్. సంజీవరెడ్డి | 405427 |
| శ్రీ దేశ్‌ముఖ్ | 112769 |

1969 ఆగస్టు 16 వ తేదీన పోలింగ్ జరిగింది. 20 రాత్రి 10-30 గంటలకు ఈ ఫలితం ప్రకటించబడింది.

ఈ జరిగిన రాష్ట్రపతి ఎన్నికలో ప్రధాన అభ్యర్థులకు వచ్చిన ఓట్ల వివరాలు ఇట్లా వున్నాయి :

### శాసనసభల ఓట్లు

### శ్రీ వి. వి గిరి

| | | బ్యాలెట్లు | ఓట్లు |
|---|---|---|---|
| (1) | ఆంధ్రప్రదేశ్ | 131 | 16375 |
| (2) | అస్సామ్ | 48 | 4512 |
| (3) | బీహారు | 165 | 24090 |
| (4) | గుజరాత్ | 12 | 1476 |
| (5) | హర్యానా | 37 | 3478 |
| (6) | జమ్మూ-కాశ్మీర్ | 58 | 3422 |
| (7) | మహారాష్ట్ర | 50 | 7300 |
| (8) | నాగాలాండు | 38 | 266 |
| (9) | ఒరిస్సా | 67 | 8375 |
| (10) | పంజాబు | 80 | 8560 |
| (11) | రాజస్థాన్ | 35 | 3850 |
| (12) | తమిళనాడు | 142 | 20448 |
| (13) | ఉత్తరప్రదేశ్ | 181 | 31494 |
| (14) | పశ్చిమబెంగాలు | 248 | 31000 |
| (15) | కేరళ | 103 | 13081 |
| (16) | మధ్యప్రదేశ్ | 103 | 11227 |
| (17) | మైసూరు | 53 | 5777 |

### శ్రీ సంజీవరెడ్డి

| | | | |
|---|---|---|---|
| (1) | ఆంధ్రప్రదేశ్ | 118 | 14750 |
| (2) | అస్సాం | 57 | 5358 |
| (3) | బీహారు | 111 | 16206 |
| (4) | గుజరాత్ | 102 | 12546 |
| (5) | హర్యానా | 22 | 3008 |
| (6) | జమ్మూ-కాశ్మీర్ | 8 | 472 |
| (7) | మహారాష్ట్ర | 201 | 29346 |
| (8) | నాగాలాండు | 4 | 28 |
| (9) | ఒరిస్సా | 15 | 1875 |
| (10) | పంజాబ్ | 10 | 1070 |
| (11) | రాజస్థాన్ | 98 | 10780 |
| (12) | తమిళనాడు | 54 | 7776 |
| (13) | ఉత్తరప్రదేశ్ | 138 | 24012 |
| (14) | పశ్చిమ బెంగాల్ | 25 | 3125 |
| (15) | కేరళ | 15 | 1905 |
| (16) | మధ్యప్రదేశ్ | 112 | 12208 |
| (17) | మైసూరు | 135 | 14750 |

## శ్రీ సి. డి. దేశ్‌ముఖ్

| | | |
|---|---|---|
| (1) ఆంధ్రప్రదేశ్ | 18 | 2250 |
| (2) అస్సాం | 1 | 94 |
| (3) బీహార్ | 36 | 5258 |
| (4) గుజరాత్ | 51 | 6273 |
| (5) హర్యానా | 8 | 752 |
| (6) జమ్మూ-కాశ్మీర్ | 2 | 118 |
| (7) మహారాష్ట్ర | 12 | 1752 |
| (8) నాగాలాండ్ | —— | —— |
| (9) ఒరిస్సా | 46 | 5770 |
| (10) పంజాబు | 7 | 749 |
| (11) రాజస్థాన్ | 41 | 4510 |
| (12) తమిళనాడు | 22 | 3168 |
| (13) ఉత్తరప్రదేశ్ | 93 | 16182 |
| (14) పశ్చిమబెంగాల్ | —— | |
| (15) కేరళ | —— | |
| (16) మధ్యప్రదేశ్ | 54 | 5886 |
| (17) మైసూరు | 17 | 1853 |

### పార్లమెంటులో

| | | |
|---|---|---|
| శ్రీ గిరి | 369 | 206784 |
| శ్రీ సంజీవరెడ్డి | 268 | 154368 |
| శ్రీ సి. డి. దేశ్‌ముఖ్ | 101 | 58176 |
| ఇతరులు | 6 | 3456 |

పార్లమెంటులో తొమ్మిది బ్యాలెట్లు, శాసన సభలలో 80 బ్యాలెట్లు చెల్లలేదు

రెండవ బ్యాలెట్లు శ్రీ గిరికి పార్లమెంటులో శ్రీ దేశ్‌ముఖ్ నుంచి 7 దాకా వచ్చాయి. వాటి విలువ 4032. ఇక రాష్ట్రాలలో శ్రీ గిరి వచ్చిన రెండవ ప్రిఫరెన్సు ఓట్లు ప్రధానంగా ఇల్లా వున్నాయి. అవి శ్రీ దేశ్‌ముఖ్ నుంచి వచ్చినవి.

| | | |
|---|---|---|
| ఆంధ్రప్రదేశ్ | 6 | 750 |
| అస్సాం | | — |
| బీహార్ | 2 | 292 |
| గుజరాత్ | 9 | 1107 |
| హర్యానా | | |
| జమ్మూ-కాశ్మీర్ | | |
| కేరళ | | |
| మధ్యప్రదేశ్ | 5 | 545 |
| మహారాష్ట్ర | 5 | 730 |
| మైసూరు | 4 | 436 |
| నాగాలాండ్ | | — |
| ఒరిస్సా | | 875 |
| పంజాబ్ | | — |
| రాజస్థాన్ | 7 | 770 |
| తమిళనాడు | 4 | 576 |
| ఉత్తరప్రదేశ్ | 47 | 8178 |
| మరొక అభ్యర్థి నుంచి వచ్చినది | 1 | 146 |
| మొత్తం | 104 | 18437 |

ఇతర అభ్యర్థులవలన వచ్చిన రెండవ ఓట్లు పెద్ద లెక్కకు రాలేదు.

పరిశీలక్.

కలగూరగంప:

# కవిత్వము-ఇతివృత్తము

**1969** ఏప్రిల్ భారతి సంచికలో నేను వ్రాసిన ఈ శీర్షికగల వ్యాసంపై జూలై సంచికలో శ్రీ ఎస్. వి రత్నంగారు ఆలోచనలను ప్రేరించే విమర్శ వ్రాశారు.

ఇతివృత్తనాయకుడుకాగల వ్యక్తిలో ఒగ విశేషం ఉండాలి. ఒక సరళరేఖలో సాఫీగా ఒడిదుడుకులు లేకుండా జీవితాన్ని గడిపిన మనిషినిగురించి ఏమి రచించడానికి ఉండదు. 'రాజుతో కొన్నివేలమంది సైనికులు యుద్ధానికి వెళతారు, పోరాడుతారు, మరణిస్తారు వారికోసం వారి తలిదండ్రులు, భార్య, బిడ్డలు దుఃఖిస్తారు. సంఘర్షణ అనేది మానవజీవితంలో ఉందికాని సంఘంలో మానవుని అంతస్తుని బట్టికాదు అంతేకాకుండా రచయిత ఇతివృత్తాన్ని మలచే Technic లో ఉంది'అని రత్నంగారు వ్రాశారు. అభిమన్యునితోబాటు కొన్నిలక్షలమంది సైనికులు చనిపోయారు. కాని వారందరి మొత్తం మృతి కన్నా అభిమన్యుని ఒక్కమృతి మనలను ఎక్కువగా దుఃఖితులను చేస్తున్నది. అంతటి పరాక్రమం, సౌందర్యాభిజాతత్వాద్యుత్తమగుణాలూ కలిగిఉండడం, నూత్నపరిణీతుడు కావడం, భార్య గర్భిణికావడం, ఆఖరిక్షణంలోకూడా ధైర్యాన్ని వదలకపోవడం, లోక విజేతలైన తండ్రీ, మేనమామా దగ్గరలేకపోవడం, భీమునంతటివాడుకూడా చూస్తూ ఏమీచెయ్యలేకపోవడం, పదిమందీ మీదపడి కుటిలంగా చంపడం— ఈ లక్షణాలన్నీ కలిసి అభిమన్యుని మరణాన్ని ఒక గొప్పకావ్యసన్నివేశాన్ని చేస్తున్నాయి. అతనితోబాటు మరణించిన విరాటుడు, లక్ష్మణుడు మొదలైన ఇతర రాజులకూ. సాధారణసైనికులకూ ఈ లక్షణాలలో పావో, పదోవంతో, నూరోవంతో మాత్రమే ఉండవచ్చును. అందుచేత వారి మృతులు మనలను అంత ఎక్కువగా కదపవు. అభిమన్యుని మృతికి అతని భార్య, తల్లిదండ్రులు ఎలా దుఃఖించారో, సైనికుడి మృతికి అతని భార్య. తల్లిదండ్రులుకూడా అలాగే విలపించినా అది వారి వ్యక్తిగతం. అది మనకు అనవసరం. సైనికాభిమన్యు లిద్దరిలో అభిమన్యుని మరణమే కవికీ పాఠకునికీ ఎక్కువ దుఃఖకారకమైనది. కనుక సైనికునికన్నా అభిమన్యునికి కథానాయకుడు కాగల అర్హత చాలా ఎక్కువ. అభిమన్యుని మరణంకన్నా సైనికుని మరణమే కవిని ఎక్కువ కదిలించి ఉంటే సైనికుని గురించే కావ్యం వ్రాసి ఉండేవాడు. Technic సాహిత్యానికి బహిరంగ రూపాన్ని ఆకర్షణనీ ఇయ్యడానికే ఉపకరిస్తుంది. పాత్రలో గాంభీర్యం లేనప్పుడు ఏ టెక్నిక్కూ పని చెయ్యదు. పద్యమంతా ఒకే సమాసం వ్రాసినా విరాటుడు అభిమన్యునికన్నా గొప్పవీరుడై పోవడు కదా !

Antony and Cleopatra నాటకంలో ఒక రాజ్యాన్ని శాసించే సామర్థ్యంకల మహావీరుడు ఒక విశిష్ట స్త్రీ చేతిలో కీలుబొమ్మయి కొట్టుకొనడం చిత్రితమైంది Antony ఒక మామూలు పురుషుడుగాని, Cleopatra సామాన్యంగా మెలగే ఒక స్త్రీగాని అయిఉంటే ఆ సంఘర్షణా, కథా ఏర్పడి ఉండేవి కాదుకదా! Antony తో బాటు ఎందరో సైనికులు చనిపోయినా Antony మరణంలోఉన్న గాంభీర్యం, వివిధశక్తులసంఘర్షణ సైనికుని మృతిలో లేవు. సైనికుని మృతిలో రాజభక్తి లేదా దేశభక్తి అన్నసాధారణ రాగప్రదర్శనమాత్రం ద్యోతితమవుతుంది. Antony మరణంలో ప్రదర్శితమైనంతటి జీవితపులోతు సైనికుని మృతిలో ప్రదర్శితం కాదు.

రాజు అంటే అచ్చంగా రాజే కావక్కరలేదు ఇటువంటి విశిష్టత ఎవరిలో ఉన్నా వారు కథా

నాయకులు కాగలరు. ఈ విశిష్టత కేవలం అంత స్తుసిబట్టి వచ్చినదికాదు, వారి వ్యక్తిత్వానికి చెంది నది. లెక్క లేనందరు రాజులు గతించారు, వారిలో కొందరిని గురించే సాహిత్యం రచితమైంది. పాండవులకూ కౌరవులకూ ఎందరో కొడుకులు ఉన్నారు. కాని అభిమన్యునివలె వాళ్లెవరూ కథానాయకులు కాలేదు. దానికి అభిమన్యునిలోని వైశిష్ట్యం, వ్యక్తిత్వమే కారణం. Antony వలె సైన్యాలను నడిపిన నాయకులు, అతనితో సమానమైన అంతస్తుకలవారు ఇతరులు ఉన్నారు. వాళ్లెవరిలోనూ Antony లో ఉన్నంత విశిష్టత లేకపోవడంచేత అంతటి కథానాయకులు కాలేదు. నేటికాలంలోకూడా గాంధీ, నెహ్రూ, నేతాజీలమీద కావ్యాలు వెలశాయి తప్ప ప్రతి ఎమ్. ఎల్. ఏ గురించి వ్రాయబడలేదు. వ్యక్తిత్వమూ, ఆ వ్యక్తిత్వం వికసించగలిగే పరిస్థితులూ కథానాయకునికి ఉండాలి.

'సీత జీవితంలో పరీక్ష ఏర్పడింది కనుక కావ్యనాయిక అయింది. ఊర్మిళాదేవి జీవితంలో అంత గొప్పపరీక్ష ఏర్పడలేదు కనుక కావ్యంలో అల్పపాత్ర అయింది' అని నేను వ్రాసినదానికి రత్నంగారు 'ఊర్మిళనాయికగా హిందీలో శ్రీ మైథిలీశరణగుప్త 'సాకేత్' అనే కావ్యం వ్రాశారు. శ్రీ గుప్తాజీ 'సాకేత్'కి హిందీలో అత్యుత్తమస్థానం ఇచ్చారు. 'సాకేత్' చదివితే మిగతా రామాయణాల్లో ఊర్మిళకు అన్యాయం జరిగిందని స్ఫురింపజేస్తారు శ్రీ గుప్తాజీ' అని వ్రాశారు.

వాల్మీకి రామాయణంలో వర్ణితమైన కథలో సీత జీవితంలో ఏర్పడినంతటి పరీక్ష ఊర్మిళ జీవితంలో ఏర్పడలేదు, కనుక వాల్మీకిరామాయణంలో ఊర్మిళ గొప్పపాత్ర కాలేకపోయింది. ఆమె మనస్సులో సంఘర్షణ లేకపోయిఉండవచ్చును, లేదా సంఘర్షణ ఉన్నా కవిచేత ఆ సంఘర్షణ చిత్రితం కాకపోయి ఉండవచ్చును. మైథిలీశరణగుప్తగారి 'సాకేత్' నేను చదవలేదు. వారి కావ్యంలో ఊర్మిళ గొప్పపాత్ర అయిందంటే, వాల్మీకి చిత్రించకుండా విడిచిన సంఘర్షణను ఆయన చిత్రించడంచేత కావచ్చును. 'సాకేత్' కావ్యంలో ఊర్మిళ జీవితంలోని సంఘర్షణ చిత్రితమైంది కనుక ఆ కావ్యంలో ఊర్మిళ గొప్ప పాత్ర అయిఉండవచ్చును. మహాభారతంలో శకుంతల, దుష్యంతుడు, చిత్రాంగద, సుభద్ర—వీరు ప్రముఖ పాత్రలు కారు. వీరి వ్యక్తిత్వాలు మనకమస్పష్టంగా కని పిస్తాయి కాని 'శాకుంతలం'లో 'చిత్ర'లో 'విజయ విలాసం'లో వీరే గొప్పపాత్రలయారు. కవి తాను ఇతరత్రా సంపాదించిన అనుభవంతో, కల్పనాశక్తితో ఈ పాత్రల వ్యక్తిత్వాలను పెంచడంచేత మూల కథలలో కన్నా ఈ పాత్రలు ఉన్నతము లయాయి. కూతుళ్లను అత్తవారింటికి పంపుతున్నప్పుడు తండ్రులుపడే దుఃఖాన్ని గమనించి ఆ అనుభవంతో కణ్వపాత్రను కాళిదాసు పెంచాడు. కాగా, 'సాకేత్'కి ఆధునిక హిందీసాహిత్యంలో ఉత్తమస్థానం లభించిన మాత్రాన అది వాల్మీకి రామాయణం ప్రక్క ఎంతవరకూ నిలవ గలుగుతుందో తొందరపడి నిర్ణయించజాలం. అనేకవేలసంవత్సరాలుగా వాల్మీకి రామాయణం విశేషంగా పఠితమవుతున్నది. దేశ దేశాలలోని ప్రజలు సీతను తలచుకొని కంట తడిపెట్టుకొని తల్లిగా కొనియాడుతూ దైవంగా పూజిస్తున్నారు. గుప్తగారి ఊర్మిళ ఇంతటి స్థానాన్ని పొందుతుందో పొందదో కాలం నిర్ణయిస్తుంది.

ఊర్మిళా పాత్రకు రామాయణంలో అన్యాయం జరిగిందని అభిప్రాయపడిన వారిలో టాగోరు మొదటి వారనుకొంటాను. కాని వాల్మీకి రచనా శిల్పాన్ని సరిగా గమనించనందువలన ఈ భ్రమ ఏర్పడుతున్నదని నా అనుమానం. రామాయణ కావ్యం మహాభారతం వంటిది కాదు. మహాభారతాన్ని కవి తనకు తెలిసినవన్నీ చెప్పడానికి రచించాడు. అదొక మహాసముద్రం. అందులో మునుగుతే ఇక తేలడం ఉండదు. రామాయణం అలాటిది కాదు. రామాయణ కావ్యం ఒక సుందరారామం వంటిది. కావ్యానికి అత్యవసరమైన వాటిని మాత్రమే కవి వర్ణించాడు. (తర్వాత రామాయణంలో అనావశ్యక విషయాలు అక్కడక్కడ ప్రక్షిప్తము లయాయి.)

రామాయణకర్త ఏ పాత్ర కావ్యానికి ఎంత వరకు అవశ్యకమో ఆ పాత్రను గురించి అంత

వరకే తూచి చెబుతాడు. ఎక్కువ చెప్పడు. ఉదాహరణకి అయోధ్యాకాండలో మంథరని ఎలా ప్రవేశపెడుతున్నాడో చూడండి —

'జ్ఞాతి దాసీ యతోజాతా
కైకేయ్యాస్తు సహోషితా
ప్రాసాదం చంద్ర సంకాశ
మారురోహ యదృచ్ఛయా.'

(కైకేయికి పుట్టింటివారు అరణమిచ్చిన దాసి, ఆమె పుట్టుపూర్వోత్తరాలు తెలియవు, ఎప్పుడూ కైకేయితో ఉంటుంది; అటువంటి మంథర చంద్రునివలె తెల్లగా ఉన్న ప్రాసాదాన్ని యదృచ్ఛగా ఆరోహించింది.) కైకేయికి దుర్బోధ చెయ్యడం మాత్రమే, రామాయణ కావ్యంలో మంథరపాత్ర ప్రయోజనం. అందుకు అవశ్యకములైన విశేషణాలని 'జ్ఞాతిదాసీ' అనీ 'కైకేయ్యాస్తు సహోషితా' అని చెప్పి, అల్పపాత్రయైన మంథరగురించి ఇంకేవీ ప్రస్తావించకుండా 'యతోజాతా' అని కావ్యంలో ఆమెను వాల్మీకి పరిహరించివేశాడు వాల్మీకి కథాకథన శిల్పానికి ఇది మచ్చుతునక

ఇలాగే సుగ్రీవుని భార్య రుమగురించి ఏమీ చెప్పడు. వాలికీ మాయావికీ స్త్రీకృతమైన మహావైరం ఏర్పడిందని సూక్ష్మంగా అంటాడు. ఆ వివరాలు చెప్పడు వాల్మీకి రచనాపద్ధతి ఇట్టిది. దీనిని గమనించవలసి ఉంది ఇదేవిధంగా ఊర్మిళనుగురించి తన కావ్యంలో వర్ణించవలసిన అవశ్యకతలేక వాల్మీకి మానివేసి ఉండవచ్చును.

'కావ్యం రామాయణం కృత్స్నం
సీతాయాశ్చరితం మహత్
పౌలస్త్య వధమిత్యేవ
చకార చరితవ్రతః'

అని గ్రంథాదిని తన కావ్యప్రమాణాన్ని విశ్వయించుకొని వాల్మీకి ఆ ప్రమాణంలో రచన సాగించాడు 'సాకేత్' చదివిన తర్వాత రామాయణంలో ఊర్మిళకి అన్యాయం జరిగిందని కొందరు భావిస్తే, వెనువెంటనే మరికొందరికి 'సాకేత్'లో మాండవికి అన్యాయం జరిగిందని తోచకపోదు. రామాయణంలో పదునాలుగేళ్ళు పతిని ఎడబాసిన ఊర్మిళనుగురించి ఎట్లా ఏవీ చెప్పబడలేదో, పదునాలుగేళ్ళు జటావల్కలధారియై, ఫలమూలాశనుడై, దాంతుడై తాపసుడై అన్నకొరకు ప్రతీక్షించిన భరతుని భార్య మాండవినిగురించికూడా ఏవీ చెప్పబడలేదు.

'రావుగారు ఎంతకీ షేక్స్పియరునే ఉదాహరణగా తీసుకొన్నారు. వారి వ్యాసానికి కీలు. కాని వారు షేక్స్పియరుకు ఏమాత్రం తీసిపోని షా, ఇబ్సెన్‌లను వదిలవేశారు' అని రత్నంగారు వ్రాశారు. 'షేక్స్పియరుకు ఏమాత్రం తీసిపోని షా, ఇబ్సెనులు' అనడంలో కొద్దిగనో గొప్పగానో అతిశయోక్తి ఉందని తోస్తుంది. సామాజిక రాజకీయాదర్శాలు ఉండడంచేతనూ, హాస్యంచేతనూ షా నాటకాలు విశేష ప్రజాదరణని పొందాయి. కాని ఒక శతాబ్దం గడిచి, ప్రపంచ సమాజవ్యవస్థ మారుతే అతని సామాజిక రచనలు అదేవిధంగా పత్రికలోకాదరణని పొందుతాయని చెప్పలేం. కాగా, షా వ్రాసిన సామాజిక నాటకాలన్నిటికన్నా 'Saint Joan'' నాటకంలో భావతీవ్రత ఎక్కువగా ఉందనీ, అది అతని నాటకాలలో అగ్రగణ్యమనీ కొందరి అభిప్రాయం. సాంఘిక చర్చలకన్నా తాత్త్వికభావాలే షా నాటకాలకి విశ్వజనీనతనూ గొప్పతనాన్నీ కలిగించాయి.

బాల్య వివాహాలు, వితంతు వివాహాలు, వివాహశుల్కాలు - వీటిని గురించి మనదేశంలో ఎన్నో రచనలు వచ్చాయి అవన్నీ ఆయా కాలాలలోపుట్టి నశించాయి. 'కన్యాశుల్కం' ఒక్కటి మట్టుకు మిగిలింది. ఈ నాటకంలో చిత్రితమైన సంఘ వ్యవస్థ ఇప్పుడు లేదు, ఇప్పుడు దానికి పూర్తిగా విరుద్ధమైన వ్యవస్థ ఉంది. అయినా ఆ నాటకంలోని పాత్రల విశిష్టతచేత ఆ రచన బ్రతికింది తక్కిన రచనలలో సిద్ధాంతాల చర్చలు ఉన్నంతగా మానవత్వచిత్రణం లేనందున అవి గతించాయి

అయితే, ఒక రచన సద్యస్కాలంలో సంఘాన్ని ప్రభావితంచేసి స్వప్రయోజనాన్ని సాధించిన తర్వాత ఇంక అది నశించిపోతేనేం? మ్యూజియంలో కళకాలం

పడి ఉండే విచిత్ర వస్తువులకన్నా మనిషి అక్కరకు వచ్చే చెప్పుల జత సంఘానికి ఎక్కువ ప్రయోజనకరం కావా? తనదారిన తాను గంభీరంగా నిష్ప్రయోజనంగా ప్రవహించిపోయి సముద్రంలో కలిసే నదికన్నా పంటలకు పనికివచ్చే పిల్లకాలువ మేలుకాదా? అని అడగవచ్చును. కాని సాహిత్యంయొక్కగాని, ఏ విజ్ఞానంయొక్కగాని ప్రయోజనాన్ని అంతతొందరగా సులువుగా నిర్ణయించతగదు. ఈ అంశాన్ని 'సాహిత్య ప్రయోజనము' అన్న నా వ్యాసంలో (భారతి, ఆగస్టు 1968) చర్చించాను.

కాగా, సాహిత్యం స్వల్పకాలంలో సాంఘిక చైతన్యాన్ని కలిగించి సమాజాన్ని మరామత్తు చేసేటంత శక్తిమంతమైనదని చెప్పడానికి ఆధారాలు లేవు ఉదాహరణకి, తెలంగాణా ఉద్యమం ప్రారంభింపబడినవెంటనే ఎందరో కవులు దానిని వ్యతిరేకిస్తూ, ఐక్యతను ప్రబోధిస్తూ కవితలు పుంఖానుపుంఖాలుగా వ్రాశారు. కాని ఉద్యమకారులు ఆ కవితల చేత రవంతైనా ప్రభావితులు కాలేదు, ఉద్యమాన్ని మానలేదు. సతీసావిత్రి సినిమా చూపిన స్త్రీలందరూ వెంటనే సావిత్రులు అయిపోరు. అలాగని సావిత్రికథ ప్రయోజనరహితమైనదికాదు. ఆ కథ పాఠకునిలో ఒక చిత్తసంస్కారాన్ని కలిగిస్తుంది అంతేతప్ప సాహిత్యంద్వారా సంఘాన్ని హఠాత్తుగా మార్చివేయాలనుకోవడం ఊక అమ్మగా వచ్చే డబ్బుతో కూతుళ్లకి పెళ్లి చెయ్యదలచడం వంటిది.

'ఏ రచయితఅయినా సమకాలిక జీవితాన్ని తన రచనలో చూపగలిగినవాడే ప్రసిద్ధుడవుతాడు. వ్యాసుడు, వాల్మీకి తమతమ రచనలలో ఆనాటి జీవితాన్ని చూపించారు. కాబట్టే ప్రసిద్ధులయ్యారు. ఆ కాలంలో వారే అభ్యుదయ రచయితలు అట్లే నన్నయాదులు వారి కాలంలో అభ్యుదయరచయితలు'. అని రత్నంగారు వ్రాశారు. ఈ అభిప్రాయాన్ని అంగీకరించడం కష్టం. భాస కాళిదాసులు తమ రచనల్లో సమకాలిక జీవితాలని చిత్రించలేదు. అయినా వీరి రచనలు ఉత్తమసాహిత్యమని రెండువేల సంవత్సరాలుగా రసజ్ఞులు పరిగణిస్తున్నారు. భాసుడు పౌరాణికచారిత్రిక కథలను తీసుకొని పదకొండు నాటకాలనూ, సామాజికేతివృత్తాలతో రెండు నాటకాలనూ రచించాడు. అతని రచనలన్నీ సమానగుణం కలవే. అయినా అన్నింటిలో భారత కథలని తీసుకొని వ్రాయబడిన ఊరుభంగ దూత ఘటోత్కచములు అత్యుత్తమములని పలువురు విమర్శకులు అభిప్రాయపడుతున్నారు.

వాల్మీకి కూడా తన రామాయణంలో స్వసమకాల జీవితాన్ని పూర్తిగా యథాతథంగా చూపించాడని చెప్పలేం. కొంత యథార్థం, కొంత ఊహ మిశ్రితమై ఉన్నట్లు తోస్తుంది. మాట్లాడే మర్కటాలు, వికృత విచిత్రదేహాలుకల రాక్షసులూ వాల్మీకికాలంలో ఉండేవారని చెప్పలేంకదా! సీతాదేవి ఆభరణాలని గురించి లక్ష్మణుడిలా అన్నాడు:

'నాహం జానామి కేయూరే
నాహం జానామి కుండలే
నూపురే త్వభిజానామి
నిత్యం పాదాభివందనాత్.'

(ఆమె కేయూరము లెలా ఉంటాయో నాకు తెలియదు. కుండలము లెలా ఉంటాయో తెలియదు. నిత్యమూ పాదాభివందనం చేస్తూఉండడంచేత ఆమె నూపురములుమాత్రం నాకు తెలుసును) ఈ శ్లోకాన్నిబట్టి వాల్మీకికాలంలో మరుదులందరూ వదినలయెడల ఇలా నిర్దుష్టంగా ప్రవర్తించేవారని ఊహించకూడదు సీత లక్ష్మణుడిని 'నాపై కామంతో నువ్వు రామునివెంట అరణ్యానికి వచ్చావు, నా కొరకు రాముని వినాశాన్ని కోరుతున్నావు' అని నిందించిన వాక్యంలో ఆనాటి సమాజస్థితి కొంత తొంగిచూస్తున్నది. అక్కడక్కడ కొన్నిలోపాలు ఉన్నా మొత్తంమీద సువ్యవస్థితమైన తనచుట్టూ ఉన్న సమాజంలో కాలూని, అంతకన్నా ఉదాత్తతరమైన సమాజాన్ని ఊహిస్తూ మానవధర్మాలని ప్రబోధిస్తూ వాస్తవికతనూ ఊహనూ మేళవించి వాల్మీకి రామాయణాన్ని రచించాడని తోస్తుంది.

కాగా, 'అట్లే నన్నయాదులు వారి కాలంలో అభ్యుదయరచయితలు'అన్న రత్నంగారి వాక్యం వారి అభిప్రాయానికే వ్యతిరేకంగా ఉందనిపిస్తుంది. నన్నయాదులు ప్రాచీన సంస్కృతకావ్యాలను అనువదించారు, స్వసమకాల జీవితాలను చూపలేదు. ప్రాచీనాంధ్రకవులలో దాదాపు ఎవ్వరూ సమకాల జీవితాలను చూపలేదు. 'అలాగే నేటి కవులలో గురజాడ, శ్రీశ్రీ, ఆరుద్ర, పట్టాభి, వేదుల, తిలక్ మొదలైనవారు' అని రత్నంగారు వ్రాశారు కృష్ణశాస్త్రిగారిని, తిరుపతివేంకట కవులనూ వీరు పేర్కొనలేదు, వారి కవితలలో సమకాల జీవితం చూపబడలేదని కాబోలును. లేక వీరు 'మొదలైన వారు'లో ఉన్నారో! సాహిత్యం సమకాలిక జీవితాన్ని చర్చించి తీరాలని, అది అభ్యుదయకారకం కావాలని, ఈ రెండు అభిప్రాయాల కృత్రిమమైన కళ్లద్దాలను పెట్టుకొని చూడడంవలన గొప్పకవులు చిన్నగానూ, చిన్నకవులు గొప్పగానూ కనిపిస్తారు. కృష్ణశాస్త్రిగారి కవితలూ, తిరుపతి వేంకటకవుల మహాభారత నాటకములూ, బుద్ధచరిత్రా నేటికాలపు అత్యుత్తమ సాహిత్యానికి చెందుతాయని అభిప్రాయపడేవారు నావంటి కొందరు లేకపోలేదు కృష్ణశాస్త్రిగారి వచనరచనలలోనూ తిరుపతి వేంకటకవుల కొన్నిరచనలలోనూ సమకాలికజీవన ప్రదర్శనం ఉంది.

గురజాడవారి 'పూర్ణమ్మ', 'కన్యక' రెండూ మంచిఖండకావ్యాలే. కాని 'పూర్ణమ్మ'కి ఉన్న ప్రజాదరణ 'కన్యక'కిలేదు. సమకాలిక సమాజాన్ని చూపే రచన తాత్కాలికంగా ప్రజలను ఎక్కువగా ఆకర్షిస్తుంది. కాని ప్రజలందరూ సాహిత్యమర్మజ్ఞులు కారు. కాలం మలుపుతిరుగుతే ఈ విలువలు మారుతాయి. గురజాడ రచన అన్నిటిలో 'దేశమును ప్రేమించుమన్నా'అన్న గేయాలు ప్రస్తుతం అధిక ప్రచారంలో ఉన్నాయి కాని ఈ గేయాలలో చాలా గొప్పకవిత్వం ఉందని చెప్పలేం. 'లంగరెత్తుము'లో ఇంతకన్నా హెచ్చుభావతీవ్రత ఉందనిపిస్తుంది. కాని నేటి సమాజస్థితినిబట్టి దేశభక్తిని ఉద్బోధించే కవిత్వానికి ప్రజలలో ఎక్కువ గిరాకీ ఉండడంచేత 'దేశమును ప్రేమించుమన్నా'కి అమితగౌరవం కలిగింది. మా చిన్నతనంలో 'పచ్చపెట్టెలో ఓటు వెయ్యండి' అని వీథిలో పాటలు పాడుతూ కాంగ్రెసువారు వెళ్తూంటే (పచ్చపెట్టె కాంగ్రెసుపార్టీది) ఇళ్ల అరుగులమీదా గుమ్మాల్లోనూ ప్రజలు బారులుతీరి నిల్చొని పులకించుతూ ఆ పాటను వినేవారు. ఇప్పుడా పాట ఎవరి మనస్సుని కదుపుతుంది?

అభ్యుదయసాహిత్యం, అభ్యుదయ రచయిత అన్న మాటలు నేడు చాలా ప్రయోగంలో ఉన్నాయి. అభ్యుదయసాహిత్యం, విప్లవసాహిత్యం, ప్రజాసాహిత్యం, జానపదసాహిత్యం, పౌరాణికసాహిత్యం—ఈ మొదలైన మాటలు నిర్దేశసౌలభ్యంకొరకు పుట్టినవి. నిజానికి సాహిత్యం రెండే విధాలు - మంచిసాహిత్యం, తద్భిన్నమూను. సాహిత్యానికీ, రచయితకీ ఆరోపేలునంటి 'అభ్యుదయ'అనే విశేషణం అనవసరం.

నేటి యాంత్రికయుగంలో మనిషి జీవితం గతానుగతికమైపోయింది ఏ పని చెయ్యడానికీ అతనికి తీరికలేదు ఒక మనిషి ఇంకొక మనిషితో ఎక్కువసేపు మాట్లాడడానికే తీరిక ఉండడంలేదు మనిషికీ మనిషికీకల సంబంధం తగ్గింది మనిషిలో ఉద్విగ్నతకి అవకాశం తక్కువ. అతనికి తీవ్రమైన ఇష్టానిష్టాలు లేవు జీవితంలో మనిషి మునిగి మున్కలు వెయ్యడం లేదు, పైపైని తేలుతున్నాడు ఇంక అతనినిగురించి ఏమి రచించబడగలదు? తాను ఎవరిని గురించి వ్రాయాలో ఆ మనిషిలో చేవలేనప్పుడు ఏ రచయిత అయినా ఏం వ్రాయగలడు? మునగకొమ్మని పట్టుకొని ఎక్కలేముకదా! సాహిత్యం మానవుని వ్యక్తిత్వాన్ని విశదీకరిస్తుంది. నేటి సమాజంలో మనిషి యొక్క వ్యక్తిత్వం పరిపూర్ణంగా వికసించి అతని విశిష్టత బహిర్గతం కాగల అవకాశాలు అంతగా లేవు. కనుకనే నేటి మనిషికి ప్రాయశః కథానాయకుడు కాగల శక్తి క్షీణించింది. అంటే రచయితలందరినీ కలాలు ముడుచుకొని కూర్చొనమనికాదు. అక్కడక్కడ నేటి మనిషిలోకూడా ఏదో విశిష్టత కనిపించడం, మంచి సాహిత్యం రావడమూ చూస్తున్నాము. కాని నేటి సమాజస్థితినిబట్టి మృచ్ఛకటికంవంటి నాటకం,

ఆముక్తమాల్యదవంటి కావ్యం, War and Peace వంటి నవల ఉత్పన్నమయే అవకాశం తక్కువని తోస్తుంది.

కౌరవులనందరినీ చంపగలిగినంతటి పరాక్రమం అర్జునునికి ఉంది. చంపదగినంత అపకారంకూడా వారతనికి చేశారు. అయినా సమున్నత హృదయుడైన అర్జునునికి వారిని చంపి రాజ్యం గెలవడమా, లేక దాని నంతటినీ సహించి ప్రాణిహింస చెయ్యకుండా ఉండడమా అన్నగొప్ప విచికిత్స కలిగింది. కనుకనే కృష్ణునంతటి విశిష్ట వ్యక్తి, తానే దేవుడూ తానే ప్రవక్తా అయినవాడు, అతనికి భగవద్గీతవంటి గంభీరాభిప్రాయాలని ఉపదేశించే విశిష్ట సన్నివేశం ఏర్పడింది. మనిషి ఎంత గంభీరుడైతే అంత గొప్ప సాహిత్యం వస్తుంది. నేడు బొంబాయిలో 600/- ఉద్యోగంలోకి వెళ్లడమా లేక ఈ ఊళ్లోనే 450/- జీతంతో తృప్తిపడడమా అన్న స్థాయిలో మాత్రం విచికిత్సపడే మనిషికి ఎవరూ భగవద్గీత వంటి ఉపదేశాన్ని ఇవ్వనూ అంతటి కావ్యాన్ని రచించ జాలరుకదా!

-శ్రీ కాళూరి హనుమంతరావు.

## "కవిత్వము-ఇతివృత్తము"

భారతి జులై 1969, సంచికలో శ్రీ ఎస్. వి. రత్నంగారు వెలిబుచ్చిన అభిప్రాయాలు చదివాను

'సంఘర్షణ' సాధారణ మానవుల జీవితాలలో—ఉండదని శ్రీ కాళూరి హనుమంతరావుగారు అన్నట్టు లేదు—ఏర్పడడానికి అవకాశం తక్కువ అన్నారు. సమకాలిక జీవితాన్ని తన రచనలో చూపగలిగినంత మాత్రాన ప్రతిరచయితా ప్రసిద్ధుడు కాగలిగే అవకాశంగూడా సందేహాస్పదమే. రచయితలు తమ సమకాలిక జీవితాన్ని ఇతివృత్తంగా స్వీకరించడంలో సులభమనుకొంటే అనుకోవచ్చు. కానీ, నిర్వహణతో అంతర్దృష్టులు కావాల్సివుంటుంది. శ్రీ రత్నంగారు సెలవిచ్చినట్టు దీనికి గూడా ఆ వాల్మీకి వ్యాసాదులే ఉదాహరణం. 'కొద్దిమంది కవులే ప్రజల మనసులలో నిలవడానికి కారణాన్ని శ్రీ రావుగారు చూపిన కవిత్వ నిర్వచనాలను చదివి పరిపెట్టుకోవచ్చు.

ఫలానా కవి చెప్పిన (ఇతివృత్త విషయంలో) కొత్త యేమీలేదని శ్రీ రావుగారు సోదాహరణంగా అన్నారు. అది నిజమే. శ్రీ రత్నంగారు ఇక్కడ మరి కొందరి కవులను ఎత్తిచూపుతూ వీరంతా పాఠకులను ఆకర్షించారు అన్నారు. ఈ మాటనుగూడా తీసి వేయలేము కానీ ఒకమాట ఇంకా మిగిలివుంది. ఇప్పటి పాఠకులను ఆకర్షించగల్గడం వేరు ఇక కొన్నివందల, వేల, యేండ్ల తర్వాతగూడా ఆకర్షించేశక్తి కవిత్వంలో నిలిచివుండడం వేరు దాన్ని ముందుతరాలవారే మన కన్న బాగా నిర్ణయించగల్గుతారు. ఒక సంస్కృతకవి అన్నట్టూ, మానవుడై పుట్టడమే ఒక మంచిఅవకాశం అనుకొంటే ఆ మానవుడు విద్యాధికుడు కావడం కష్టసాధ్యం. అందులో కవిగా పేరు తెచ్చుకోవడం కష్టతరం. ఆ వచ్చినపేరు యుగయుగాలూ, తరతరాలూ నిలిచేలా రచించగల్గడం అంటే మరెంత కష్టం? అసలు సంగతి ఎక్కడుందో, దాని కసరేదో, పిసరేదో పసికట్టడానికి నేడు తీరిక లేకపోతే రేపైనా లభించి తీరుతుంది.

'సంఘర్షణ అనేది మానవ జీవితంలో వుంది'. అది సరే 'కాని సంఘంలో మానవుని అంతస్తు (వర్గస్థాయి కావచ్చు) బట్టికాదు' అన్నారు శ్రీ రత్నంగారు. సాంఘిక రాజకీయ విప్లవాలతో నిండిన ప్రపంచ మానవ చరిత్రలో కనిపించే పరిణామ దశలను జాగ్రత్తగా పరిశీలిస్తే సంఘర్షణ అనేది ఎప్పుడయినా ఏదో ఒక అంతస్తు (వర్గం) వ్యక్తులలోనే విశేషంగా కనిపిస్తుంది. మిగతా వర్గాలలో అది తక్కువగా కనిపిస్తుంది. ఎక్కువ సంఘర్షణలో పడిపోయిన వ్యక్తులకు కవులు తమ కావ్యాలలో ఎక్కువ స్థానం ఇవ్వాల్సి వస్తుందిగదా! శ్రీ రావుగారూ అదే పంథాలో చెప్పుతూ వచ్చారు. ఇక 'రచయిత ఇతివృత్తాన్ని మలచుకొనే టెక్నిక్' అనండి మరేమైనా అనండి ఆదంతా 'కవిభావుక భావ్యమానం' లోని భాగమే.

రామాయణ కవులు 'ఊర్మిళ'కు అన్యాయం చేశారని ఎవరో ఎందుకో అన్నమాటను మనంగూడా నమ్మి ఊరుకుందామా? సీతమ్మ కష్టాల కన్నీటి కథ (సీతాయాః కథనమ్ మహత్)లో నిమగ్నుడై

పోయిన వాల్మీకి ఊర్మిళను మరచాడనుకొందామా? ఏ కవియైనా ఇతివృత్తంలోని ముఖ్యపాత్రలపైనవే ఎక్కువ శ్రద్ధ చూపుతాడు. అంతేకాని, ప్రతిపాత్ర వద్దా తన పరకాయ ప్రవేశ విద్యను ప్రదర్శించడం ఏ కవికీ సాధ్యం కాదు. అవసరంకూడా కాదేమో. వాల్మీకి అంతే చేశాడు. తరువాతి అనుయాయి కవులు సరేసరి. ఊర్మిళ పాత్రను శ్రీ మైథిలీశరణ గుప్త స్వప్రతిభతో ప్రదర్శించారు ఇలా మరొక కవి భావుక భావ్యమైన ఊర్మిళ 'సాకేత్'లో ప్రదర్శింపబడింది ఊర్మిళవరకేకాదు. ఇంకా ప్రశ్నలు బయలుదేరి రామాయణంలోంచి 'అగస్త్యభ్రాత'లను గూడా చూపవచ్చు. ఆయా ఉపజ్ఞలు వేరు.

'శ్రీ రావుగారు ఎంతకీ షేక్స్పియర్‌నే ఉదాహరణగా తీసుకొన్నారు' అనుకోవడంగూడా ఎందుకు? కొందర్ని చెప్పారు. ఇక 'షా' 'నేను షేక్స్పియర్ కంటే ఎత్తులో ఎక్కువ' అని ఒకచోట ఛలోక్తిగా అన్న మాటను విన్నారుకదా! కాళిదాసు అనండి షేక్స్పియర్ అనండి—ఇలాంటి ద్రష్టలను ఎన్నిసార్లైనా ఉదాహరించుకోవచ్చు. ఎన్నిరకాల బోల్షివిక్ ఉద్యమాలు — సూర్యచంద్రులమా, నక్షత్రాలమా తాత్కాలికంగా ఆవరించే మేఘపటలాల్లాగా—వచ్చినా ఎక్కడో సందుచేసుకొని ఎప్పుడో మెరుస్తూనే వుంటారు వీళ్లు. Christopher Caudwell అంతవాడు షేక్స్పియర్‌ను బూర్జువాకవి అని అంచనా కట్టబోయి సకలతిప్పలూ పడ్డాడు. చివరకు ఇలా అనగలిగాడు. 'As Player and as dramatist he (Shakespear) lived with his audience in one simultaneous public world of emotion. That is why Elizabethan poetry is, in its greatest expression, drama-real, acted drama. It can still remain social and public and yet be an expression of the aspirations of the bourgeois class because of the alliance of the monarchy with the bourgeoisie.' (Illusion & Poetry P. 72.).

'నేటి యాంత్రికజీవితంలో (మనిషికి కథానాయకుడు కాగల గాంభీర్యం ఉండడంలేదు అని శ్రీ రావుగారన్నమాట నిజమే) కవిత్వాన్ని గూడా యంత్రాలే ఉత్పత్తి చేస్తున్నప్పుడు? నేటి మనిషిలో కథానాయకునిలక్షణాలను మరోవంక దర్శించాలనడంలో శ్రీ రత్నంగారితో ఏకీభవిస్తున్నాను శ్రీ రావుగారు గ్రహించిన 'గాంభీర్యం' కొన్ని కొన్ని వ్యవధులలోనైనా ఒక స్థిరవ్యవస్థ వుంటూ వచ్చిన చరిత్ర మలుపుల లోనిదని అనుకొంటున్నాను. ఇప్పటి అనవస్థ పరంపరలలో మనిషికి గాంభీర్యం దాగిపోతున్నది. దాని చుట్టూ దైన్యచాపల్యాలు ఆవరించాయి. దీనికి శ్రీ రత్నంగారు ఉటంకించిన ఆంగ్ల వాక్యాలన్నీ 1922 నుండి నేటి దాకా సజీవమైన ఉదాహరణాలు. నేడు మనిషి గాంభీర్యాన్ని తెచ్చిపెట్టుకోవలసిందే. శ్రీ కాంగారి హనుమంతరావుగారి (ఏప్రిల్ భారతి) వ్యాసంలోని చివరి వాక్యాలు ఆ వ్యాసంపై కలిగే సందేహాలన్నింటికీ సమాధానాలుగా వున్నాయని నా మనవి.

—శ్రీ ముకురాల రామారెడ్డి.



# గ్రంథ విమర్శలు

## మానవుడు-నాకు-దేవుడు

(రచన: 'వెన్నం'; ప్రచురణ: కవితా పబ్లికేషన్స్—విజయవాడ—2; 108 పేజీలు; వెల రు 2)

ఈ పుస్తకం పేరు వినగానే మానవతావాదాన్ని వివరించేది కాబోలుననిపిస్తుంది కాని యిందులో మానవతావాదమని చెప్పదగిన దేమీలేదు. మానవతావాదం పేరుబెట్టి శాకాహారాన్ని ప్రచారం చేసేవాళ్ళు, ఏ ప్రాణినీ ఎప్పుడూ చంపకూడదనే అహింసాతత్త్వాన్ని ప్రచారం చేసేవాళ్ళు కొందరుంటారు. కాని ఆ విధమైన జీవకారుణ్యవాదము కూడ యీ గ్రంథంలో లేదు. పుస్తకమంతా చదివిన తరువాతకూడ కవి మానవుని దేవునిగా ఎందుకు సంభావిస్తున్నాడో అర్థం కాదు. మానవ జీవిత గమ్యం గురించి చర్చిస్తూ కవిచేసిన ఆలోచనల్నింటినీ యీ గ్రంథంలో చేర్చారు ఈ ఆలోచనలలో కవిత్వం చాల తక్కువ. వచన కవిత్వ పద్ధతిలో సాగిన వీరి రచనలో కవిత్వపు పాలు తక్కువ. శుష్క వచనం ఎక్కువ. కవితా సత్యాలను చెప్పటంలో కవిత్వాన్ని కాంతాసమ్మితంగానూ, వ్యంగ్య వైభవంతోనూ తీర్చిదిద్దాలన్న కాంక్షకంటె సత్యాన్ని తాత్త్వికచింతనలో యిమిడ్చి చెప్పాలనే ఆకాంక్ష మాత్రమే వీరిలో వ్యక్తమౌతున్నది. అందుకే

'కవితా సత్యాన్ని నిత్యం రాజట్టుకోటానికి
ఎడమనుండి కుడికి దొర్లాలి
కవితా సత్యాన్ని తత్త్వంగా నిలబెట్టుకోటానికి
స్వప్నంలో మేల్కొని వ్రాయాలి'

అని అన్నారు. వీరి మాటల్లోని ఎడమనుండి కుడికి దొర్లటమేమిటో అగమ్య గోచరంగానే ఉన్నది. కవితా సత్యాన్ని తత్త్వంగా నిలబెట్టుకోటానికి స్వప్నంలో మేల్కొని వ్రాయాలన్న వీరి భావాలను

'కలను నిజపరచటం కాదు కవిత్వం
నిజాన్ని కలగనటమే దాని తత్త్వం

అనే మహాకవి ఆలోచనలతో పోల్చిచూస్తే, నిజాన్ని స్వప్నంలో చూచేటప్పుడు దాన్ని ఆవిష్కరించాలని కాబోలు యీ కవి అభిప్రాయం. ఏమైనా ఎడమనుండి కుడికి దొర్లటంలాంటి సంకేతాలవలన మాత్రం ప్రయోజనం శూన్యం. కవితాత్త్వికమైన చింతనలో పడి

'నేను జీవితాన్ని నాటకంగా నటిస్తున్నానో,
లేక నాటకాన్ని జీవితంగా పరిగణిస్తున్నానో ?

అన్నసందేహానికిలోనై

'జీవితం ఒకేసారి ఆడబడేది
భావిఅంకం ప్రయోక్తకు అవ్యక్తమైనది;
నేనీ నాటకంలో సహజమైనదుఃఖము పొందినగాని
నిజమైన సుఖసౌరభాలు ఆఘ్రాణించనేలేదు'

అని ఆత్మానుభవాన్ని విశదీకరిస్తారు. పుస్తకమంతా యీ విధమైన తాత్త్వికచింతన కనిపించినా బాగుండు. కవిత్వానికీ, తత్త్వశాస్త్రానికీ దగ్గర సంబంధమే ఉన్నది. కాని కావ్యమే తత్త్వశాస్త్రం కాకూడదు. ఈ పుస్తకంలో ఛాయామయమైన కవి భావాలు కొన్నిచోట్ల ఏ తత్త్వాన్ని ఆశ్రయిస్తున్నాయో తెలీదు.

'ఆకలిమంటలు పెరిగిపోయాయట
అందుకే జనాన్ని తగ్గిస్తున్నారట—' అని జనసంఖ్యను పరిమితం చేయటాన్ని హేళనచేస్తూ

'తెలివిగలవారికి జన్మరాహిత్య మవుతుంది
తెలివిలేమి జనము పెరగబోతుంది—' అని అవివేకపు వ్యాఖ్యానం చేశారు. కాని జనసంఖ్యను పరిమితం చేసినప్పుడు తెలివిగలవారికి జన్మరాహిత్య మెందుకవుతుంది?

వర్తమానాన్ని విస్మరించవద్దని హితవు చెప్పటం మంచిదే కాని

'గతం పాయిఖానా కారాదు
భూతం బందిఖానా కాకూడదు' అని కవి

చెప్పటం ఘోరం. ఈ మాటల్ని చదివినప్పుడు పాఠకులకు కవిత్వం ఏవిధంగా ఉండకూడదో తెలుస్తుంది. కవిత్వ మెప్పుడూ యీ విధంగా ఏహ్యమైన అనుభూతిని కల్గించకూడదు.

> ''నేను'అనే పదార్థం జన్మకు రాకపోతే
> మిగిలిన ఈ ప్రపంచం ఏమైతేనేం
> మిలిన ఈ ప్రపంచం మాయకాక ఏం'

ఈ విధంగాచేసే ఆలోచనలవలన పాఠకుల కే అనుభూతీ కలుగదు. ఈ కవి చెప్పుకున్నట్లే 'నాలో శక్తి ఉడిగెను; జిజ్ఞాస పెరిగెను' అన్న మాటలు నిజమనిపిస్తాయి:

> 'నా ఉద్యోగం పదిమందిలోకి పయనించటం
> నా లక్ష్యం పదిమందీ లక్ష్యం తెలుసుకోవటం
> నే భుజించటం సుక్షేత్రాలు పాలు పిదుకుచోట
> నే ఉపవసించటం ఎడారులు నోళ్ళు తెరచుచోట
> వీరు నా మానవులు—వీరి హృదులలో పార్లి యాడెదను
> వీరు నా మానవులు—నా పూజావిగ్రహాలుగా తలచెదను.'

ఈ విధమైన భావాలు కవికి మానవత్వం పట్లగల ప్రగాఢమైన అభిమానాన్ని వెల్లడిస్తాయి. కాని యీ విధమైన భావాలు యీ పుస్తకంలో చాల తక్కువ. కవితాస్పర్శయైనా లేని అయోమయ తాత్త్వికచింతన, శుష్కమైన వచనరచనలోఉండి మరింత పేలవంగా ఉన్నది.

> 'తొలిముద్ద దేముడికికాదు పెట్టాల్సింది
> సాటిపేద ఓ సహాయం కోరినప్పుడు'—

ఈ విధమైన సందేశాలైనా కొంతకుకొంత మెరుగు పుస్తకంలో మొదటినుండీ చివరిదాకా సాగిన తాత్త్వికోపన్యాసాలు చదువరులకు విసుగు కల్గిస్తాయి. ఐనా కవి తన తాత్త్వికచింతనే ముఖ్యమనుకుంటాడు. అందుకే

> 'భావాలు నింపటానికి పదాలు ఏరుకున్నాను
> పదాలు పుంజటానికి భావాలు ఊదించాను;
> ఏది ఏంచేసినా ఇది కవిత్వమని అనటంలేదు
> ఎవరేమన్నా ముందు సాగిపోవటాన్ని ఆపటంలేదు'

అని గుండె నిబ్బరంతో చెప్పుకొన్నారు.

> 'నా జీవితంలో ఏదో గొప్పమార్పుకోసం
> నా జీవితంలో ఏదో అదృష్టంకోసం
> అలసిపోయి నిలుచున్నాను'

అని కవి నిస్పృహపడ్డారు. ఆ అదృష్టం కవిత్వమే కావొచ్చు వీరి తాత్త్వికచింతనకు కవిత్వం తోడైతే దాని కొక స్పష్టమైనరూపం రావొచ్చు. అప్పుడు కవి కోరిన మానవత్వం 'మానవుడు—నాకు—దేవుడు' అనేది సార్థకమౌతుంది.

## శంఖారావం

### (గేయ సంపుటి)

(రచన: గజ్జల మల్లారెడ్డి; ప్రచురణ: విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, ఏలూరురోడ్డు విజయవాడ—2; సాధ్రతి రు. 2.50; 114 పేజీలు.)

అభ్యుదయ కవిత్వం కొన్నాళ్లపాటు నిద్రపోయి మళ్ళీ మేల్కొన్న తరువాత వడిగా నడకసాగించింది. రెండవతరం అభ్యుదయ కవులలో శ్రీయుతులు గజ్జల మల్లారెడ్డి, సి విజయలక్ష్మి, సి. వి కృష్ణారావు, వరవరరావు ప్రముఖులు. వీరందరూ సామాజిక ప్రగతివాదులని చెప్పవచ్చు. గజ్జల మల్లారెడ్డిగారు తమ 'మల్లారెడ్డి గేయాల'ద్వారా అభ్యుదయ కవితా ప్రియుల కిప్పటికే సన్నిహితులు మల్లారెడ్డి గేయాలను పరిచయంచేస్తూ శ్రీ రాచమల్లు రామచంద్రారెడ్డి మల్లారెడ్డిగారిది కొత్త కవిత్వమని చెప్పారు. సంప్రదాయబద్ధమైన కవిత్వ విర్శనాలకు లొంగక వీరి కవిత్వం కొత్తదానాన్ని సంతరించుకొన్నదని చెప్పారు. 'మన జాతి జీవితంలో అణువణువునూ ఆవేశించిన అబద్ధం, మన రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక జీవిత రంగాలలో ప్రత్యంగుళమూ ఆక్రమించిన అసత్యం, మన Public Life లోనూ, Private Life లోనూ నరనరానా తాండవిస్తున్న అనృతం — దీనినే కవి Explain చేస్తున్నాడు;

## గ్రంథ విమర్శలు

Expose చేస్తున్నాడు' అని రామచంద్రారెడ్డిగారు మల్లారెడ్డిగారి కవిత్వతత్వాన్ని విశదీకరించారు. ఐతే ఆ కవిత్వంలో కొత్తదనమేమున్నది? అభ్యుదయ కవుల లక్ష్యం గూడ అదేకదా? అని ఎవరేనా అంటూరేమోగాని, మల్లారెడ్డిగారి కవిత్వ మాత్రం కొత్త కవిత్వమే. 'శంఖారావం' అనే యీ గేయసంపుటి మాత్రం పూర్తిగా హితది.

అభ్యుదయ కవులు సంప్రదాయాన్ని ధిక్కరించినా కవిత్వానికి మూలమని చెప్పదగిన రసం, ధ్వని, వ్యంగ్యం—వీటిని పూర్తిగా విడిచిపెట్టలేదు. అభ్యుదయ కవులు ఛందోబద్ధంగా వ్రాయటంలేదని నిరసించిన వారుగూడ వారి గీతాలలో కవిత్వంలేదని ఆక్షేపించలేదు. ప్రగతితత్వాన్ని పనిగట్టుకొని ప్రచారం చేసినందున, ప్రతిభ కొరవడిన కొందరు కవులలోమాత్రం అభ్యుదయ గీతాలు ప్రచారగీతాల స్థాయికి, నినాదాల స్థాయికి దిగజారిపోయాయి. ఏ కవితోద్యమంలోనయినా 'తాలూ తప్పా' రాక తప్పవు. అవిపోయిన తరువాత మిగిలిన అభ్యుదయ కావ్యాలలో కవిత్వంలేదని అనటానికి విమర్శకులు పూనుకోవటంలేదు. అసత్యమూ, అనృతమూ, దురాగతాలపైన అభ్యుదయకవులందరూ యుద్ధం ప్రకటించినవారే. వాటిని Expose చెయ్యటంలో ఛందస్సంప్రదాయాలను ధిక్కరింపజూచినా, కవిత్వ పదార్థానికి కొత్తరూపు కల్పించటానికి మొదటితరం అభ్యుదయకవులంతగా ప్రయత్నింపలేదు. మల్లారెడ్డిగారి కవిత్వానికి Satire ప్రాణం. కొన్నిచోట్ల వీరి Satire సాదాగానే ఉంటుంది కాని కొన్నిచోట్ల ఎవరినైతే హేళనచేస్తున్నారో వారి దుస్థితిపైన, వాళ్ళు కట్టుకున్న గాలిమేడలపైన, వాళ్ళు మురికిగుంటలలో బ్రతుకుతూ అవి మురికిగుంటలని గుర్తింపలేని అజ్ఞానంపైన, సంఘంలో ఏమాత్రం మార్పువచ్చినా యిప్పటి తమ స్థితి యింకా దిగజారిపోతుందనీ, కొంప మునిగిపోతుందనీ భయపడేవాళ్ల వకౌళ్యంపైనా మల్లారెడ్డిగారు ధ్వజమెత్తారు. తమ కవితాశస్త్రానికి అపహాస్యపు పదునుపెట్టి విజృంభించారు. 'భక్తిరసం'; ఇంటర్వ్యూహం; జ్ఞానమార్గం; 'అమాత్యసుభాషితమ్'వంటి గీతాలను మొదటి సంపుటంలో వెలయించి కొత్తదనాన్ని నెలకొల్పి కీర్తిని గడించారు. కాని 'శంఖారావం' గీతాలు మల్లారెడ్డిగారి కీర్తిని యినుమడింపజేయకపోగా తగ్గిస్తున్నాయి వీరు కవిత్వంలో ప్రవేశపెట్టిన కొత్తదనం తాటాకుమంటలాగా తొందరలోనే చల్లారిపోయింది. కవిత్వంలో కొత్తమార్గాన్ని నెలకొల్పజూచిన మల్లారెడ్డిగారు మాత్రాఛందస్సులకు బందీ అయిపోయి పాడినపాటలే మళ్లీ పాడుతూ, తమ కవిత్వాన్ని ప్రజలు మరచిపోతారేమోనని మొదట చెప్పిన భావాలనే మళ్లీ రెండవ సంపుటంలోగూడ చాలవరకు దించేశారు చెప్పేటందుకు కొత్తభావాలు లేకపోతే కొత్తగీతాలు వ్రాయాలన్న నిర్బంధమేమున్నది. తన గీతాలకు తానే ప్రతిధ్వనులను వినిపించజూడటం కవిలో కవితావేశం తగ్గిపోయిందనటానికి ప్రత్యక్ష నిదర్శనం. 'పిలుపు'అనే కావ్యఖండిక లోని భావాలే 'శంఖారావం' అనే యీ గీతాల సంపుటిలోఉన్న 'శంఖారావం'అనే గీతంలో పునరుక్తులవుతున్నాయి. 'కూపస్థమండూకాలు' అనే గీతం మొదటి సంపుటిలోని 'పేరిగాని దర్బారు' అనే గీతానికి ఛాయ 'ఆపద మొక్కులు'అనే గీతం 'భక్తిరసం'అనే గీతానికి మరొక రూపం. 'జ్ఞానమార్గం' గీతానికి 'అంతర్వాణి' అనేగీతం ప్రతిధ్వని. స్వల్పమైన భేదాలున్నా తనకుతాను ప్రతిధ్వనులను పల్కటం వ్యర్థపదాలతో పద్యాలను నింపటం వంటిదే చలంగారన్నట్లు యిదికూడ 'ఆత్మలోకంలో దివాలా.'

'శంఖారావం' కావ్యసంకలనంలో 'త్రిశంకు స్వర్గం; ఆర్తగీతి; యక్షప్రశ్నలు; ఉద్వేతమ్; అనేగీతాలు యెన్నదగినవి గుమాస్తాల జీవితాలు త్రిశంకుస్వర్గాలు.

"ఆఫీసుల కనిపెట్టుక
సాఫీగా బ్రతుకుతాము
అంతరాత్మలను పెంపుడు
జంతువులుగ పెంచుతాము."

అని దీనంగా మొరపెట్టుకుంటూ 'ఇంక్రిమెంటుల్లా' బోనసులతో తృప్తిపడి, చిన్నచిన్న సుఖాలే పరమానందంగా యెంచుకుంటూ

"మాసాంతం రోజుల్లో
ఆసాంతం కృంగిపోయి
మెయిన్‌రోడ్లు వదలి మూరు
మూలల్లో తిరుగుతాము!"

"జీతంలో ఒకపాటిక
చెల్లాస్తాం హాసురెంటు
హాసంటే హౌసా? అది
హవారాని ధుంవామహల్!"

త్రిశంకు స్వర్గానికి
తిరుగులేని వారసులం!
మాదొక స్వర్గం!
మాదొక 'వర్గం'!

అని చెప్పుకుంటూ ప్రగతిని నిరోధించి భక్తిమార్గం పట్టి మూఢనమ్మకాలను వంటబట్టించుకుంటారు. ఆర్తగీత అనేగీతంలో కమ్యూనిస్టులు రాష్ట్రాలలో పరిపాలనను కైవసం చేసుకోటంతో బెంబే మొరపెట్టుకొనే వారి అవస్థను హేళనచేశారు.

"విశ్వకవీంద్రుని కీర్తికి
నశ్వరత్వమొచ్చిందా!
జగద్గురుని కేరళలో
శాసకులే నాస్తికులా?
పావన గంగా యమునా
తోయము విషకలుషితమా?
ఏరీ మము జూచువారు?
లేరా మము జూచువారు?"

ఈపద్ధతిలోనే గాకుండా మొరార్జీ, యస్కేపాటిల్, రాజాజీలనుకూడ ఎవహేళనచేశారు అంతటితో ఆగకుండ జాన్సన్ కంసుడనీ డాలర్ భేతాళుడనీ అమెరికా అంటే అసహ్యం ప్రకటించటంతో కవిత్వం రాజకీయోపన్యాసమై కూర్చున్నది.

'సర్వజ్ఞులు ఎవరంటే
సణుగుతా వదేలరా?
మంత్రివర్యు లుండంగా
మరియెవ్వరు గురువరా?
రాజకీయరంగంలో
రాణించే దెల్లరా?
బహుపాత్రాభినయ కళా
వైదగ్ధ్యంతో గురూ!
చీనా పాకిస్తానల
చేరిమికి అల మూలమేమి?
శత్రువుశత్రువు మిత్రుడు
సూత్రమేమి గురువరా!
అడగని వరమిచ్చు వేల్పు
లంటూ వున్నారురా?
ఎలెక్షన్లలో నిలిచి
అభ్యర్థులె గురువరా?—

ఇవి యక్షప్రశ్నలు గీతంలో కొన్నిపాదాలు. ఈ గీతం మరీ పెద్దది. కవికి తోచిన భలోక్తులన్నీ చెప్పటంతో కవిత్వ లో Sincerity పోయింది. కవి ఆశించే ప్రయోజనం సహృదయులకు అగమ్యంగానే ఉండిపోతుంది. కాంగ్రెసువారి పాలనలో ప్రభుత్వాకీ, పార్టీకి భేదంలేదనీ, ప్రభుత్వ యంత్రాంగాన్ని పార్టీ పనులకు వినియోగిస్తున్నారనే నిజమైన కోపాన్ని 'ఉద్యోగిలమ్' కావ్యఖండికలో ప్రవేశపెట్టి ప్రభుత్వాన్నీ, కాంగ్రెసుపార్టీనీ బాగా అవహేళన చేశారు. కొందరు కవులైనా యీ విధంగా పూమకొని ప్రభుత్వం కళ్లు తెరిపించటం అవసరం ప్రజలు నిద్రపోవటంలేదని వారి పక్షాన ప్రభుత్వాన్ని హెచ్చ

రించటానికి కవి కంకణం కట్టుకుంటున్నాడు. 'భళే చాకబేరము' అనేది స్వార్థపరులను హెచ్చరిస్తూ వాళ్లను అవహేళనచేసే గీతం. ఈ గీతం చదివితే ఇటువంటి గీతాలు మన కవిత్వానికి పుష్టిని చేకూరుస్తాయని నమ్మకం కలుగుతున్నది

ఇంకా ఈ కావ్యసంకలనంలో మగ్దూం మొహిద్దీన్, సర్దార్ అలీజాఫ్రీ కవుల రచనలకు అనువాదాలుకూడ ఉన్నాయి. ఈ కవితలు పఠితల నంతగా కదిలించలేవు. ఒకానొక సమయంలో ఉద్యమ సారథియైన కవి ఆలపించిన గీతం ఆనాటి అనుయాయులకు రుచించి ఆనందింపజేసి ఉండవచ్చు. కాని వాటి అనువాదాలు చదివినప్పుడు మన పఠితలకు కలిగే ఆనందం పూజ్యం.

ఇంకా ఈ సంపుటంలో కవి తన పాత స్నేహితులైన మార్క్సిస్టుల నుద్దేశించి 'పాత చెలికాడా!; 'బుక్కులు'; 'వృశ్చికసంతానం' వంటి గీతాలను వ్రాశారు. సామ్యవాద మహార్ణవములో పిడివాదభావాల సుడిగుండముల పాలబడి మునిగిపోతున్న పాతచెలికాణ్ణి హెచ్చరించే రీతిక్రమంగా పెచ్చుపెరిగి, మార్క్సిస్టులనాయకుడైన మావోసేటుంగ్‌ను 'మహాతాత్త్వికుని'గా చెప్పటం మొదలుపెట్టి మహామాంత్రికునిగా తేల్చారు. అంతటితో ఆగక రెడ్‌గార్డులను వృశ్చికసంతానంగా అభివర్ణించి నిందకు దిగజారారు మార్క్సిస్టులమాటల్లో 'రివిజనిస్టులు' విషపురుగులలో మరీ ప్రమాదమైన పాములసంతతి కాబోలు! ప్రజాసమస్యల్ని చర్చిస్తూ కవిత్వం వ్రాయటమంటే రాజకీయపక్షాలు నొకరినొకరు తిట్టుకోవటంకాదనీ, ప్రభుత్వవిధానాలనుగాక పాలకవర్గం లోని వ్యక్తులను దూషిస్తే కవిత ప్రయోజనం శూన్యంమనీ, అమెరికాదేశపువద్దతులనేగాక అమెరికాదేశపు ప్రతిచర్యనూ ద్వేషించటమే తమ ధ్యేయంగా, ద్వేషాన్ని సత్కరిస్తే ప్రయోజనం హాళక్కియనీ ఎంత తొందరగా గ్రహిస్తే అంత మంచిది.

మహాకవి శ్రీశ్రీ 'హలోపాతకుడా' అనే పరిచయవాక్యాలలో విజాతీయమైన రాజకీయపక్షాలను ద్వేషించటం పనికిరాదని హెచ్చరిస్తూ 'ఉమ్మడిశత్రువును కలిసికట్టుగా ఎదిరించడంపోయి మనలో మనం దెబ్బలాడుకోవడమే మన అనర్థాలన్నిటికీ మూలం.' అని నొక్కిచెప్పారు. శ్రీ మల్లారెడ్డిని 'రేపటికవి'గా ప్రశంసించిన శ్రీశ్రీ మాటలకు ఈ పరిచయవాక్యాలకు చాల అంతరం ఉన్నది. శ్రీశ్రీ మల్లారెడ్డి గారిని రేపటికవిగా యెంచిన నాటికి మల్లారెడ్డిగారు తనకు తానే ప్రతిధ్వనికాలేదు మాత్రా ఛందస్సులను స్వీకరించినా, వాటినే అంటిపెట్టుకొని వాటిలో బందీ అయిపోతారనిపించలేదు రోజువారీ రాజకీయాల పైన, రాజకీయనాయకుల అవకతవకలపైన నిత్యగీతనైవేద్యం పెడతారనుకోలేదు. రాజకీయాలు కవిత్వానికి పనికిరావని అభ్యుదయకవులెవ్వరూ అనుకోలేదు. మల్లారెడ్డిగారి కొత్తదనం రాజకీయనాయకుల పేర్లను సైతం అవహేళనచేస్తూ, కవిత్వం తగ్గి ఉపన్యాసం పెరిగి, వ్యంగ్యం తరిగి తిట్లశాతం పెరిగి పాఠకులకు వైముఖ్యం కల్గిస్తున్నది. అభ్యుదయ కవిత్వం అవీ యివీ ఎన్నిసాధించినా అంత్యప్రాసలకు కట్టుబడిపోవటం ఘోరమనియెంచి శ్రీ కుందుర్తి ఆంజనేయులు వచనకవిత్వపు అవసరాన్నిగూర్చి విస్తృతంగా ప్రచారం చేశారు. గురజాడ మహాకవి పునరుజ్జీవింపజేసిన మాత్రాఛందస్సులపట్ల గాఢమైన అభిమానంతో భావకవులు అభ్యుదయకవులు కూడ ఆ ఛందస్సును ఆదరించారు. కాని వాటికే కట్టుబడిపోలేదు. శ్రీ మల్లారెడ్డిగారి మాత్రాఛందోబద్ధ రచన 'నేతిబీరకాయ'వంటి గీతాలలో అద్భుతంగానే వచ్చింది. స్వేచ్ఛగా వ్రాయదగిన భావాలను పట్టుబట్టి మాత్రాఛందస్సులలోకి కుదించినట్లు కొన్ని గీతాలలో కన్పిస్తున్నది.

మల్లారెడ్డిగారి కవిత్వాన్ని గురించి శ్రీ శ్రీ 'ఇతడు సొంతంచేసుకున్న శిఖరాలు చాలా వరకు ఇతని మొదటి సంపుటంలోనే ఉన్నాయి' అనీ మల్లారెడ్డిగారు ముట్టడిస్తున్న కవితా శిఖరాలలో 'బుక్కులు'; 'వృశ్చిక సంతానం' అనే వాటిలో మావోవిూదా, రెడ్‌గార్డులవిూదా తొడచరచటాన్ని నిరసించారు. 'వీటిన్నేను అర్థం చేసుకున్నానుగాని

ఆమోదించలేకపోతున్నాను' అన్నారు. ఇంకా 'రష్యా చైనాలమధ్య వైరుధ్యం ఏర్పడింది. ఇది రాజకీయా లతో ఆగక సాహిత్యంలోకీ, సకలకళలలోకి దూసుకు రావలసిందేనా? అనికూడ ప్రశ్నించారు శ్రీ శ్రీ. ఇది ఎబబ్బైనమాటకాదు. ఏం? ఎందుకని సాహిత్యంలోకీ, సకలకళలలోకి దూసుకురాకూడదు? దాచేస్తే దాగని సత్యాలు ప్రజలందరికి కావాలి. తనకి పొట్టే, మరొకడికి ముక్కా అనే తత్వం యిక్కడకూడ పనికి రాదు. శ్రీ శ్రీ అన్నట్లే సామ్యవాదం ఒక మహా వృక్షం. దాని శాఖోపశాఖలు ప్రపంచమంతటికి విస్తరి చేస్తున్నాయి. ఏ కొమ్మ చేవగలదో, ఏ కొమ్మ శ్రేయ మైనదో, ఏ కొమ్మ గమ్యానికి చేరుస్తుందో, ఏ కొమ్మ రక్షణ కల్పిస్తుందో, ఏ కొమ్మ స్వేచ్ఛ నిస్తుందో అందరూ తెలుసుకోవాలంటే సకలకళల లోకీ యీ వైరుధ్యాలు వ్యాపించాలి.

'బానిసల సంకెళ్ళు బిగిసే
పాడుకాలం లయిస్తుందా?
సాధుసత్వపు సోదరత్వపు
స్వాదుతత్త్వం జయిస్తుందా?'

అని ప్రశ్నించిన శ్రీశ్రీ రష్యా చైనాల మధ్యవచ్చిన వైరుధ్యాలు సమస్త కళలలోకీ దూసుకువస్తే ప్రమాదమని ఎందుకు శంకించాలి? నడుమ తడ బడినా, సడలినా, మునగక పడవతీరం క్రమించా లంటే రాజకీయసిద్ధాంత వైరుధ్యాలను కళలలోకి ప్రవేశింపనీయవచ్చు.

మల్లారెడ్డిగారి 'శంఖారావం' పిలుపుచేత ప్రగతివాదులెవ్వరూ లేచి నడువరు. ఈ పిలుపు చాల పాతది. ఇప్పుడు మళ్లీ లయబద్ధంగా (మాత్రా ఛందస్సుల సంకెళ్లు తగుల్చుకుని) పాడిన పాటలే పాడితే అవి అభ్యుదయవాదులక్కూడ రుచించవు.

'శంఖారావం' అచ్చువెయ్యటంలో విశాలాంధ్ర ప్రచురణాలయంవారు బాగా శ్రద్ధ చూపించారు. పుస్తకం అందంగా వచ్చింది.

—శ్రీ రామమోహనరాయ్.

# 1. చా సో క థ లు

(రచన: చాగంటి సోమయాజులు ప్రతు లకు: విశాలాంధ్ర ప్రచురణాలయం, ఏలూర్‌రోడ్డు, విజయవాడ 2, వెల: మేలు ప్రతి 4–00. సాదా ప్రతి 3 00)

శ్రీ చాగంటి సోమయాజులు చిరకాలంగా వివిధపత్రికలలో రచనలు వెలువరించి పేరు గడించిన రచయిత. సంఖ్యాబలం తక్కువ అయినా వీరి రచనలు గుణాధిక్యంవల్ల మిక్కిలి ఎన్నదగినవి. ఇన్నేళ్లకు వీరి రచనలు ఒక సంపుటంగా వెలు వడడం ఎంతైనా ఆనందింపదగిన విషయం.

ఈ సంపుటిలో 23 కథ లున్నాయి. అన్నింటి లోకి 'ఎంపు' అనే కథ ఎన్నదగినది. ఇది చిర కాలంగా సాహిత్యాభిమానులు గుర్తు పెట్టుకున్న రచన సంఘంలో అట్టడుగున పడివున్న దీనుల యెడ రచయిత హృదయంలో చెలరేగుతున్న వేదన, పాఠకులకు కూడా విదితమవుతుంది. అన్ని రచనల లోనూ సునిశిత పరిశీలనాశక్తీ, కథనంలో సౌలభ్యం, అవసరమైన పట్టులలో భావాల తీవ్రత—ఇవన్నీ కానవస్తాయి. ఈ రచయిత కొన్ని సంవత్సరాలుగా రచనా వ్యాసంగాన్ని విడనాడటం, ముందుమాట వ్రాసినవారు అన్నట్టు, క్షమించరాని విషయమే.

# 2. దుః ఖి తు లు

(రచన: రంధి సోమరాజు. ప్రతులకు: ఎం. శేషాచలం అండ్ కంపెనీ, మద్రాసు, వెల 2-00)

భద్రం గొప్ప చిత్రకారుడు, అతనిలో కళా కారుడి కుండవలసిన బేంగుండె, జాలిగుండె, అమితమైన ఆలోచన, వ్యథ అన్నీ ఉన్నాయి. జమున అతన్ని ఆరాధించింది. అయితే అది కేవలం ఆరాధనగానే మిగిలిపోయింది. మనసును కలచివేసే అనేక సంఘటనల తర్వాత తనలోని కళాకారుడి తృష్ణ తీరక భద్రం భార్యాపిల్లలనూ, ఉన్న ఊరినీ, మాతృదేశాన్నీ వదలి వెళ్లిపోయాడు. తర్వాత కొన్ని ఏళ్ళకు అజ్ఞాతంగా ఎక్కడో ఫ్రాన్సులో మారుమూల

చనిపోయాడు. ఆతర్వాత అతని బొమ్మలకు ఎక్కడలేని ప్రశస్తి లభించింది కోట్లకొలదీ డబ్బు వచ్చింది. అతని భార్య అతని పేరుమీద నిర్మింపబడిన చిత్రకళా భవనముందు అతని శిల్ప రూపాన్ని ఆవిష్కరించడానికి వెళ్ళి ఆ విగ్రహం చెంతనే మరణించింది. ఇదీ కథ. రచన మొదటి నుంచీ చివరివరకూ చాలా కొత్త పద్ధతిలో నడిచింది. ఈ మోస్తరు కథనం ఇదివరకు చాలా తక్కువమంది రచయితలు సాధించారు. ఎల్లరూ చదువదగిన రచన.

## 3. జీవితాదర్శం

(రచన : చలం. ప్రతులకు ఎమెస్కో పాకెట్ బుక్స్. శేషాచలం అండ్ కంపెనీ, మద్రాసు, వెల : రు. 2-00)

తెలుగులో ఆధునిక నవల, కథాసాహిత్యానికి ఆద్యులనదగినవారిలో ఒకరైన శ్రీ చలం రచించిన ఈ నవల ఇదివరకే పాఠకులలో ప్రాచుర్యం సంపాదించింది. అయినా నేటితరం చదువరుల సౌకర్యార్థం ఈ రచనను చవకధరలో అందించడం మంచి విషయం. చలం రచనలమీద పరిశోధన సాగిస్తున్నవారూ, రచయితలలో చలం పావాన్ని నిరాకరణ చేయదలచుకొన్నవారూ, ఇప్పుడిప్పుడు కొందరు బయలుదేరుతున్నారు. ఆయన రచనలమీద పరిశీలనాత్మకమైన వ్యాసాలు వెలువడుతున్నాయి. ఆయన సాహిత్యంమీద ప్రత్యేక సంచికలుకూడ కొన్ని వెలువడ్డాయి. అట్టి జిజ్ఞాసకుల సాహిత్యాభిమానులందరికీ ఆయన రచనలు జనసామాన్యానికి అందుబాటులో వుండే ధరలో వెలువడటం ముదావహమైన విషయం.

## 4. కీలుబొమ్మ

రచన: కన్నడ మూలం: 'త్రివేణి'. అనువాదం: శర్వాణి. ప్రతులకు: దేశిబుక్ డిస్ట్రిబ్యూటర్స్, విజయవాడ-2 వెల రు. 3—00.

సీత బుద్ధిమంతురాలు ఆమెను పెళ్ళిచేసుకున్న నరసింహయ్య దృష్టిలో స్త్రీ, కేవలం శరీర సుఖాన్నిచ్చేయంత్రం. అతడు స్త్రీని అంతకుమించి మరోకదృష్టితో చూడలేదు. భార్యకష్టాలూ, బాధలూ జబ్బులూ, ఏవీ అతనికి పట్టవు. అలా భార్యమనసునూ, శరీరాన్నికూడా నిర్లక్ష్యంచేసి నిజానికి ఆమె మరణానికి కారకుడైనాడు. కొడుకు మధు అన్నట్టుగా సీతది మామూలు చావుకాదు. అది హత్య. ఆ రకమైన హత్యకు శిక్షలేదు. నరసింహయ్యవంటి పురుషులు (భర్తలు) కొందరున్నారు. సీతపాత్ర చదువరులను కదలించివేస్తుంది. అనువాదం చక్కగా ఉంది.

## 5. బ్రతుకు జోరు

రచన: ఎ. లక్ష్మీరమణ. ప్రతులకు ఎమెస్కో పాకెట్ బుక్స్. శేషాచలం అండ్ కంపెనీ, మద్రాసు. వెల రు. 2—00.

పందొమ్మిదవ శతాబ్దానికి చెందిన ఒక ప్రఖ్యాత ఆంగ్ల రచయిత్రి వ్రాసిన నవలకు యిది స్వేచ్ఛానువాదం. ప్రకాశకులన్నట్టు రచయిత్రి చాలా శ్రద్ధగా ఆ పాశ్చాత్య నవలను మన వాతావరణానికి అనువుగా మార్చి వ్రాశారు. చదువదగిన రచన.

## 6. మనువులూ, మనసులూ

రచన: వడ్డాది సత్యనారాయణమూర్తి. ప్రతులకు: వెంకటేశ్వర అండ్ కో. విద్యావిషయక ప్రచారకులు, గుంటూరు—1. వెల 4-50.

శేఖరం, చంద్రం అనే యిద్దరు అబ్బాయిలూ పార్వతి అనే అమ్మాయి—ఈ మూడు ముఖ్యపాత్రలతో సాగిన ప్రేమాయణం అందులో లెక్కలేనన్ని మడతపేచీలు, త్యాగాలు, కన్నీళ్ళు...సగటు సినిమా మార్కు సంఘటనలు, సంభాషణలతో నవల రక్తిచెడింది. పుస్తకాలు చదివి పుస్తకాలు వ్రాయాలని ప్రయత్నించే రచయితలు, కేవలం చదవడం ఒక్కటే రచనలు చేసేందుకు చాలదనీ, తనదంటూ ఒక స్వంత పరిశీలనా, కథన ధోరణీ సాధించినప్పుడే రచనకు పూనుకోవాలనీ గ్రహించడం ముఖ్యం. ఈ రచయిత కొంత చిత్తశుద్ధితో కృషిచేస్తే 'ఒరిజినల్' అనిపించగల నవల వ్రాయగలరని తోస్తున్నది.

## 7. మనుషులు - మనసులు

(రచన: పవని నిర్మల ప్రభావతి. ప్రతులకు: ఎమెస్కో పాకెట్ బుక్స్, శేషాచలం అండ్ కంపెనీ, మద్రాసు. వెల రు. 2-00.)

కలిమిలో పుట్టిపెరిగిన అన్నాచెల్లెళ్ళూ, వారి ఉద్యానవనాలూ, బంగళాలూ, పెళ్లిళ్ళూ, తర్వాతి సమస్యలు, అపార్థాలు, ఇవన్నీ కలిసిన నవల. రచయిత్రి ముక్కుతాడుపోసి నడిపించినట్టు పాత్రలన్నీ నడుస్తాయి సాధారణంగా రచనకు పూనుకునే వారిలో జీవిత పరిశీలనాశక్తిపాలు తగ్గినప్పుడు ఇటువంటి రచనలు వస్తాయి అన్నివిధాలా మంచివాడైన నాయకుడు, వారికి ప్రతిద్వంద్విగా అన్నివిధాలా 'రోగ్' అయిన విలనూ, ఇది చాలా మామూలు పద్ధతి. ఈ నవల చదువుతూవుంటే, ఆ ముఖ్యం వేయడం, విడదీయడం పద్ధతి గమనిస్తూవుంటే చాలా మామూలు సినిమాకథ చదువుతున్నట్టు అనిపిస్తుంది. రచయితలూ, రచయిత్రులూ ఈ స్థితినుంచి ఇంకా ఎదగాలి.

—పి.

### రసతరంగిణి

ఖండకావ్య సంపుటి. రచయిత: మామిండ్ల రామగౌడు. పుటలు-174. వెల-3-00 ప్రాప్తిస్థానం - శ్రీ మామిడ్ల రామగౌడు, రాయకూర్, వయా రుద్రూర్, నిజామాబాద్ జిల్లా.

### భాషాసమస్య

రచయిత: శ్రీ వాసమూర్తి. పుటలు-148 వెల. 2-00. ప్రాప్తిస్థానం — శ్రీ వాసమూర్తి, కూచిమంచి అగ్రహారం. అమలాపురం, తూ. గో. జిల్లా.

### గాంధీశతకము

రచయిత - శ్రీ కూరెళ్ల రామనరసింగరావు. పుటలు — 36 వెల—1—00. ప్రాప్తిస్థానం శ్రీ కూరెళ్ల రామనరసింగరావు, కృష్ణానగరము, విశాఖపట్టణం.

### శివరంజని

రాణ్మహేంద్రవర మార్కండేయ మృత్యుంజయ త్రిశతి — పద్యకావ్యం. రచయిత - శ్రీ చేబ్రోలు చిన్మయ బ్రహ్మకవి. పుటలు-96. అమూల్యము. ప్రాప్తిస్థానం - శ్రీ నర్ని కేదారేశ్వరుడు, విజయ ట్రేడ్స్ కంపెనీ, దేవీచౌక్ దగ్గర, రాజమండ్రి—1.

### పల్లెపడుచు

కవితాసంకలనం, రచయిత—శ్రీ వి. రఘునాథ రెడ్డి. పుటలు-66 వెల-1-50. ప్రాప్తిస్థానం—శ్రీ వి. రఘునాథరెడ్డి, అడ్వకేట్, గాంధీరోడ్, చిత్తూరు.

Printed and Published For Nageswara Rao Estates (Private) Ltd., by Radhakrishna at the Andhra Patrika Press, 6 & 7, Thambu chetty Street, Madras-1.
Editor: S. Sambhu Prasad.